# భారతి

మాసపత్రిక

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938-1972)

ఏప్రిల్ 1984

సంపుటము : 61 సంచిక : 4

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# వి ష యా ను క్ర మ ణి క

## ఏప్రిల్ 1984



ముఖచిత్రం : ముఖలింగ శిల్పం.

ఫోటో పంపినవారు : శ్రీ ఐ. కార్తికేయశర్మ

# శిల్ప భారతి

## శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

వినిపించున్ సనసన్నగా నిటు గుహావీథ్యంతరంబందు మో
హన వీణాక్వణనంబెదో; మృదు పదవ్యాఖ్యాత్వ మంజీరమై
కనిపించున్ గనువిందుగా గిరిదరీ గర్భాలయంబందు న
ర్తన హేలాకలనం బొకం; డరరె! భ్రాంతంబుల్ శ్రవోనేత్రముల్

ఆ స్వయంభువు తాను గల్పాదివేళఁ
గమల నాళాంతరమున జగన్నియంత
కడుపులోని తొల్లిటి యొరవడులు చూచి
చేయునఁటె! త్రిలోకీపున శ్శిల్పరచన.

అరుదౌనిచ్చటి యీ శిలాకృతు లహల్యామూర్తులై తద్యుగా
తరశాపానుభవంబు పొందునఁటె! యుద్యత్కార్తికీ చంద్ర సుం
దరుఁడౌ శ్రావణమేఘ మోహనుని పాదస్పర్శ లాభంబు చే
కుఱుకాలం బిదియేమొ! పండె నిఁటు జన్మశ్రీ శతానందముల్

జీవచ్ఛిల్ప కళాసరస్వతి విపంచిం గేలు సారించి యీ
యావద్భారత దిగ్దరుల్ ప్రతిరవ వ్యాప్తంబుగా రాజ్య ల
క్ష్మీ విశ్రాణన కీర్తి నిష్ఠయుఁ గళా శ్రీ మత్పరాకాష్ఠయున్
బ్రోవుల్ ప్రోవులునైన పాటలుగ నిల్పున్ బ్రాఙ్మహాగాథలన్.

తొలినాఁటన్ మనకాళిదాస భవభూతుల్, వ్యాస వల్మీక జ
న్ములు, శ్రీనన్నయ తిక్కన ప్రముఖ గణ్యుల్ సారసారస్వ తో
జ్జ్వలితం దీర్చిన నాఁటికావ్య రస భావశ్రీలకున్ వ్యంజకం
బు లనంగా స్పృహణీయ జీవకళలం బొల్పొనజంతా గుహల్

చిలికి చిలికి తీసి చేతిలోఁ బెట్టిన
ముద్దులూరు వెన్న ముద్ద లివిగొ!
జాతినేల "ఎల్లొరా" గుహాట్టాలికఁ
గరఁగి నట్టె కరఁగి కరుడు గట్టె.

అవియేనాఁటివొ! లెక్కకున్ నిలిచె సంఘారామముల్ చెక్కుమా
యవు పెక్కబ్దము లిట్లు దాటినను సత్ప్రాణంబు తానాఁటి శి
ల్ప విలాసోదయ కల్పనంబులను స్తూపవ్రాత మీనాఁడు క
న్గవకున్ విందులు చూఱఁజూపు బహిరంతర్గణ్య కారుణ్యమై.

అమరావత్యుపగూఢమై వలపుతియ్యం బెంచి యిక్ష్వాకు రా
జ్యమునన్ నిర్మలినంపు బౌద్ధమత ధర్మా ధర్మముం జూచి యం
దము చందంబును జక్క దిద్దుకొనె శ్రీ నాగార్జునాచార్యు కొం
డ మనోమోహన శిల్ప కల్పన కరండంబై కళాఖండమై.

కఠినోపలమ్మునఁ గమల కుట్మలములు
విరియింపఁజేయు పోగరలకొనలు-
జాతిలో స ప్తస్వర స్నిగ్ధ గీతముల్
పలికింపఁజేసిన యులుల మొనలు-
శిలమీఁదఁ బ్రణయ పేశల మూర్తుల చరిత్ర
కరగించి పోసిన పరికరములు-
పాషాణవీథిఁ బీయూష విప్రుషములు
చిలుకరించిన శిల్పి చేతి వ్రేళ్లు

ఎట్టివో! పట్టిచూడఁగా నిపుడునేఁద
లంచు కొను టిద్దిమన్మనో లక్షణంబు;
సత్త్వగరిమఁ గళాసిద్ధి జరుగుచోట
నమ్మహాశిల్పి కుపకరణమ్ము లేల ?

చందనాచ్ఛాదితోత్సవమూర్తి నరసింహు-
డవతారమైన సింహాచలమ్ము-
హరిభక్తమణికి యోగానంద నృహరి ప్ర
త్యక్షమై యున్న యాదగిరి మెట్ట
తనయుగ్రత హిరణ్యదనుజుఁ జీల్చిన స్వామి
యుదయంబుగొన్న యహోబలమ్ము
పానకంబులు నోటబడఁగా గుటుక్కన
మ్రింగు నవ్వేల్పూరు మంగళగిరి

సర్వ సర్వం సహామర్త్య సార్వభౌము
విందులకు నంకితంబైన వేంకటాద్రి-
అమ్మహాక్షేత్ర పాళి దేవాలయమ్ము
లాంధ్ర శిల్ప రమాన ర్తనాలయములు

పరశివ మందిర బహిరం
తరంగ ధరణీ తరంగిత స్పందమహః
పరిచుంబిత శిల్పమనో
హరాకృతికి నేత్ర మంగళారాత్రి కముల్

# వర్షారమణి

## డాక్టర్ పోచిరాజు శేషగిరిరావు

వరుణాలయమునుండి వార్తవచ్చినదేమో!
కరుణాలయుండైన ఘనఘనాఘనమునకు,
కురిసె చిత్రమ్ముగా కుంభవృష్టిగనేల:
విరిసె పృథివీమాత విమల జీవనముతో

వాయురూపత నింగిఁ వ్రాలి, వెలిముబ్బునయి
హాయిగాచిందించి ఆర్ద్రితను జేకూర్ప,
సలిలధారలు సుధాసారధారలుకావొ!
గళితపృథ్వీదేవి కంఠమాలికలేమొ!

జల జలని వానజల్లులు జాలువాఱంగ
గల గలల సెలయేటి గజ్జెలు నదించినవి:
ఎన్నాళ్ళనుండియొ తపించు సాగరుగుండె
వెన్నెలలు తాకినవి: వన్నెలొలికించినవి:

ఎండి యేకారు గోదావరీపులినమ్ము
నిండి ప్రవహించె నిర్నిద్రవర్షాలబ్ధి:
అదిక్షీరవారాశి నవతరిలు పీయూష
మదిసుధామధుమూర్తి ఆరగించెదుబువ్వ.

స్వాదు నీరము త్రావి పద్మము కనువిచ్చె
మోదపీచికలలో మునిగెను ద్విరేఫమ్ము:
ప్రిదిలి- బీటలువారు పుడమిచేడియు మేను
పదనుతో పులకెత్తె: చదలంటె కోరికలు

నింగి నిలచిన నీలనీరద విలాసినుల్
పొంగి యుబ్బుచు నవ్వ, పూలతోరణములా!
తొలుకాఱు మొయిలులా తొంగిచూచెను శంప
మలు పచ్చి గంధంపు పరిమళమ్ములు మెదిపి

పన్నీటి జల్లువలె సురభిళించుచు గురియు
చెన్నొందవు మదిరారసపు నిండు చషకముగు!
మిన్ను తుదదాక కవితాప్రియుం భావుకుడు
కన్ను మలపుచు బోవు కవితావిపంచితో

పర్జన్యునకు సూర్య భగవానునకు సంధి
పత్రమో! మఱియేమొ! నాసించు నొకత్రేవ!
ఎండ-వానయు కలసి ఏకీభవమునందు
చండ కిరణున కింత సరసత్వ మెటులబ్బె?

ఒకమాఱు వర్షమ్ము ఒయ్యారముగ వచ్చి
పకపకల నవ్వేను పారిపోవును తోన:
ఉరవడిగ నతివృష్టి ఉద్ధతమ్ముగ వచ్చి
వరదలై తెగబడుచు వాగువంకలునింపు:

ఒక చలత్ శృంగార హేలా విలాసమ్ము
వికసిల్లు కనుగొనల వింతవన్నెలు వోవు
హరివిల్లు తోచి, వర్షారమణి వదనమ్ము
మెరపుతీ వెలమాఱ మించి కాంతులు బరపు.

చటుల వర్షావేళ స్వాంతముల్ విరియంగ
పటుతటిల్లతవోలె ప్రణయభానము పొంగి
ఆనందడోలా విహారముల్ చేయుదురు
ఏణీ విలోచనలు హేలగా ప్రియులతో

నకులుడెంతటిజాణ! నవజవాశ్వము నడుప
చకితమౌ మనసు! ప్రజ్ఞాపాటవము నెంచ
చినుకు చినుకుకు నడుమ తను స్వారి చేసెనట!
కనురెప్పపాటులా కదలెనా తురగమ్ము!!

## శ్రీ మాదిరాజు రంగారావు

# పాత్ర స్వరూపం

**అ**క్షర రూపంలో జీవించే వ్యక్తిత్వ రూపాలే నవల్లో పాత్రలు. బహిర్ అంతర్ వ్యక్తిత్వ దర్శనమే పాత్రచిత్రణం. నిత్య జీవితం నుండి ఉద్గమించిన వాస్తవ స్వభావ రేఖలతో స్పందిస్తుంది. అక్కడక్కడా ఎంతో కొంత కల్పన చోటుచేసుకోవడమూ జరుగుతుంది. ఎట్టి పరిస్థితుల్లోనూ మానవీయ సంబంధాలను కాపాడుతూ జీవిత యాథార్థ్యాన్ని ప్రతి ఫలింపజేస్తూ ఉంటుంది. రచన చదువుతూంటే పాత్రల మనస్తత్వం, ప్రవర్తనం, ఆదర్శం పట్ల ఎంతో అభిలాష కలుగుతుంది. వాటిచర్య ప్రతిచర్య ఉద్దేశం ప్రయోజనం పట్ల ఆసక్తి పెరుగుతుంది. కొన్ని పాత్రల్ని ప్రేమిస్తాం, మరికొన్నింటిని ద్వేషిస్తాం. ఒకే పాత్రను ఒకప్పుడు గుండెకు హత్తుకొని, మరొకప్పుడు తోసి పారేయవచ్చు. ప్రపంచంలో వ్యక్తుల పట్ల కలిగే అభిప్రాయమే. నవల్లోనూ పాత్రల గురించీ ఏర్పడుతుంది. వీటి అడుగు నుండి జీవితం ఎన్నో వలయాల్లో శ్రేణులు శ్రేణులుగా యథార్థ సదృశంగా నిర్మితమౌతుంది. ఈ నిర్మాణాల పరిశీలనం అంటే మానవ జీవిత భాగాలతో పరిచయం చేసుకోవడమే.

ప్రపంచంలో వ్యక్తులెన్ని విధాలో పాత్రలూ అన్నివిధాలుగా ఉంటాయి. దీనికి కల్పన కొంత జోడింపబడుతూ కొత్త రూపాన్ని పొందడమూ జరుగుతుంది. నవల చదివాక ఇతివృత్తంతో పాటు జ్ఞాపకం ఉంచుకోదగిన ప్రాతలు సృష్టించడం సామాన్యం కాదు. మనస్మృతి పథంలో నిలచి పోయి సంభాషణలో ఏదోఒక సందర్భంలో ప్రసక్తికి వచ్చేంతగా కొన్ని పాత్రలు ప్రసిద్ధి చెందుతాయి. పాఠకుని మనస్సు పాత్ర ప్రభావానికి గురి కావడం ఒక్కటే గీటురాయి. మంచి పాత్రా? చెడు పాత్రా? అనేది వేరే ప్రశ్న. ఇది మంచిపాత్ర, ఇది చెడుపాత్ర అని విభజించడాన్ని ఆధునిక విమర్శకులంగీకరించరు ఇటువంటి భావాన్ని కలిగించే పాత్ర చిత్రణం, రచయిత పాక్షికమైన వైఖరినీ, ఒక్కొక్కపుడు పలాయన మనస్తత్వాన్నీ ప్రకటిస్తుందనీ ఒక అభిప్రాయం. ఇది మంచీ, ఇది చెడూ అనే నిర్ణయం జీవిత పథాన్ని నిర్దేశిస్తుంది, కాబట్టి తిరస్కరణీయం కాదనీ సమర్థించే వారి అభిప్రాయం. అభిప్రాయ భేధాలెట్లా ఉన్నా నిజ జీవితంలోనూ ఎన్నో విషయాల్లో సులభంగా నిర్ణయాలు చేసి గీతలు గీసినట్లు మంచి చెడులను విభజించి ఏర్పాటు చేయడం కుదరదు. ఇట్లా చూడవలసిందీ కాదు జీవితం. ఒక దృక్పథాన్నిబట్టి ఏర్పరచుకొన్న, కొన్ని విలువల్ని బట్టి కొన్ని పరిమితుల్లో ఒదిగిపోవడం జరుగుతుంది. ఆ దృక్పథాన్నీ, విలువల్నీ ప్రశ్నలకు గురిచేసినపుడు వస్తుంది చిక్కు. పాత్రల మంచి చెడుల నిర్ణయంతో ప్రమేయం లేకుండా రచయిత పాఠకులకే నిర్ణయాన్ని వదిలివేయడం సమంజసమన్న శిల్పదృష్టి నేటి సాహిత్యలోకంలో బాగా వ్యాప్తిలో ఉంది. తాననుకొన్న "మంచి" పేరుతో ఒక పాత్రను పైకెత్తడం, కొన్నిటిని కిందికి దించడం, "చెడు" పేరుతో తక్కువచేయడం కన్నా రచయిత వివిధపాత్రల మధ్య ఒక దానితో మరొకటి పనిచేసే తీరులో చర్య, ప్రతి చర్యను పురస్కరించుకొని సంఘర్షణను నిలుపుతూ సమ గతిని కాపాడుతూ, సమానదృష్టిని కలిగి సమగ్రమైన జీవిత చిత్రణకు ప్రయత్నించ వలసిఉంటుంది. లోకంలో మంచి, చెడు, సత్యం, అసత్యం, ధర్మం, అధర్మం అనే వాటి విషయంలో ఒక నిర్ణయానికి రావడమంత సులభంకాదు. దీని వెనుకనున్న సామాజిక పరిస్థితుల ప్రాబల్యం, పైకి తెలీని రహస్యాలు అదుపులేని అవ్యక్త చైతన్యం ఇతర పాత్రల ప్రవర్తనం, ప్రతి వర్తనం అన్నీ కలసి అనుకోని దిశల్లో పనిచేస్తాయి. ఈ కారణంగా రచయిత పాత్ర చిత్రణంలో ఏదో స్థూలమైన నిర్ణీతమైన అభిప్రాయం కన్నా సూక్ష్మ సూక్ష్మంగా వివేచన చేసి యథార్థాన్ని ప్రకాశమానంచేసే దృష్టినీ, సమభావాన్నీ అలవరచుకోవడం వల్ల పాత్రకు న్యాయం జరిగే అవకాశం ఉంది. అపుడే నవల జీవితానికత్యంత సన్నిహితంగా ఉంటుంది. సహజత్వాన్నీ కోల్పోదు. ఏ పాత్రకు ఆ పాత్ర ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వంతో జీవిస్తుంది. మానవ జీవితంలో ఎంతో సంకీర్ణమైందీ సంక్లిష్టమైందీ, నవల్లో దీని ప్రతిఫలనం అనివార్యం. మనిషిలోని స్పర్థ, ఆశ, మొదలైన లక్షణాలచేత ఆలోచన ప్రవర్తనం అనేకమైన మార్పులకు నిరంతరం లోనవుతూ ఉంటుంది. జీవితం ఎప్పుడు ఏ మలుపు తీసుకునేదీ నిశ్చయంగా చెప్పడం కష్టం. ఇది వ్యక్తికీ, వ్యక్తికీ భేదిస్తుంది. ఒకే వ్యక్తి ఆలోచన, ప్రవర్తన వివిధ సందర్భాల్లో భిన్న భిన్నంగా ఉండవచ్చు. ఏవో కొన్ని సూత్రాలు నిర్దేశించి అందులో నిబంధించిన ఆదర్శ రూపాన్ని ఇవ్వడం కుదరదు. సామాజిక రాజకీయ పరివర్తనం వల్ల ఎంతో కాలంగా నెలకొని ఉన్న విలువల్లో మార్పు రావడంతో కొత్తదృక్పథం ఏర్పడి నవల్లో పాత్ర చిత్రణకు సంబంధించిన ఆలోచనా వైఖరిలో ఎంతో మార్పు వచ్చింది. దీని వివేచనతో, పాత్రలో కలిసే వివిధ సమ విషమ గతుల్ని చిత్రించడంతో పాటు పాత్రలో

నిలకడకు భంగం వాటిల్లే పరిస్థితిని నిరోధించడం అవసరం. ఇది పాత్ర చిత్రణలో రచయిత బాధ్యతను స్మరింపజేస్తుంది జీవితం గురించి ఎంతో పరిశీలనంతో ఎన్నికచేసి నిర్మించిన అనేక విషయాల సంకలన రూపమే పాత్ర. ఇది ఒక తీరులో శిల్పం చేత యోచితమై వ్యక్తిత్వంగా ప్రకాశిస్తుంది నిజ జీవితంలో మనకు ఆసక్తి లేనివీ, ఇష్టం లేనివీ వదిలేస్తాం. ఇక తెలిసనవి సరేసరి. నవల్లో తప్పనిసరిగా అన్నీ చదువవలసి ఉంటుంది. దీనితో అనుభవంలోకి వచ్చి ఆలోచనకు ఉపక్రమించడం జరుగుతుంది. సాధారణమైన విషయాలు మొదలు కొని ప్రత్యేకాంశాలదాకా విస్తృతమై ఉంటుంది. ఎంతో విస్తృతమైన జీవితక్షేత్రం ఒక ఖండ బింబంగా వివిధ పార్శ్వాల్లో మన ఎదుట సాక్షాత్కరిస్తుంది. పాత్రల రూపంలో తోటి మానవుల్ని గురించి ఎంతో తెలుసుకుంటాం. ఈ స్థితిలో పాత్రలు మనకు సాధారణంగా కన్పించే, కేవలం వ్యక్తులుగానే కాక అర్థవంతమైన అనుభవ పరం పరతో మనలో కొత్త ప్రపంచాన్ని నిర్మిస్తాయి. వ్యక్తులతో లేని పరి చయం వీటితో ఏర్పడుతుంది. పాత్ర సహజత్వాన్ని కోల్పోకుండా విశేష స్ఫూర్తితో జీవితాన్ని పోలినస్థితి చిత్రణం అనుభవంలోకి రావ డానికి రచయిత పాత్ర చర్యనుజాగ్రత్తగా నిర్వహించవలసి ఉంటుంది. ఏఏ చర్యల వత్తిడివల్ల ఏఏ పాత్రలు ప్రభావానికి గురిఅయ్యేదీ గుర్తిస్తూ మరీ ముందుకు సాగాలి. చర్యకు అవసరమైన పరిసరాలు, పరిస్థితుల కల్పనం బాగా ఉపకరిస్తాయి. నవల్లో కథా ప్రణాళికను బట్టి పాత్ర పరిమితులు నిర్ణీతమౌతాయి కొన్ని పాత్రలు ఇష్టంవచ్చి నట్లుగా సంచరిస్తూ, మరికొన్ని దృష్టిపథంలోనే లేకుండా తప్పించే ప్రమాదం జరగకూడదు. కాబట్టి రచనలో వాటి స్థానం ప్రయోజ నాన్ని బట్టె యోజితమౌతుంది. లేకపోతే నవల్లో సమస్థితి దెబ్బతినే అవకాశం ఉంది. రచయిత ఎంత తటస్థవైఖరి అవలంబించినప్పటికీ అతని సిద్ధాంతాలు, అభిప్రాయాలు పాత్ర మలుపులపై స్థూలరూపంపై ప్రభావం నెరపకుండా ఉండజాలవు. ఇది నవల్లో ఉద్దేశ క్షేత్రానికి సంబంధించిన పరిధిలోకి వస్తుంది దీనిలో సహజత్వం ఉంటుంది, ఈ స్థితి వేరు. రచయిత కావాలని పాత్రలో చొరబడి, జోక్యం చేసుకోవ డం వేరు. పాత్రను తన ఇష్టం వచ్చినట్లు దాన్ని వ్యక్తిత్వం లేకుండా కుదించి, పెంచి నడపడం వేరు. రచయిత ఎంతో బాధ్యతాయుతంగా నిర్వహిస్తేనే, జీవిత వాస్తవం చెదరని సహజమైన పాత్రలు విశిష్టంగా అవతరించే అవకాశం ఉంది. ఎంతో ఆలోచన, అనుభవంతో చరిత్రలో అనేక ప్రస్థానాల సమాహార భూతమైన సామాజిక సంస్కృతీ దశ లను ఏదో ఒక విధంగా దర్శించే నవల్లో వ్యక్తిత్వ చిత్రణంలో సామాజిక దర్శనం స్ఫుటంగా కన్పిస్తుంది. గొప్పనవల్లో పాత్ర చిత్రణలో వైయక్తికమైన పరిధి నధిగమించిన సామాజిక దర్శనం వెనుక నుండి ప్రకాశిస్తూ ఉంటుంది. ఇదీ వాస్తవ ప్రపంచంతో సిద్ధ శితమైన జీవితదృక్పథంతోనూ కన్పిస్తుంది. ఈ విషయం అట్లాఉ ఇటీవల వైయక్తిక పరిధిలో సాధారణ జీవిత చిత్రణంతో పె మనస్తత్వపు లోతుల్లోకి దృష్టిప్రసరించడంపై అధికమైన శ్రద్ధ క స్తుంది. సృజన శక్తితో పాటు శిల్పదృష్టి విస్తృత పరిధిలో ప్రవ మానం కావడం గమనించవచ్చు.

## 2

నవల్లో పాత్ర కొన్ని మాటలతో పరిచయంకావచ సంఘటనలో పాత్ర ప్రవర్తన సంభాషణ ద్వారా ఆవిష్కృ మవుతుంది. పాత్రకు నవల్లో ఒక క్రమ పరిణామరూపం ఉంటుం ఇది ప్రత్యేకమైన సందర్భాల్లో హఠాత్తుగానూ, సాధారణంగా దశ దశలుగానూ లేదా కొన్నిమలుపుల తోనూ వికాసాన్ని పొందుతుం ఈ 'హఠాత్తు' కు వెనుక ఎంతో బలమైన హేతువు ఉండాలి. ఃఽ సంఘటన క్రమంలో విన్యస్తమై ఉంటుంది. దీనిలో చకితం చే ఆశ్చర్యం, టెన్షన్ ఉంటుంది. ఈ దశలుదశలుగా వికాసానికి వెన ఎంతో విస్తృతమైన సంఘటనల క్రమం దీర్ఘమైన కాలంపై పరచు ఉంటుంది. ఇందులో ఎప్పటికప్పుడు తొలగిపోయే ఆశ్చర్యం, సడ పోయే టెన్షన్, కొంత విరామంతో అందుకుంటూ - సాగుతాం ఒక ప్రవాహరూపంలో ఆవేశం ప్రసరిస్తూ ఉంటుంది. నవల విజయ పాత్ర సృష్టిపై చాలాభాగం ఆధారపడి వుంటుంది. రచయిత ఎం గొప్పవాడైనప్పటికీ అతని ఇష్టానిష్టాలను బట్టి కాక, పాత్రస్వతంత్రం స్వయం వ్యక్తిత్వంతో ఆవిష్కృతం అయినప్పుడే, విశిష్టతను కలి ఉంటుంది. [1] ఈనవల్లో పాత్రస్వరూపం ఏమిటి? ఎట్లా ప్రవర్తిస్తోం ఇతర పాత్రలతో సంబంధాలెట్లా ఉన్నాయి? ఏ విధంగా మా తున్నాయి? ఏ ఏ సమస్యలను ఎదుర్కొంటూంది? వాటి ప్రత్యేక ఏమిటి? ఇట్లాఎందుకు జరిగింది? ఎట్లా పరిష్కరిస్తోంది? విధంగా అనేకమైన ప్రశ్నలు పాత్రగురించి పాఠకుని మనస్సుల నిశ్శబ్దంగా సంచరిస్తాయి. అందువల్ల పాత్ర చిత్రణం మొదటినుం చివరిదాకా అనేక సంఘటనలు, పరిస్థితులతో ఇతివృత్త నిర్మాణం భాగమై పరిణతి పొందుతూ ఉంటుంది. బహుముఖమైన విశిష్టత సంతరించుకుంటూ మనలో ఎన్నో ప్రశ్నలకు సమాధానాలను ప్రశ్న వెనుకనుండి రూపొందింపజేస్తూ ముందుకు సాగుతుంది. అంత వాస్తవికతను నింపుకొని అనుభవంతో స్పందించాలి. పాత్ర సంబంధించిన గతిలోవేగం తగిన విధంగా కాపాడబడాలి. ఇది వ ముఖ్యం. దీన్ని గురించి ఆలోచనచేస్తే పాత్రకూ సంఘటన క్రమానికి గల సంబంధం విశదమౌతుంది. హెన్రీ జేమ మాటల్లో "పాత్ర అంటే ఏమిటి? సంఘటనల నిర్ధారణ సంఘటన అంటే ఏమిటి? పాత్ర ప్రకాశనం [2] పాత్ర ఏదో ఒక సంఘ

తో ప్రమేయం కలిగి ఉంటుంది నవల్లో చర్య ఏం జరుగుతూందన్న త్సుకతను నిలిపేది. ఇది పాత్ర ఆలోచన మొదలుకొని ప్రవర్తన కా పర్యాప్తమైంది. పాత్రను ఆశ్రయించి ఎన్నో స్మృతులు, ఆలోచనలు, అనుభవాలు ఉంటాయి. ఇవి బాహ్యమైన ప్రవర్తనాగతంగా, మానసికమైన స్థితి సమర్పకంగా తేర్చేవిధంలో పాత్ర వ్యక్తిత్వం మూర్తిమత్వాన్ని పొందుతుంది. చర్య పాత్ర నిహితమైన అనేక సంఘటనలను పురస్కరించుకొని సాగుతుంది. ఎన్నో చర్యలు వివిధ శ్రైయిల్లో పరిక్రమిస్తుంటాయి. వివిధ సంఘటనల స్థితుల సమాశ్లిష్టమైన క్రమరీతుల్నిబట్టి గమనంలో వైచిత్రి ఏర్పడుతుంది. వివిధ సందర్భాల్లో సాదృశ్యంగానూ, సమంగానూ, వ్యత్యస్తంగానూ, విషమంగానూ, సంకీర్ణంగానూ అనేక విధాలుగా సాగుతుంది. జీవితంలో వలెనే సంతోషం ప్రక్కనే విషాదం, ఎత్తు ప్రక్కనే పల్లం, గుణం వెంటనే అవగుణం ఈ విధమైన రీతులలో ఒక్కొక్కప్పుడు అనూహ్యమైన పరిణామాలతోనూ ప్రవర్తితమౌతుంది. మనస్తత్వ పరంగానూ మానవ జీవితంయొక్క బహు పురాతనమైన పురారూపాల (ఆర్కిటైపు) ప్రసారమూ సామూహిక అవ్యక్త చేతన లోతులు స్పృశిస్తూనూ విలసిస్తుంది. ఎన్నో అసాధారణమైన సంక్లిష్టమైన మానసికస్థితులు రచయితకు తెలిసీ తెలియకుండా విచిత్రమైన సంఘటనలతో అనుభవయాథార్థ్యాన్ని ఆశ్రయించిన పాత్ర వ్యక్తిత్వంలో నిర్మితమౌతాయి. అందువల్ల పాత్ర చర్యకూ ఇతివృత్తానికీ గలసంబంధం చాలా సన్నిహితమైంది. పాత్ర ఎదుర్కోవలసినవి, సంఘర్షణ (కాన్‌ఫ్లిక్‌ట్) స్తంభన (టెన్‌షన్) సంఘర్షణ ఉన్నంత వరకూ స్తంభన ఉంటుంది. సంఘర్షణ నుండి బయట పడటంలో పాత్ర వ్యక్తిత్వాన్ని పొందుతూ వుంటుంది. ఇది విషయవంతంగా జరగటంలో పాత్ర ఉన్నతికి చేరుకుంటుంది. సంఘర్షణ (1) మానవుడు తోటిమానవులతో ఉండే సంబంధాలవల్ల విభేదాలను పురస్కరించుకొని ఉండవచ్చు, (2) వ్యక్తిలో జరిగే అంతస్సంఘర్షణ (ఇన్నర్ కాన్‌ఫ్లిక్‌ట్) కు చెంది ఉండవచ్చు. ఇది మన స్తత్వ పరమైంది. పాత్రలో అవ్యక్తంగా జరిగే సంఘర్షణ కారణంగా అనుకోకుండా విపరీత పరిస్థితి ఏర్పడవచ్చు. వైయక్తిక సామాజికమైన మనోభావాలు పాత్రలో వివిధ పార్శ్వాలలో బహిర్గతమవుతూ జీవితంలో వలెనే నడిపించే శక్తికలిగి ఉంటాయి. ఫ్రాయిడ్, ఎడ్లర్, యులగ్ మన స్తత్వ పరిశోధనలవల్ల రూపొందిన సిద్ధాంతాల ప్రభావమూ వాటి ననుసరించిన వివేచనమూ - పాత్ర చిత్రణకు మన స్తత్వ పరంగా దోహదం చేస్తున్నాయి. (3) మానవుడు భౌతికమైన ప్రకృతిని ఎదుర్కోవలసి వచ్చిన అనేక సంఘటనలకు సంబంధించి ఉండవచ్చు. ఈ సందర్భంలో ఒక్కొక్కప్పుడు ప్రతీకాత్మకంగానూ రూపొంద వచ్చు. ఈ విధంగా ఇతివృత్తంలో అనేక సంఘటనల పరంపరలో నిక్షిప్తమైన గతిక్రమం పాత్రచేత స్థితిని పొందుతూ, చర్యచేత వేగవంతమౌతుందన్న విషయం స్పష్టమౌతుంది. ఇతివృత్తానికి పాత్రకూ గల సంబంధంఇటువంటిది.

(1) ఇతివృత్తం ప్రధానమైనవీ (2) పాత్ర ప్రధానమైనవీ (3) అభిప్రాయం ప్రధానమైనవీ అని నవల విభజనం మూడు విధాలుగా జరిగినప్పటికీ ఇతివృత్తం, అభిప్రాయం ప్రధానమైన నవల్లోనూ పాత్రకూ సముచితమైన స్థానం ఉంటుంది. లేకపోతే కథకు నిశ్చయమైన గమన వైఖరి సిద్ధించదు. లక్ష్యానికి కేంద్ర స్థానమూ ఉండదు. ఇది పాత్ర వల్లనే అనుభవస్పందనంగల జీవిత రూపాన్ని పొందుతుంది! ఇ. ఎమ్. ఫాస్టర్ ఇతి వృత్తం కన్నా పాత్రకే నవల్లో అగ్రస్థానం ఇవ్వడం ఈ సందర్భంలో గుర్తు చేసుకోవచ్చు. ఫాక్‌నర్ పాత్ర గురించి చెబుతూ సాధారణంగా తన నవల పాత్రతో మొదలౌతుందనీ ఒకమారు పాత్ర తన కాళ్ళపై నిలబడి కదలడం మొదలు పెట్టగానే తాను దాని వెనుక కాగితం పెన్సిలు తీసుకొని అది చెప్పేది చేసేది, వ్రాస్తూ పోవడమే తన పని అంటాడు [3] ఇతి వృత్త పరిణామంలో కొందరు వ్యక్తులు, వారి స్వభావాలు మనోభావాలు ప్రవర్తనలు ఉద్దేశాలు కలిసే ఒక పరిస్థితిని సృష్టిస్తాయి, ఇవి పరస్పరం ఆకర్షణ - వికర్షణ ప్రభావంతో పరస్పరం వ్యతిరేక గుణాలతో ఏర్పడిన స్వరూపం చేత సంఘటనకు సంఘర్షణ- స్తంభనం చేకూరుతాయి! ఈ సంఘటనల నుండి క్రమించేప్పుడు పాత్రవ్యక్తిత్వం వివిధ పార్శ్వాలనూ లోతునీ, ఉన్నతినీ, అన్నిటినీ మించి రామణీయకతను సంతరించుకుంటుంది. ఇతి వృత్తానికి పాత్ర అనివార్యమైంది. పాత్రకు ఇతివృత్తం ఆవశ్యకమైంది నవల్లో పరస్పరం సమాశ్రయంతో యోజితమౌతాయి. పాత్ర నుండి ఇతివృత్తానికే ఇతివృత్తం నుండి పాత్రకూ అనేకమైన అనుభవ సంఘటనల పరంపర ప్రసరిస్తూ ఉంటుంది. రచయిత సిద్ధాంతాల అభిప్రాయాల లేదా జీవితాని కివ్వదలచుకొన్న విలువలతో పాత్ర చేతనే లక్ష్యానికి దారి తీయడం జరుగుతుంది.

*

పాత్ర చిత్రణం స్థూలంగా నవల్లో రెండువిధాలుగా ఆవిష్కృతమౌతుంది. 1. ప్రత్యక్ష లేదా విశ్లేషణాత్మకం 2. పరోక్ష లేదా నాటకీయం. ప్రత్యక్షంలో రచయిత పాత్రను నేరుగా వర్ణిస్తూనో వ్యాఖ్యానిస్తూనో చిత్రిస్తాడు. పాత్ర ఆలోచనలను అనుభవాలను, స్పష్టంగా వివరిస్తాడు. అపుడపుడూ సాధికారికంగా నిర్ణయాలను ప్రకటిస్తాడు. రచయితకు పాత్రపై విశ్వాసం లేకపోవటం వల్ల ఈ విధంగా జోక్యం కల్పించుకొని తన వ్యక్తిత్వాన్ని ఆపాదిస్తాడని విమర్శకుల అభిప్రాయం. రచయిత వైయక్తికమైన ప్రభావం ఏ మాత్రంలేకుండా

ఉండదు, కాని ఇది పాత్ర వ్యక్తిత్వాన్ని పూర్తిగా మింగేసేదిగా ఉండకూడదు. ఇందులో స్పష్టత ఎక్కువ ఈ నవల్లో పాఠకుడు నవల చదివేప్పుడు పాత్ర గురించి పొందే ఆలోచనకూ, ఆవేశానికీ సమ్మతంగా ఉండక పోవచ్చు. అక్కడక్కడా పరోక్ష పద్ధతికి ప్రవేశం లభిస్తూ ఉంటుంది. కాని దీనికి ప్రాముఖ్యం అంతగా ఉండదు పరోక్షంలో రచయిత తాను దూరంగా ఉంటూ పాత్ర తనంతట తాను ఆవిష్కృతమయ్యేందుకు ఎక్కువగా అవకాశం ఇస్తాడు, ఇది కథనంలో సంభాషణం ద్వారానూ, ప్రవర్తన వల్లనూ జరుగుతుంది రచయిత జోక్యం లేక పోవడంవల్ల పాత్ర స్వేచ్ఛగా ప్రవర్తిస్తుంది. వెనుక నుండి అనుకోకుండా లేదా అభిప్రాయ స్థాపనంలో రచయిత స్వరం సన్నగా విన్పిస్తే విన్పించవచ్చు, ఈ తటస్థవైఖరివల్ల పాత్ర అన్ని విధాల స్వతంత్రమైన వ్యక్తిత్వంతో పుష్టమౌతుంది. రచయిత చేసే వివరణం, వ్యాఖ్యానం ఏమీ లేకపోవడం వల్ల కేవలం పాత్రల సంభాషణ ప్రవర్తన బట్టి వాటిస్వరూప స్వభావాలు భావించవలసి ఉంటుంది. ఇందులో నాటకీయత కెక్కువ అవకాశం ఉంది. స్వీయ చరిత్రాత్మకం లేఖాపత్రాల నవలల్లో పాత్రల ప్రమేయం తక్కువగా ఉంటుంది. నవల్లో పై ఆవిష్కార విధానాల్లో దేని కది విడి విడిగా ఉండవచ్చు కాని తరచుగా ఈ రెండిటి సమ్మేళనం గోచరిస్తుంది. ఏదో ఒకదానికి ఉండే ప్రాధాన్యం దృష్ట్యా ఆ విధానానికి సంబంధించిందిగా భావితమౌతుంది. పాత్రల చర్యలో నిగమనం కథనం, సంభాషణం — రెండింటివల్ల సాగుతుంది. ఇది విడిగానూ, రెండిటి కలయికతోనూ రూపొందిన లక్షణం పరిశీలనా యోగ్యమైంది. రాచకొండ విశ్వనాథశాస్త్రి, అల్పజీవి నవల్లో ఎక్కువభాగం పరోక్షవిధానం అనుసరింపబడింది. ఆధునిక రచయితల్లో చాలామంది దీనిపై ఎక్కువ మొగ్గు కలిగి ఉండడమూ గమనించదగింది.

ఇక నవల్లో రచయిత ప్రమేయం గురించి ఆలోచిస్తే, ఎంతైనా పాత్ర స్వరూపం వెనుకనుండి రచయిత వ్యక్తిత్వం ఎంతో కొంత స్ఫుటం కాకుండా ఉండడం అసంభవం. అట్లాగైతే, రచయిత అభిప్రాయాలు, ఉద్దేశాలు, సిద్ధాంతాలు ఏ విధంగా ప్రతిపాదితం కావడానికి వీలుందనే ప్రశ్న ఉదయిస్తుంది. ఈ కారణంగా ప్రత్యక్ష, పరోక్ష పద్ధతుల సమన్వయాన్ని కాంక్షించేవారూ ఉన్నారు. ఒక అభిప్రాయం నాటకం. కన్నా భిన్నమైన ప్రక్రియనవల. దీని ప్రత్యేకత దీనికి ఉంది. దాన్ని రచయిత నిలపాలి. రచయిత తనకు మధ్య మధ్య దొరకే, వివరించే అవకాశాన్ని ఉపయోగించుకోవడంలో దోషంలేదు. నాటకాన్ని దృష్టిలో పెట్టుకొని నవలను పరిశీలించకూడదు. కాకపోతే నవల వివిధ ప్రక్రియల్లోని కొన్ని కొన్ని లక్షణాల సమాహారంగా అవతరించిన స్వతంత్రమైన విశిష్టరూపం. అవును అయితే ఆ లక్షణాలను ఎంతవరకో అంతవరకే, దీనికి తగిన విధంగా యోచన చేసి, నవల మొత్తంమీద భావనతో దానికదిగా వివేచించాలనేది వివుర అంశాన్ని నవలను పరిశీలించేప్పుడు దృష్టిలో ఉంచుకోవాలి రచ పాత్రకు వెలుపలనుండి నిర్వహించడంలోనే, అన్ని విధాలా, కళా గానూ నవలకు ఉత్తమస్థాయి చేకూరుతుంది. దీనికీ, నవల మొ మీద అభిప్రాయ స్థాపనకూ, భేదం ఉందనేవారి సంఖ్య ఈ ఎక్కువగా ఉంది. ఏరచనఐనా రచయిత వ్యక్తిత్వ ప్రభావం న తప్పించుకోలేదు. అట్లాఐతే దానికి సృజనాత్మక లక్షణమే పట్టు కాబట్టిపైన పేర్కొన్న విధంగా రెండింటినీ వేరుచేసి చూడాల అభిప్రాయం సమంజసమైంది.

## 4

నవల్లో పాత్రలు రెండువిధాలుగా ఉండవచ్చు. ఒకి సామాన్యం (సింపుల్), రెండోది సంక్లిష్టం (కాంప్లెక్స్) సామాన్యం పాత్ర మంచిదనీ, చెడుదనీ స్థూలంగా వేరుచేయబడి ఉంటుం మంచికీ, చెడుకీ మధ్య ఘర్షణ ఉంటుంది. చివరకు విజయం మంచి లభిస్తుంది. ఈ మంచిఅనేది అదివరకు ఏర్పడిఉన్న కొన్ని సిద్ధాం లనూ, విలువలనూ ఆశ్రయించి రూపొందుతుంది. ప్రధాన సర్వసద్గు సంపూర్ణంగా తీర్చబడుతుంది. సంక్లిష్టం (కాంప్లెక్స్)లో వ్యక్తి ఎం గొప్పవాడైనప్పటికీ ఏదో ఒక లోపంవల్ల సంక్లిష్టమైన స్థితిని పొంది తాడు. అతనిలో లోపాలు ఉంటాయి. అవి అతని పతనానికి దా తీస్తాయి. లేదా పెద్దచిక్కుల్లో పెడతాయి. ఈలోపం ఏదైనాకావచ్చు అందరినీ అనుమానించే గుణంఅవచ్చు. ఎక్కువగా ఆలోచనల్లో కాల గడుపుతూ క్రియాశీలం లోపించవచ్చు. క్రియాదక్షుడై ఉండి స్వయంగ ఆలోచనా లక్షణం లేకపోవచ్చు. ఏదో మూఢవిశ్వాసం కలవాడై వివేచన శూన్యంకావచ్చు. మరేదో ఇలాంటిదే అయి ఉండవచ్చు ఒక్కొక్కసమయంలో స్వల్పమైందే అసాధారణ స్థితికి దారితీయవచ్చు ఎన్నో చిక్కులు ఎదురౌతాయి. దీనితో కథ అనూహ్యమైన మలుపులు తిరుగుతుంది. కొత్తసంఘటనలు ఎదురౌతాయి. వీటిని ఎదుర్కొనే ప్రయత్నమూ జరుగుతుంది. దీన్నిబట్టి ఇతరపాత్రల ప్రవర్తనంలో మార్పు అనివార్యమౌతుంది. ఈ పరిస్థితుల్లో వివిధ పాత్రలచర్య ప్రతిచర్యతో ఇతివృత్తంలో మెలిగే పాత్ర సంక్లిష్టంగా రూపొందుతుంది. సామాన్యంలోకన్నా సంక్లిష్టంలో పాత్రచిత్రణం విశేషస్థితిని పొందుతుంది. సామాన్యంలో బాహ్యవర్తనలపై దృష్టిఉంటే, సంక్లిష్టంలో ఆంతరమైన వర్తనకు ప్రాధాన్యం ఉంటుంది.

నవల్లో పాత్ర మరోవిధంగానూ వర్గీకృతమైంది. 1. స్థిరమూ (స్టాటిక్); 2. క్రియాత్మకమూ (డైనమిక్ ) స్థిరంలో పాత్ర మొదట్లో ఉన్నట్లుగా చివరివరకూ చెప్పుకోదగిన ఏ మార్పూ లేకుండా ఉంటుంది. ఇది సామాన్యపాత్రకు దగ్గరగా ఉండేది. క్రియాత్మకంలో

త ప్రవర్తనలో చెప్పుకోదగిన మార్పులు వస్తాయి. అవి చిన్నవీ చ్చు, పెద్దవీ కావచ్చు. ఇవి శాశ్వతంగా నిలచిపోతాయి. చిన్న ా పెద్దవైనా మార్పులు, ప్రభావాన్ని గుర్తించగలిగిన స్థితిలో ాలి. అంటే నవల్లో వీటి ముఖ్యం దృష్టిని ఆకర్షించడమే కాకుండా కు చైతన్యాన్ని సంతరింప చేసేదిగా ఉంటుందన్న మాట. ఇది త వర్తించే పరిధిలోనే జరుగుతుంది. పాత్ర ఎదుర్కొనే పరి సలవల్ల ప్రేరితమవుతుంది. సంప్రదాయ ధోరణికి భిన్నంగానూ డవచ్చు. పాత్ర ఎదుర్కొనే మంచి చెడు స్థితుల పరిశీలనం స్తవ దృష్టితో జరుగుతుంది. దీని ప్రభావం చర్య, ప్రతి చర్యపై తో ఉంటుంది. ఈ సందర్భంలో కొంత మనస్తత్వ వివేచనమూ నసరం ఔతుంది, ఇది సంక్లిష్టం – పాత్రకు సమీపవర్తిగా ఉంటుంది.

ఇ. ఎమ్ ఫాస్టర్ పాత్రను రెండు విభాలుగా విశ్లేషించాడు. ుదటిది సమం (ఫ్లాట్) రెండోది ఆవృత్తం (రౌండ్). మొదటిదైన మంలో పాత్ర స్వరూపం ఒకటి రెండు లక్షణాలతో సమరేఖలో స్థితమై పోతుంది. ఇందులో ఆశ్చర్యం గొలిపే లక్షణంగానీ ప్రత్యే ంగా పేర్కొదగిన విశేషంగానీ అంతగా ఉండదు. ఉన్నప్పటికీ ాతువుకు నిలవదు. సమధానపరచలేదు. పాత్ర నిర్మితిలో జీవితంలో ాకాత్ ఘటనలతో తిరిగే మలుపులు లేకుండా ఒకవేళ, ఉన్నా ఒకటి ండు అక్లిష్టంగా, అవి సులభంగా విప్పగలిగినవై సమంగా ఎత్తు ల్లాలు లేకుండా – అవిషమంగా ఉండటం ఇందులోని ప్రత్యేకత. ాత్ర నిర్వహణ మంతా ఎక్కువగా రచయిత మాటల్లో సాగుతుంది. ధ్య మధ్య వ్యాఖ్యానిస్తూ, విశ్లేషిస్తూ, నిర్ణయంచేస్తూ పాఠకుల్ని చయిత తాను కోరే దిశగా ప్రవర్తింపజేసే ప్రయత్నం స్పష్టంగా న్పిస్తుంది. ఇది దాదాపు ప్రత్యక్ష పద్ధతికి దగ్గరగా భావించడానికి ిలైంది. రెండోదైన ఆ వృత్తం (రౌండ్) లో పాత్ర పరిణామం పేర్కొనదగిందిగా ఆ వృత్త స్థితిని పొందుతుంది. ఇది బహు ముఖాలతో పర్యాప్తమై ఉంటుంది. అనేక సంక్లిష్ట స్థితులతో కూడి ఉంటుంది. సంప్రదాయ ధోరణికి భిన్నంగా ప్రవర్తిస్తుంది. నాటకీయ లక్షణాన్ని పొందుతుంది. ఈ పాత్రలు ఆవృత్తత్వం లేదా వర్తులత్వం చేతనే జీవిస్తాయి. అంటే జీవితాన్ని బహుస్థలాల్లో స్పృశిస్తూ పాత్ర మలుపులు తిరుగుతూ రూపొందే లక్షణం ఉంటుందన్నమాట. దీని గమనం లేదా ప్రసారం మలుపులు తిరుగుతూ (విశేషస్థితులతో), కదలుతూ, కదలుతూ పేర్కొదగిన వ్యక్తిత్వ రేఖలతో గుండ్రంగా (విశిష్టంగా) మొదలైన చోటికి వచ్చి చేరడం ఇందులోని ప్రధాన లక్షణం. కాబట్టి దీనికి రౌండ్ (ఆవృత్తం) అనేమాట సార్థకమౌతుంది.

సమమైన పాత్రలు జీవితాన్ని స్పృశించవనికాదు. ఇది ఒక రెండు స్థలాలకు మాత్రమే మితమై ఉంటుంది. రచయిత శక్తినిబట్టి దీనిలోనూ ఎంతో సూటిగా ప్రభావోపేతంగా వ్యక్తిత్వం చిత్రితం కావచ్చు. దీన్ని ఎంతో సమర్థవంతంగా నిర్వహించే రచయిత ప్రతిభ చేత ఈ పాత్రలూ ఎంతో ఆకర్షణతో మనస్సుపై చెరగని ముద్రవేసి శాశ్వతస్థానాన్ని పొందడమూ ఈ సందర్భంలో గమనించవచ్చు. నవల్లో సమం (ఫ్లాట్) ఆ వృత్తం (రౌండ్) రెండిటికీ స్థానం ఉంది. అయితే ఒక భేదం గుర్తించవలసి ఉంది. సమంకన్నా ఆ వృత్తం వెంటనే ఆకర్షిస్తుంది. క్లిష్టమైన స్థితులనుండి ఉద్గమించే విజయశక్తిగా పాత్ర దీపిస్తుంది. సమ పాత్రను ఎంతదూరమైనా పొడిగిస్తూ పోవచ్చు. ఆ వృత్తవిషయంలో (ఎంతబడితే అంత) పొడిగిస్తూ పోవడానికి అవ కాశం వుండదు. ఇది తిరిగే మలుపులతో కొత్త పార్శ్వాలను పొందుతూ కొత్త ఆకర్షణకు నిలయమౌతూ ఉంటుంది. ఇతివృత్తం వ్యాసపరిధిని బట్టి ఇది ప్రవృత్తమౌతుంది. ఒకటి రెండు కన్నా ఎక్కువ విశిష్ట లక్షణాలతో మలుపులు తిరుగుతూ వలయాకారంలో ప్రవర్తిస్తూ చివరకు మొదటి చోటికి వచ్చి కలవడంతో పాత్రకు సంపూర్ణత సిద్ధిస్తుంది.

## 5

మానవ జీవితం ఎంతో విస్తృతమైందీ, గహనమైందీ, వైవిధ్య విలసితమైందీ, మనచుట్టూ ఉన్న వ్యక్తులతో సంబంధాలవల్ల కలిగే అనుభవాలు అనేక సంఘటనలకు దారితీస్తూ ఎంతో ప్రభాన్ని నెరపు తాయి. రచయిత వీటిని పరిశీలించి, ఎన్నుకోవడం, తగిన విధంగా కూర్చుకోవడం అప్పటి అవసరం, ఔచిత్యం బట్టి ఉంటుంది. బాహ్యదృష్టితో పాటు అంతర్దృష్టితోనూ చిత్రించే పాత్ర స్వరూపంలో సంక్షిప్తంగా ఎన్నో జీవిత రహస్యాలు నిక్షిప్తమై ఉంటాయి. ఇవి లోక ప్రవృత్తిలో సంవదిస్తూనే విశిష్టమైన ధోరణిలో మనల్ని ఆకర్షిస్తాయి. రచయిత సృష్టించిన పాత్ర తక్కువ కాలంలో మనకు ఎక్కువ జీవిత ప్రపంచాన్ని అనుభవంలోకి తెస్తుంది. ఎంతగొప్ప రచయిత అయినా ఏ నవల్లోనూ, మానవుని గురించీ, అతని జీవితాన్ని గురించీ ఏ పాత్ర లోనూ సంపూర్ణమైన రూపాన్ని ఇవ్వలేడు. ఒక్కొక్కరచయిత ఒక్కొక్కనవల్లో ఏదో కొంతభాగం మాత్రమే బింబింపజేస్తాడు. కొద్ది పరిధినీ, కొంతలోతునీ మాత్రమే స్పృశించగలడు. ఎప్పటి కపుడు ఎంతో మిగిలే ఉంటుంది. ఆ చెప్పిందే చెప్పడం కాకుండా మిగిలినదాన్ని ఆ తరువాత వచ్చే రచయితలు అన్వేషించవలసి ఉంటుంది. దీనికి చివర అంటూ లేదు కాబట్టి అన్వేషణలో తెలుసుకోదగిందీ; చెప్ప వలసిందీ పాత్రచిత్రణలో ఇంకా ఉండనే ఉంటుంది. ప్రతివ్యక్తీ తన ప్రపంచానికి తానే కేంద్రబిందువు. ఒక్కొక్కరి దృష్టిలో ఒక్కొక్క విధంగా కన్పిస్తుంది. ప్రతివ్యక్తి జీవితం ఒక స్వయంవ్యక్తిత్వవలయం. వివిధ మనస్తత్వాలుగల అనేకమైన వ్యక్తుల ప్రవర్తనల తీరుతో సమాజం ఎంతో సంక్లిష్టంగా ఉండటం సహజం. ఎక్కడికక్కడ కొన్ని పరిమితుల్లో జీవితం గడిపే మానవుల్లో ఎన్నో సూక్ష్మమైన ప్రత్యేకాం

కాలతో పాటు అందరికి లేదా ఎక్కువమందికి వర్తించే కొన్ని కొన్ని లక్షణాలూ ఉన్నాయి. వేరు వేరుగా పేర్కొనవసరంలేని ఎన్నో సందర్భాల్లో వివిధ వ్యక్తులతో పరిచయం, స్నేహం, బంధుత్వం ఆత్మీయత దీనికి వ్యతిరేకంగానూ వివిధ స్థాయిల్లో ఏర్పడుతుంది. వ్యక్తిగతంగానే గాక సామాజికంగానూ అంగీకారం, తిరస్కారంతో కొన్ని అభిప్రాయాలూ, సిద్ధాంతాలు కలిసేవి, విడదీసేవీ ఉంటాయి. ఈ వలయాలను దాటి ఎక్కువ, తక్కువ, ప్రాంతం వర్గం, దేశం, భాష, విశ్వాసం, అభిప్రాయం, మతం, సిద్ధాంతం గురించిన భేదాల కతీతంగా మానవతాలక్షణం అన్ని కాలాల్లోనూ పనిచేస్తుంది. ఈ మౌలికమైన మానవీయ భావనవల్లనే ఏ భాషకు ఏ దేశానికి సంబంధించిన నవల్లోని పాత్రల పట్లనైనా ఆసక్తినీ, అభిమానాన్నీ కలిగి ఉండటం సంభవిస్తుంది.

నవల్లో రచయిత ప్రతిభకు నిదర్శనంగా నిలిచే గొప్ప పాత్రల్లో సాధారణమైన అనుభవాన్ని విశేషస్థితికి తీసుకొని వెళ్ళే ఉన్నతమైన స్థాయి ఉంటుంది. పాత్రలో రచయిత సాంఘిక, రాజకీయ, నైతిక, వైయక్తిక ధోరణిగల నిర్మాణ రేఖలు స్థూలంగా ఉంటాయి.అతని దర్శనం పాత్రలోఅంతర్లీనమైఉంటుంది. ఒక పాత్రలో లోకంలో ఎందరో వ్యక్తుల లక్షణాల సమాహార రూపం ఉండవచ్చు. రచయిత తాను నిర్మించేదాన్నిబట్టి తనకు కావలసిన లక్షణాలను ఎన్నుకోవడం జరుగుతుంది. దీని ఉపయోగంతో విచిత్రమైన మనస్తత్వం పై అనుభవ స్పందనపై వెలుగు ప్రసరించడంతో మన ఊహకు మించిన స్వరూపం ఏర్పడుతుంది, ఆకర్షణకు స్థానమౌతుంది. పాత్ర సృష్టిలో కొంత కల్పనకూ వీలుచిక్కుతుంది. రచయిత పొందిన అనుభవరూపంపైనే ఇది సాగుతుంది. రచయిత కోరే మార్పులను పురస్కరించుకొనీ ఉండవచ్చు. ఎంత వాస్తవమైనా, అనుభవమ్మూలమైనా వ్యక్తిత్వ చిత్రణం యథాతథంగా ఉండదనే అభిప్రాయం ఈ దృష్టితో వెలువరించిందే. ఈ మార్పులు కథాప్రణాళికనుబట్టి ఉద్దేశగర్భితమై ఉంటాయి. క్రమంగా పాత్రలు రచయిత ఆలోచనాధోరణినీ దర్శనశక్తినీ బట్టి రూపొందుతూ క్రమిస్తాయి. అందువల్ల ఒక రచయిత తీర్చేపద్ధతికీ, మరో రచయిత తీర్చేపద్ధతికీ భేదం ఉంటుంది. ఒకదానిలోకి మరొకటి మార్చలేం. ఒకే రచయిత వేరువేరు నవలల్లో వేరువేరు విధానాలనూ అవలంబించవచ్చు. మానవ స్వభావం సంపూర్ణంగా వెలుగుతోనూ ప్రకాశించదు. పూర్తిగా చీకటితోనూ నిండి ఉండదు. వెలుగు - చీకటి, ఈ మధ్య ఛాయాభేదాలు వివిధవర్ణకాంతి ప్రసారాలు, పరస్పరం సమున్మేషం పొందే స్థితులతో ఏ రూపాలెన్నో ఉంటాయి. జీవితంలో వీటిని సరిగా గుర్తించడం చ కష్టమైనపనే. పాత్ర చిత్రణంలో రచయిత సమదృష్టితో ఈ సూక్ష్మ లను జీవనసత్య స్ఫూర్తితో స్పష్టంగా కన్పించే ప్రయత్నమైతే చేయా

ఇతి వృత్తంలో సంఘటన - సంభాషణ - వాతావరణం మొదలైన వివిధాంశాలనుండి పాత్ర క్రమక్రమంగా క్రమిస్తూ చివర ఉద్దేశంతో సంపూర్ణమైన స్వరూపాన్ని పొందుతుంది. పాత్ర నవ ఒక ముఖ్యాంశమే. అయినప్పటికీ, ఇతర లక్షణాలతో ఎక్కు తక్కువ అనుబంధం తప్పనిసరిగా కలిగి ఉంటుంది. నవల చదివా పాత్ర స్మృతి పథంలో నిలవాలి. మనస్సులో కొంత కాలం నిలి అది ప్రభావం నెరపిన దాని క్రిందే లెక్క, సాహిత్యం అక్షరరూపం నిలచే సృష్టి ఉత్తమపాత్ర సృష్టిని అనుభవంలో దర్శించినపుడు పా కునిలో మనస్తత్వపరంగా ఏర్పడిఉన్న శూన్యవలయం తృప్తి రేఖల పరిపూర్ణమౌతుంది. ఉత్తమపాత్ర సృష్టికి గాఢమైన సాహిత్యగుణ మానవ స్వభావ పరిశీలనం, వాస్తవానుభవంపై కొంత కల్పనాశ సృజన శక్తి సమున్మేషంతో పాటు నిర్మాణ శిల్పం - నిర్దిష్టమై లక్ష్యం అవసరం. మనలో నిరంతరం జీవించే పాత్ర, కొ ప్రపంచాన్ని దర్శింపజేస్తుంది. అనుభవ స్వరూపాన్ని విస్తృత చేస్తుంది. కొత్తవిలువల్ని నిలుపుతుంది. మనల్ని ఆలోచనకు గు చేస్తుంది.

## అధోజ్ఞాపికలు

1. "కారెక్టర్ మస్ట్ మేక్ ఇట్స్ ఓన్ క్రైన్డ్ బట్ నాట్ ఆఫ్ అవ క్రైన్డ్ - " క్లీన్త్ బ్రూక్
   - అండర్‌స్టాండింగ్ ఫిక్షన్

2. "వాట్ ఈజ్ కారెక్టర్- ది డిటర్‌మినేషన్ ఆఫ్ ఇన్‌సిడెంట్ వాట్ ఈజ్ ఇన్‌సిడెంట్ ది డిటర్‌మినేషన్ ఆఫ్ కారెక్టర్"
   - హెన్రీజేమ్స

3. "ఇట్ బిగిన్స్ విత్ ఎ కారెక్టర్, ........ ఆల్ ఐ కెన్ డు ఈజ్ టు ట్రాట్ ఎలాంగ్ బిహైండ్ హిమ్ విత్ ఎ పేపర్ అండ్ పెన్సిల్" - ఫాక్‌నర్

# కామితార్థప్రదా! ఓకనకదుర్గా!!

డాక్టర్ బొడ్డుపల్లి పురుషోత్తం

మితార్థప్రదా!
కనకదుర్గా!!
మార్థగిరసపూర్ణ
త్త సంసర్గా!!

కోటి సూర్యప్రభా
భాసమానంబయిన
నీ రూపవైభవము
సత్య శివ సుందరము

ష్ణవేణమ్మ నిన్
భిషిక్త నొనరింప
రవళ్లు త్రొక్కుచూ
వహించు నీ దరికి॥

నీ కృపాపరిపూర్ణ
దృష్టిని ప్రసారించి
సంపూర్ణ జీవితా
శయసిద్ధి చేకూర్చు॥

చేతి కత్తితో
చ్ఛేదనము సేయు
మ్మరో! నా మనో
గాక్కాయ దురితాళి॥

రౌద్ర రూపమ్ము
ోక భద్ర ప్రదము;
హస్త దశకమ్ము
ంరక్ష కవచమ్ము॥

ఎప్పుడో రాక్షసుల
సంహరించుట కాదు;
ఇపుడె నాలోనున్న
దానవుల పరిమార్చు॥

నా గుండెలో నిండె
దుజ్ఞాన తిమిరమ్ము;
వెలిగింపు నీ పరం
జ్యోతి విజ్ఞానమ్ము॥

నీ దివ్య సన్నిధిని
శిరసు వంచగలేను;
నిన్ను సంకీర్తింప
నా నాల్క యల్లాడు।

సంసార దావాగ్ని
లో చిక్కి నశియింతు;
కారుణ్య వర్షమ్ము
వేవేగ కురిపించు॥

నీ బిడ్డనై పుట్టి
నీకె దూరంబైతి;
నిను విస్మరించు మో
హము నిండె నా గుండె॥

మార్పడ్డ బిడ్డకై
తల్లడిల్లదె తల్లి?
నీ కేల నాపై ఉ
దాసీన మో తల్లి?

ఏవేవొ కోరికలు
నను పట్టి పీడించు;
నీ కోర్కె చొప్పునే
తగ సంస్కరింపుమా!!

అణచలేనే తల్లి
దుష్కామ వాంఛలను
అణగింతు నోయమ్మ
సత్కామ వాసనల॥

నీ దర్శ నానంద
కందళిత మతి నొసగి
నీ సేవలో చిత్త
పారవశ్యము గూర్చు ॥కామితార్థప్రదా॥

శ్రీ ఇవటూరి యోగదుర్గా మల్లికార్జున

# గోవిందవర్మ ప్రాకృతశాసనము ఆంధ్రభృత్యత్వము

విష్ణుకుండినుల కాలం గురించి ఎంతో వివాదస్పదంగా ఉన్నది. చరిత్రకారులు వారి కాలమును క్రీ.శ. నాల్గవ శతాబ్దపు మధ్యభాగము నుంచి లెక్కలోనికి తీసుకొనిరి. కాని కాలాంతరమున దొరికిన శాసనము, అదే ప్రస్తుత ప్రాకృత శాసనము వారి కాలమును క్రీ.శ. మూడవ శతాబ్దమునకు నెట్టినది. వీరు శాతవాహనుల సామంతులన్న విషయముకంటె శాతవాహనుల దాసులన్న విషయమును స్పష్టీకరించుచున్నది.

ఈ ప్రకృత ప్రాకృతశాసనము హైదరాబాద్ నగరములోని కొత్తగా అభివృద్ధి చెందుతున్న చైతన్యపురి ప్రాంతములో మూసీనదీ తీరమున నిలువురాతిపై లిఖించబడి ఉన్నది. బౌద్ధభిక్షువుల వసతి గృహములు సాధారణముగా నదీతీరము లందుండుట చరిత్రకెక్కిన విషయమే. శాసన సంబంధిత విషయము ఎంతో విలువైనదిగా, అదీ ప్రత్యేకించి విష్ణుకుండినుల చరిత్రకు సంబంధించి, భావించి దాని పూర్వాపరములను తద్వారా పరోక్ష సంబంధిత విషయములను తెలుసుకుందాము.

మొదటి విషయం ఆంధ్ర భృత్యత్వంపై వచ్చు చర్చ. ఆంధ్ర భృత్యులను వియషమై చరిత్రకారులు ఇక్ష్వాకులుగా భావిస్తూ ఇంతవరకు వచ్చినారు. కాని ఈ శాసనములోను తదనంతర శాసనములలోను వారు తమ ప్రభుభక్తికి నిదర్శనముగా వాక్య ప్రారంభమున ప్రకృత శాసనములో [1] "పురొమవిదాస" అన్న పదప్రయోగముతోను తరువాతి శాసనములలో [2] "శ్రీ పర్వతస్వామి పాదాను ధ్యాతస్య" అన్న పదప్రయోగములతో తమ ప్రభువుపట్ల తమ ప్రభువుల పట్ల తమకు గల అపారమైన ప్రభు భృత్యత్వమును, భక్తిప్రపత్తులను, ప్రభువులు మరణించిన తదుపరి బౌద్ధమతం మరణించిన తర్వాత సామ్రాజ్యమునకు విధేయులై "శ్రీ పర్వతస్వామి పాదాను ధ్యాతస్య" అన్న పదప్రయోగము చేసి తమకు దేశమందుగల అవ్యాజ అపార ప్రేమానురాగములు ముప్పిరిగొనగా తమ "ఆంధ్ర భృత్యత్వము" చరిత్రలో శాశ్వతత్వ స్థానము సాధించుకొనిరి. ఇక్ష్వాకులు రాజకీయములలో తలవరుగానో, సామంతులుగానో ఉండిరికాని భృత్యులుగ ఉన్నట్లు చెప్పుకొన్నట్లు నాకు గుర్తులేదు. ఈ (3) ప్రస్తుత ప్రాకృత శాసనములో "పులోమావిదాస" అన్న శబ్దము తదుపరి విష్ణుకుండి శాసనములలో "శ్రీ పర్వత పాదాను ధ్యాతస్య" అన్న పదములు ఈ చారిత్రక సత్యమును ఇక్ష్వాకులనుండి విష్ణుకుండిలకు మారిపోయినది ఆంధ్ర శాతవాహన చిట్టచివరి చక్రవర్తియైన పులోమావి చక్రవర్తి కాలమునాటి శాసనమిది. ఇది క్రీ॥శ॥ 220 నాటికి పూర్వపుదేగాని తరువాతది కాదని ఘంటాపథముగా చెప్పవచ్చును. ఇది ఆకాలమునాటి శాసనమని అంత ఖచ్చితముగా ఏవిధముగా చెప్పగలవని ఎవరైన ప్రశ్నించిన దానికి తగు సమాధానము కూడా ఇందే కనిపించును.

గోవిందరాజు విష్ణుకుండి రాజులలో మొదటి రాజు. అతని పుత్రుడైన మాధవవర్మ తన ముప్పది మూడోయేట [3] సత్తెనపల్లి తాలూకా వేల్పూరు గ్రామములోని రామలింగేశ్వర శాసనములోని శిలా శాసనము కొంత ఆధారాన్ని చేకూరుస్తున్నది. ఆ శాసనములోని విషయములను దానికి ఈ ప్రకృత ప్రాకృత శాసనమునకు గల సంబంధమును వేల్పూరు శాసనములో నాల్గవపంక్తిలోను, దానిముందరిదైన మూడవ పంక్తిలోనున్న విషయములను "మాస్త్ర త్రింశత్సం వత్సరే త్రైలవిక్రమేణ మాధవవర్మణానఃస్కందా వారగితో వేల్పూరు దేశం శాసనానేక సమరముఖ విజయశ్రీమాన్" సహస్ర ప్రదాయిగా టితుల పల్లవకుల కుండ్యాది అన్న వాక్యములతోను తరువాత "బి" ఫేసులో పదమూడవ పంక్తి – ంతిముఖస్వామినః ప్రతిమాం అని య్యశత— రణ్యందత్వా మహాత్మాప్రయత్నేన పూజాం,— త్వం విజయేన్నోన్న రితం స్థాపితాన్య నృపస్యా— వినాయకం నమస్యన్తినరాః. ఈ శాసనములోని చరిత్ర విషయములను సునిశిత పరిశీలనాత్మక పరిశోధన చేయగా శాంతిముఖ స్వామిని ఇక్ష్వాకువంశ స్థాపకుని సింహాసనస్థుని

చేసినాడు విష్ణుకుండి మాధవవర్మ. ఇది క్రీ. శ. 290న జరిగినది. ఈ శాసనములోనే మాధవవర్మ పల్లవకుల తిలకునితో యుద్ధము చేసెనని చెప్పబడినది. ఎవరాపల్లవరాజని ఆలోచించగా ఆతడు వీర కూర్చవర్మ కావచ్చునేమో ? అదే నిజమైనచో వీరకూర్చవర్మతో యుద్ధము చేసి ఇక్ష్వాకు వంశజుడైన శాంతిమూలుని సింహాసనాసీనుని చేసినాడు. అదే వత్సరము నాటి [4] ఐపూర్ శాసనములో అగ్నిష్టోమ సహస్ర యాజి హిరణ్యగర్భప్రసూతం ఏకాదశాశ్వమేధ యాగములు చేసిన ఖ్యాతి సంపాదించినట్లు కన్పట్టు చున్నది. దీనినిబట్టి తన గార్యప్రతాపములను అత్యల్పకాలములో ప్రజ్వరిల్లచేసిన మాధవవర్మ క్రీ॥శ॥ 290 లోనే ఇక్ష్వాకు వంశస్థాపనము చేసినప్పుడు తత్పూర్వమైన ప్రకృత శాసనము అంతకుపూర్వపుదేకాని తరువాతది కాదని ఘంటా పథముగా చెప్పవచ్చును. ఈ శాసనము క్రీ॥శ॥ 290 లోనే ప్రతిష్ఠితమైన ఎడల ఈతని తండ్రి గోవిన్దవర్మ క్రీ॥శ॥ 257 వరకు రాజ్యము చేసెనని ఊహించుకొనవచ్చును.

పులోమావి దాసుడైన గోవిన్దరాజు క్రీ॥శ॥ 220 వరకు శాతవాహన చక్రవర్తికి సామంతుడై తదుపరి మహారాజ పదవాచ్యుడై తన ధైర్య బల సాహసౌదార్యములతో విష్ణుకుండి రాజ్యస్థాపకుడైనాడు. ఇది గోవిన్దవర్మ 37 విజయరాజ్యవత్సరమునకు సంబంధించినది. ఈ శాసనము (4) తుమ్మలగూడెం శాసనంగా ప్రసిద్ధిచెందినది. ఇది పులోమావి రాజ్యపాలన సమయములోనిది. మరి తుమ్మలగూడెం శాసనము అతడు స్వయంప్రతిభతో రాజరికాన్ని హస్తగతం చేసుకున్నాడు. పులోమావి జీవించివుండగానే మహారాజపదవి నధిష్ఠించినా ఆ రాజుయందు భక్తిప్రపత్తులను ప్రదర్శించినాడు. గోవిన్దవర్మ తన 37 విజయవత్సర కాలమునాటికే శాతవాహన చక్రవర్తి మరణించినాడు. తదుపరి కాలములో గోవిన్దవర్మ తన స్థానమును పదిలపరచుకొన్నాడు.

తదనంతరము అతని పుత్రుడు మాధవవర్మ పల్లవరాజును ఓడించి ఇక్ష్వాకువంశ స్థాపకుడైనట్లు వేల్పూరు శాసనము మనకు చెబుతున్నది:

హైదరాబాద్ ప్రాకృత శాశనములోని "పురిమవిదాస" అన్న శబ్దము మహారాజ గోవిందవర్మ అన్నమాట కూడ ఒకే వ్యక్తిని గురించి అందునా విష్ణుకుండి మహారాజును గురించి చెప్పుచున్నదను విషయము ప్రసిద్ధము. ప్రస్తుత శాసనము బట్టి వీరు తెలంగాణము (ప్రస్తుతము) నివసించియున్నట్లు భావించుకొనవలయును. "శ్రీ పర్వత పాదానుధ్యాతానాం" అనునది వారికి రాజ్యముపైగల సేవాధర్మమును సూచించు చున్నది. చక్రవర్తి జీవించియున్నంతవరకు వారి సేవకులుగా ఉన్నట్లు ప్రస్తుత శాసనమువల్ల ద్యోతకమౌచున్నది. అందువల్ల విష్ణుకుండులే ఆంధ్ర భృత్యులా అన్న విషయము దీనివల్ల స్పష్టమగుచున్నది. ఆంధ్ర భృత్యులు విష్ణుకుండులే కావలయునుగాని ఇక్ష్వాకులు కాదని ఘంటా పథముగా చెప్పవచ్చును. ఈ శాసనము పూర్తిపాఠమువల్ల ఇంకెన్నో విషయములు తెలియగలవు.

## అ థో జ్ఞా పి క లు

1. హైదరాబాద్‌లోని గోవిన్దరాజవిహార ప్రాకృత శాసనం, పి. వి. పరబ్రహ్మశాస్త్రి, భారతి, జులై 1983.
2. విష్ణుకుండిస్ అండ్ దైర్ టైమ్స్ : డా॥ ఎస్ శంకరనారాయణన్, పేజి 153 నుండి 181 వరకు.
3. విష్ణుకుండిస్ అండ్ దైర్ టైమ్స్ : డా॥ ఎస్. శంకరనారాయణన్. పేజి 157.
4. విష్ణుకుండిస్ అండ్ దైర్ టైమ్స్ : డా॥ ఎస్. శంకరనారాయణన్. పేజి 153.



# ఓటమిలో గెలుపు

## శ్రీ కాణిపాకం లింగన్న

అర్థరాతిరి నిద్దురవేళ
ఆకసం కింద ఆరుబయట
కనులు మూస్తే, గమ్మత్తు - గతం
స్మృతి పథం. జేరిన కథనం....
బాలబానిసగా బ్రతికి పోగా
బట్ట కట్టిన భావధోరణి-
మబ్బుమాటున చందమామలా
మనసు స్వేచ్ఛ మరుగున పడింది.
మున్నాళ్ళ ముచ్చటని తెలియక
కాల గమనం గుర్తించని యౌవనం.
ప్రేమ పిచ్చిలో కాలమంతా,
అదే సుఖమనుకున్న చింత.
కామం ఉచ్చులో కరిగిపోయింది
అదే సర్వమనుకున్న మది
ఊహామేడలలో వీరవిహారం.
భ్రాంతి, భ్రమ, ఆశనిరాశల
ఊబిలో తగులుకున్న, తర్వాత -
గందర గోళంలో - భయంమిగిలింది
ఆశ్రయంగోరి అవనిపై
అల్లాడిన అనుక్షణం
గాలిపటంలా పరుగులెత్తేను
అభయం దొరకలేదు — సరికదా
ఉత్త చేయి మిగిలింది.
పరిస్థితులు అందరికీ ఉంటాయి
ఎవరూ మరొకర్ని ఆదుకోలేరు
యుగం గడిచిన తర్వాతే -
క్షణం విలువ తెలిసివచ్చింది;
పదివేలు పారబోసుకున్న తరి-
పైసా విలువ గుర్తుకొచ్చింది.
కనులు విప్పి చూశానుగదా -
కంటి చూపు చుక్కలను దాటి
మింటిలో వెలుగు ప్రవాహమై
సాగిపోతోంది అన్వేషణకై
స్వేచ్ఛకు రెక్కలు వచ్చాయి.
సీతాకోక చిలుక దశకు ఎదిగాను.
ఆశ్రయం కోరడం కాదు, ఇంక
ఆశ్రయం ఇవ్వడం జరగాలి.
మాటలు వదులుకున్నాను. ఏకాంతం,
మౌనం, జీవితాన్ని ఏలుతున్నవి.
కాళ్లకు, కళ్లకు బ్రేకులు వేశాను
ఆచరణ నాకు శరణుకాగా -
అనుభవ జ్ఞానం సంపదగా -
క్షణం క్షణం యుగంగా
పైసా పైసా పదివేలుగా -
ఇకపై -
నియమ నిష్ఠలు తోడురా,
కర్మానుష్ఠానం దిశగా
శేషజీవితం సాగిపోవాలని
దీక్షబూని నిలబడ్డాను.
అపుడు నాకు తెలిసినసత్యం.
కనుమూస్తే - గతం మత్తు,
కనువిప్పు - భవిష్యత్తు,
అది ఓటమి !- ఇది గెలుపు !!




( గతసంచిక తరువాయి )

**10**

"ఎదురుగా వున్న పచ్చదనాన్ని చూస్తాను. దానిలో ప్రస్ఫుటి ంయ్యే ప్రాణశక్తి, చల్లదనం, నవోన్మేషణా– అన్నీ నా మనసులోకి ఇంకిపోతవి. అవీ నేనూ ఒకటవుతాం. మనస్సు నిశ్చలమైపోతుంది,

"నిశ్చలంగా, నిశ్శబ్దంగా, అనంతంగా పరుచుకుపోయిన ంహత్తర సౌందర్యం ! ...

"అప్పుడు ఎదురుగా వున్నదానికి పేరుండదు ! నేను ఎంత ప్రయత్నించినా పేరు గుర్తుకురాదు ! ... ఆ ప్రయత్నం విరమించు ంటాను. మనసులోని శూన్యం నుంచీ గభాల్న 'పైరు' అన్న మాట స్తుంది. ఎంతో సంతోషం కలుగుతుంది – ఆ రూపానికి, యీ నామం న్నందుకు – అది నా స్ఫురణలోనికి వచ్చినందుకు –

"ఎదురుగా కన్పిస్తున్న దృశ్యానికి యీ పదాన్ని అన్వయించా ని ప్రయత్నిస్తాను. 'పై', 'రు' – ఈ రెండక్షరాలకీ ఆ ఎదురుగా ున్న జీవశక్తికి ఏమీ సంబంధం కన్పించదు ! అంతా అయోమయంగా న్పిస్తుంది ....

"ఇంతకుముందు మీరు వస్తుంటే చూస్తూ నిలుచున్నాను. ..."మీ పేరు మరచిపోయాను ... పూర్తిగా ! ...

"నామమూ, రూపమూ, అర్థమూ – అన్నిటికీ అతీతంగా వున్న ఆ క్షణాన మీ పేరుతో నిమిత్తం లేదు ... మీరూ, నేనూ వేరు కాదు ! ...

"మీ పేరు శివరావని నాకు గుర్తొచ్చాకా 'శి' 'వ' 'రా' 'వు' అన్న నాలుగక్షరాలకీ ఎదురుగా కన్పించిన మీకూ ఏమీ ప్రత్యేక సంబంధం కన్పించ లేదు. ఆ నాలుగక్షరాలకూ్కడా ఒకదాన్తో మరొకదానికి ఏమీ సంబంధం లేదు ! అంతా వింతగా, క్రొత్తగా, అసందర్భంగా అన్పించింది ....

"అప్పుడప్పుడు యిలా జరుగుతుంది. ఎందుకు జరుగుతుందీ, ఎలా జరుగుతుందీ నాకు తెలీదు ! ...

సాలోచనగా చూస్తూ, మెల్లగా తనకుతాను చెప్పుకుంటున్నట్లే అన్నది రెడ్డెమ్మ.

శివరావు తదేకంగా రెడ్డెమ్మను చూస్తున్నాడు. ఒక్కోసారి ఆ అమ్మాయి మాటలూ, చేతలూ రూపూ విచిత్రంగా అతణ్ణి చకితుణ్ణి చేస్తున్నాయి ...

ఆ బంగారు తీగెను, అతిలోక సౌందర్యమూర్తిని, చైతన్య స్వరూపాన్ని చూస్తూ నిట్టూర్చి ప్రకృతంలోకి వచ్చాడు శివరావు.

"బహుశా అది కుడివైపు మెదడులో 'అర్థం' చేసుకునే పద్ధతి కావచ్చు ... అది విశ్లేషణనీ, హేతుబద్ధతనీ ఎరగదు !" అన్నాడు.

రెడ్డెమ్మ నవ్వేసింది. "ఒకే మనిషి తాను చూస్తున్న విషయాన్ని అర్థం చేసుకునే పద్ధతులు రెండా ? ... బాగుంది ! .... మీరేదో విషయం గురించి పరిశోధిస్తున్నారని ఒకసారి చెప్పారు, దానిగురించి చెప్పండి !" అన్నది.

"అదా నీకెలాచెప్తే అర్థమౌతుంది ? ...." అంటూ ఆగాడు. "మనిషి ఆటవికదశ నుంచి వర్తమానపు నాగరికతలోకి పురోగమిస్తుంటే అతని మేధలో వస్తున్న పరిణామాలు యింతవరకు శాస్త్రీయ పుటంచనాల్లోకి రాకపోయినా, ఒకటి మాత్రం నిజం .... జంతువుల్లో లాగా అది పరిసరాల్తో ఏకీరూపం రావటంలేదు. పరిసరాల్నుంచీ విడివడి, వాటిని గమనించి, గుర్తించి, బేరీజువేసి, అర్థం చేసుకోవటం ద్వారా వాటిపై ఆధిపత్యం సంపాదిస్తున్నది. వాటిని చెప్పుచేతల్లో పెట్టుకోగలుగుతున్నది .... కాని సాధించవలసినది యింకా చాలా వున్నది ! బాహ్యప్రకృతిని జయించటం ఒక ఎత్తు; తన ఆంతరిక అనుభూతుల మీద తాను పొందుతున్న అనుభవాలమీద ఆధిపత్యం రావాలి.

అంతేకాదు మనిషిలో వికసిస్తున్న యీ చైతన్యం మానవ జాతికేకాదు, సర్వప్రాణ శక్తులకూ లక్ష్యం ! అనంతకాలంలో జరుగుతూ వస్తున్న ప్రాణశక్తి వికాసానికి యిది పరాకాష్ఠ అని నా నమ్మకం ! దాన్ని నిత్యంచేసుకోవడమే మానవుడు ప్రకృతిపై సాధించే అంతిమవిజయం ! ... ఇది కాలాన్ని జయించడానికి మార్గంకూడా అవుతుంది ! అన్నాడు.

అతని మనస్సు యింతకుముందున్న విచిత్రస్థితి నుంచి బయట పడి మామూలు స్థాయికి వచ్చింది.

రెడ్డెమ్మ నవ్వుతూ "దీన్ని ఎడమమెదడు పెత్తనంచేసే పద్ధతి అంటారా ?.... తన అనుభవాలను జ్ఞాపకం తెచ్చుకునే శక్తి మెదడుకు ఏర్పడింది, చాలదా?అన్నది."

"జ్ఞాపకశక్తి ఇచ్ఛానువర్తి కాలేదుగదా ! ... అంతేకాదు, పునశ్చరణకు అనుభూతి స్థాయిరాదు !... సంపూర్ణమైన ఆధిపత్యం కావాలి. కోరిన అనుభవాన్ని కోరినప్పుడు తేలిగ్గా పునఃసృష్టిచేసుకుని అనుభూతినిపొందే మహత్తరావకాశం కావాలి !... ఇది యాంత్రిక యుగం. పదిహేడోశతాబ్ది ప్రారంభంలో న్యూటన్ భౌతికశాస్త్ర పరిధిలోనూ, డెకార్టె తత్త్వశాస్త్ర పరిధిలోనూ గణితశాస్త్ర సహాయంతో యీ విశ్వాన్ని ఒక బృహద్యంత్రంగా నిరూపించారు. తర్వాతి యీ మూడువందలేళ్లలోనూ శాస్త్రీయవిజ్ఞానం ఈ మహాయంత్రానికి వస్తూత్రాల్ని కనిపెట్టి, అది మానవుడికి దాస్యం చేసేట్లు చెయ్యగల్గి ...అలాగే అనుభూతి ప్రక్రియకూడా శాస్త్రబద్ధమైనప్పుడు ఇచ్ఛావర్తిఅవుతుంది. అప్పుడే మానవుడు పరిపూర్ణుడౌతాడు అదిజరగాలి అన్నాడు శివరావు.

రెడ్డెమ్మ కోవెలలో ఎవరూలేరు. చుట్టు ప్రక్కలకూడా న సంచారంలేదు. ఇద్దరూ మాట్లాడుతూ మెట్లెక్కి లోపలికెళ్ళారు.

అకస్మాత్తుగా అన్నది రెడ్డెమ్మ "ఈ రెడ్డెమ్మ దగ్గరకు ఎంద వచ్చి కోర్కెలు చెప్పుకుంటున్నారు, వారి నిజాయితీ కొద్దీ ఫలిత పొందుతున్నారు. నీవూ ఒక వరం కోరుకుని చూడు ! ... నీ అత్యంత ప్రియమైనది, ఒక్కటే !"

ఆమె ముఖంలోని గాంభీర్యమూ, స్వరంలోని తీవ్రతా చూచి శివరావుకు ఆశ్చర్యం కలిగింది. ఇంతలోనే ఎంతమార్పు !

"ఈ నాప్రయత్నం ఫలించాలి ... అదే నా ఒక్క కోరిక !" అన్నాడు శివరావు అసంకల్పితంగానే.

నీ ప్రయత్నం ఫలించినపుడు ఫలితం నీవు కోరుకున్నట్ల ఉండక పోవచ్చు ! అన్నది రెడ్డెమ్మ నిశ్చలంగానిల్చుని. ఆమెకళ్ళ అలౌకికమైన తేజస్సుతో మెరుస్తున్నవి.

"అయినా సరే ! నాప్రయత్నం ఫలించాలి !" అన్నాడు శివరావు పట్టుదలగా.

"మంచిది !" విసవిసా బయటికి నడిచివెళ్ళి కోనేటి గట్టున కూర్చుంది రెడ్డెమ్మ,

ఇదంతా కేవలం తమాషాగానే అనుకోలేకపోయాడు శివరావు దీనిని ఎలా అర్థంచేసుకోవాలో నిర్ణయించుకోలేకపోతున్నాడు. రెడ్డెమ్మ ముఖంలో ఆక్షణంలో కన్పించిన గాంభీర్యమూ, నిశ్చలతా అతన్ని కలవరపెట్టింది. ఆమె కోవెలలోనుంచీ బయటకు వెళ్లడంచూచి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

కోనేటిగట్టున మోకాళ్లమీద తలానించుకొని చేతుల్తో ముఖం కప్పుకొని విషాదమూర్తిలా కూర్చునుంది రెడ్డెమ్మ.

ఆ విషాదానికి మూలం అర్థం కాకపోయినా శివరావుకు ఆ పిల్లమీద జాలి కలిగింది, 'ఉత్త అమాయకురాలు !' అనుకున్నాడు. తానూ కోనేటిగట్టుకు వెళ్లి ఆమెప్రక్కనే కూర్చున్నాడు.

"ఎందుకాదిగులు ?" అన్నాడు అనునయంగా.

రెడ్డెమ్మ ముఖం పైకెత్తింది. శివరావు అనుమానించినట్లు ఆమె ఏడవటంలేదు. దిగులుగా, దేన్నో అర్థంచేసుకో ప్రయత్నిస్తున్నట్లుగా

ప్నది : "మీరు కోరుకుంటున్నది పౌండ్రక వాసుదేవ స్థితి! ...ప్రతి నిషి ఒక పౌండ్రక వాసుదేవుడై శంఖ, చక్ర, గదాదులు తయారు సుక్కూర్చోవాలని ! మేథ పెరిగినకొద్దీ సర్వాధిపత్యంకోసం ప్రయ స్తుంది. ఈ ప్రయత్నం ఆత్మరక్షణమేరకు మంచిదే. కాని అదిమితిమీరి ప్పుడు దేన్ని తృప్తిపరచాలని ప్రయత్నిస్తున్నదో దానికీ, అధికార హానికీ బానిస అవుతుంది ! తనచుట్టూ కోటకట్టుకుని జీవంతో ంబంధం పోగొట్టుకుంటుంది. తననుతాను నాశనం చేసుకుంటుంది !

...అసలిదంతా ఎందుకు ? ఈ ప్రపంచంలో బ్రతికే మనిషికి న్నోవిధాలైన పరిమితులున్నవి. వాటిని చూడగలగటమే స్వేచ్ఛ. అలా ాడనిరాకరించేవాడు తననీ, తన స్వేచ్ఛనీకూడా నిరాకరించుకొని ్యర్థుడౌతాడు.... చెట్టుఎంత గొప్పదిగా కన్పించినా దానిక్కావల్సిన వశక్తి దాని వ్రేళ్ళకీ, భూమికీవుండే సంబంధంనుంచీనే వస్తుంది !... వితం కాలగమనంతో పాటు ప్రవహించే ఏకముఖ ప్రవాహం. అదే ాసుదేవుడు ! వాసుదేవుడెప్పుడూ ఒక్కడే !"

ఆమె స్వరంలోని ఆవేదనకు శివరావు కలవరపడ్డాడు.

"నా ఉద్దేశ్యంలో మానవప్రయత్నమే దేవుడు ! అదే మనిషిని ముందుకు నడిపిస్తుంది ! అదే జీవశక్తి !... నీవు ఎందుకింత బాధ పడుతున్నావో నాకు అర్ధంకావటంలేదు, రెడ్డెమ్మా! ఇప్పుడేంజరిగిందని? ఏదో జరిగిపోతున్నట్లు ఈ అశాంతి ఎందుకు?... మేథను గురించి నీవు చెప్తున్నదాన్లో క్రొత్తఏమీలేదు ! అదొకగొప్ప విషాదగాథ అనుకో నక్కర్లేదు ! మనిషి ఎటువంటి పరిస్థితిలోవున్నా నీవుచెప్తున్న ఆ బాని సత్వంలోనుంచి మేల్కొని, నీవుచెప్తున్న ఆ సంబంధాన్ని ఏక్షణాన్నైనా పునరుద్ధరించుకో గలడని మార్టిన్ బూబర్ అన్న ప్రసిద్ధ తత్త్వవేత్త నిర్ద్వంద్వంగా చెప్పాడు. కాబట్టి దిగులుపడకు !" అన్నాడు నవ్వుతూ.

రెడ్డెమ్మ ముఖంలో విషాదపు నీడలు చిక్కనయ్యాయి. "అవును! ఏక్షణాన్నైనా పునరుద్ధరించుకోగలడు .... విశ్వాసంవుంటే ! తరుణం వస్తే !.... నేను చదువుకున్నదాన్నికాదు. మార్టిన్ బూబర్ ఎవరో, అతనేంచెప్పాడో నాకు తెలియదు ! "అన్నది.

"అవును, నీకేమీ తెలియదు ! తెలియకుండానే చాలా మాటలు చెప్తావు ! .... నీది కేవలం వాక్చాతుర్యమో, బుద్ధిబలమో నేను తెనుక్కోలేకుండా వున్నాను.... అంతేకాదు ! ఈ చోట నీమాటలు, నీ ప్రవర్తన విలక్షణంగా వుంటున్నాయి. బయట కన్పించేనీవు మామూలు కొంటెపిల్లవనుకోవచ్చును. కాని యిక్కడమాత్రం గొప్ప వేదాంతివి !" అన్నాడు శివరావు.

"అదంతా మీ భ్రమ!" అన్నది. రెడ్డెమ్మ నవ్వేస్తూ ఇప్పు డామె ముఖంలో విషాదంలేదు.

శివరావు మనస్సు తేటపడ్డది. తేలిగ్గా నిట్టూర్చాడు. రెడ్డెమ్మ మాటలూ, ప్రవర్తనా కొందరు ఆడపిల్లలు చేసే విపరీతపు చేష్టలుగా కూడా తోచసాగింది.

"ఆడవాళ్లను గురించీ, వారి బుద్ధి గురించీ ప్రసిద్ధతత్వవేత్తలు క్రీస్తుపూర్వపు అరిస్టాటిలూ, పద్దెన్మిదో శతాబ్దపు షోపెన్‌హోవరూ చెప్పిన విషయాలు జ్ఞాపకం వస్తున్నవి నిన్ను చూస్తుంటే ! నీకు నా సలహా ఏమిటంటే ఎక్కువగా ఆలోచించి వున్న కాస్త బుర్రను పాడు చేసుకోకు !...షోపెన్‌హోవర్ యిప్పుడిక్కడుంటే నీ గురించి ఏమని వుండేవాడో తెలుసా ?...నన్ను ఆకర్షించడానికే నీ బుద్ధిలేమినంతా వాక్చాతుర్యంగా ప్రదర్శిస్తున్నావనే ఖచ్చితంగా చెప్పేవాడు!" అన్నాడు శివరావు.

అతని మాటలకు హాయిగా నవ్వేసింది రెడ్డెమ్మ. "అతను ఇక్కడుండి అలా అని వుంటే...అతని మాటలు కావనీ అనలేను; ఒప్పుకోనూలేను !" అన్నది.

శివరావు రెడ్డెమ్మ కుడిచేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. అతని మనస్సులో అనురాగం నిండిపోయింది.

స్త్రీపురుష సంబంధాల్లో సామాన్యంగా కనవచ్చే వాంఛా ఆవే శమూ అతన్ని ఈడ్చుకుపోవడంలేదు. మనస్సు ప్రశాంతతను పొందింది. ప్రవృత్తికీ, హేతువుకీ. అతీతమైన యీ బంధం - దీని స్వరూపమేమిటి ? అనుకున్నాడు అలవోకగా, సమాధానంకోసం ప్రయత్నించకుండా...

అతని మనస్సు ఆలోచనల కతీతమైన ప్రశాంతస్థితిలో శూన్యంగా వున్నది...తన చేతిలో యిమిడి వున్న ఆమె చేతిని అటూ యిటూ త్రిప్పుతూ వుండిపోయాడు...

...బంగారు రంగులో నిగనిగలాడుతూ గొప్పశిల్పి బహు సుందరంగా మలిచినట్లున్న ఆ చేయి క్రొత్తగా కన్పించింది. రెడ్డెమ్మతో సంబంధం లేకుండా కన్పించింది.. విశిష్టమైన రూపురేఖల్తో - ఆ చెయ్యి కాదు, అది !- ప్రత్యేకమైన వ్యక్తిత్వంలో వెలుగుతూ కన్పించింది.., అతని మనస్సు పరిసరాల్నుంచి విడివడిపోయింది. ప్రపంచ స్పృహ జారిపోయింది... 'అది' స్నిగ్ధతా, సౌందర్యమూ, పవిత్రతా మూర్తీభ వించిన చైతన్యరేఖ !... అనంతమైన జీవశక్తితో తొణికిసలాడుతూ, అతని మనస్సుతో ఏకరూపమై, అర్థానికి అతీతమైన స్థాయికి లాక్కెళ్లగా...

అక్కడ కన్పించింది—

మహత్తరానందరూపం...

సర్వసృష్టికి ఆధారభూతమైన ప్రేమ...

అతని శరీరం జలదరించింది.

విభ్రాంతుడై, తల విదిలించుకుని వర్తమానంలోకి వచ్చాడు.

'ఏమిటీ ఇంద్రజాలం ?' అనుకున్నాడు. మనస్సులో కలవరం రేగింది. తన చేతిలో వున్న రెడ్డెమ్మ చేతిని నిప్పు కణికను ఒదిలేసినట్లు గబుక్కున ఒదిలేశాడు.

రెడ్డెమ్మ లేచి నిల్చుంది. చీకట్లు ముంచుకొస్తున్నాయి.

"మీరు రేపు వెళ్లిపోతున్నారు కదా !... రేపు వుదయం అదిగో, అ కన్పిస్తున్న చెట్టు దగ్గరకు రండి.... నేనూ వస్తాను.. మిమ్మల్ని ఒక విషయం గురించి అడగాల్సింది మిగిలిపోయింది!..." అనేసి, వెనక్కి తిరిగిచూడకుండా చరచరా వెళ్లిపోయింది.

శివరావు చాలాసేపటివరకు అలానే కూర్చుండిపోయాడు. జరుగుతున్నది నిజమా ? లేక తన భ్రమ మాత్రమేనా ? ఎటూ తేల్చుకోలేకపోతున్నాడు.

అతని మనస్సునిండా అసంతృప్తి. అస్పష్టభావ సంచలనం... ఈ రెడ్డెమ్మగుండు, దాని పరిసరాలు, అందులోని వ్యక్తులు, వారి చేష్టలు – అన్నీ కలిసికట్టుగా తనను కబళించడానికి సిద్ధంగా వున్న వన్న భావన అతనిలో కలిగింది. తెలీని భయం ఆవరించింది.

ఈ రెడ్డెమ్మ ఒక పురాతన శక్తి. ఈ ప్రదేశం ఆమె స్థావరం. దిన్నూ ఆశక్తిని ప్రశ్నిస్తున్న ఒక భావ విప్లవ వీచిక అయితే నారాయణస్వామి ఈ శక్తి సాగరంలో తన అహాన్ని నిలుపుకోవాలని ప్రయత్నిస్తున్న ఒక అల ! అయినా వాళ్లంతా ఆ శక్తికి చెందిన భాగాలే !

శివరావు ఏదో అశక్తత అవరించినట్లు అలానే కూర్చుండిపోయాడు. కొంతసేపటికి ప్రయత్నంచేసి తన శక్తిని కూడగట్టుకున్నాడు. లేచి నిల్చుని నేను రేపు వెళ్లిపోతున్నాను!' అనుకున్నాడు. అలా అనుకుంటే అతనికి భారం తగ్గినట్లు అన్పించింది. అంతటితో తృప్తి కలుగనట్లు మరోసారి పెద్దగా 'నేను రేపు వెళ్లిపోతున్నాను' అన్నాడు చుట్టూ చూసి ఎవరూ లేరని నిశ్చయించుకొని, మరొకసారి మరింత పెద్దగా 'నేను రేపు వెళ్లిపోతున్నాను' అన్నాడు. మనసు తేలిక పడ్డది. తన చేష్టకు తనే నవ్వుకుంటూ యింటి ముఖం పట్టాడు.

## 11

శివరావు రెడ్డెమ్మగుండునీ, రెడ్డెమ్మనీ చూడటానికి యివాళ ఆఖరురోజు సాయంత్రం బస్సులో బెంగుళూరు వెళ్ళి, అక్కణ్ణుంచి ముదుమలై అడవిలోంచి ఊటీ వెళ్తాడు. ఆ ప్రాంతపు గిరిజనుల విచిత్రమైన నేలబారు దేవాలయాలూ, వాళ్లనమ్మకాలూ గురించి తెలుసుకోవాల్సిన పనుంది.

ఉదయమే కోనేరుదగ్గరికి వచ్చాడు శివరావు. గాలి చల్లగావుం వాతావరణం చాల ప్రశాంతంగా వుంది. అతని మనస్సు అకారణం ఆనందంతో నిండిఉన్నది. రెడ్డెమ్మగుండుకు వెనుకవైపుగా నీడ పచ్చికమీద కూర్చున్నాడు.

రెడ్డెమ్మ రావలసిన దోవ కనిపిస్తూనే వున్నది. కొంతదూరం ఆమె చెప్పిన చెట్టూ కన్పిస్తున్నది. అది చాలాపెద్దది. 'ఏ ప్రాచీ కాలంనుండి అలా నిల్చుని వున్నదో ఈ మహావృక్షం!' అనుకున్నా శివరావు. దాని కొమ్మలు ఆకాశపునీలపు వెలుగులమీద పరచుకొ ఆది భూమ్యాకాశాల్ని కలుపుతూ ఎంతో నిబ్బరంగా, ప్రశాంత మూర్తీభవించినట్లు, మహామౌనిలాగా నిల్చునివున్నది. ఆకాశం వృక్షాన్ని బహుసున్నితంగా అపురూపంగా, ఎంతో ప్రేమతో చుట్టేసిం

...అవ్యాజమైన ప్రేమ .... అనంతమైన స్వేచ్ఛ !...

అతన్ని సదా అంటిపెట్టుకొనివుండే ఆలోచనల బరువు తొల పోయింది ఒక్కసారిగా. పచ్చగడ్డిమీద వెల్లకిలా పడుకున్నాడ పచ్చిక చల్లగా, మెత్తగా, హాయిగావున్నది. నీలాకాశంలో తెల్ల మబ్బులు విలాసంగా తేలిపోతున్నవి.

అతని మనస్సు క్రొత్తలోకంలోకి ప్రవేశించింది. కన్పించి ప్రతివస్తువూ అందంగా, అద్భుతంగా, ప్రియంగా వున్నది.

ఒక మహత్తర పవిత్రతాభావం అతని మనసు నింపేసింది. ఇంతకంటే కావల్సింది మరోటి ఏమీ లేదు ! అన్పించింది.

అనిర్వచనీయమైన సుఖమయ సుషుప్తి అతన్నావరించింది.

సుఖం అతనిచుట్టూ వలయాలుగా ఏర్పడ్డది.

ఆ వలయాలు పెద్దవై, మరింత పెద్దవై విశ్వాన్నంత ఆవరించాయి...

ఆ సుఖంలోకి యిమిడిపోయి, కలిసిపోతూ లయబద్ధమై శబ్దం ఎక్కణ్ణుంచో వినిపిస్తున్నది.

...డబ్, డబ్, డబ్, డబ్...

అనంతమైన నిశ్శబ్దంలోంచీ గుండెచప్పుడులా పుట్టుకొస్తున్న ఆ శబ్దం అతన్ని తాకుతూ ఒక స్పృహగా ప్రవహిస్తున్నది.

సుఖం ... అనంతమైన సుఖం ! ..

ఏమిటిదంతా ?!

ఇలా జరగటం సాధ్యమా ?

కొంచెంసేపు ఆలోచించాడు. మనోసీమనంతా తరచి చూచ కున్నాడు. 1950 లో మెస్కాలిన్, యల్. యస్. డి. వంటి సైకిడెలిక్ రసాయనిక పదార్థాల ప్రభావం వలన కొందరు అతీ

న్య స్థాయిని పొందటమూ, అది విచిత్ర మానసిక ప్రపంచాల్ని ష్కరించడమూ జరిగింది. దివ్యానుభవాల్ని పొందామన్నారు. ద్ధతాత్వికుడు హక్స్లీ యీ రసాయనిక - దివ్యసాక్షాత్కారా ా యోగస్థితికీ భేదము లేదనీ, రెండూ ఒకే కోవకు చెందినవే ,చెప్పాడు కూడా. ఒక్క మాత్రతో సచ్చిదానందం పొంద చ్చును.

కాని... తానలాంటివేమీ తీసుకోలేదే! మరి యిదేమియోగం? సాధారణ మానసిక స్థాయి కానేకాదు !

ఇది సాధించాక యిహ మనిషి కోరుకోదగినదీ, చేయవలసినదీ ధించవలసినదీ ఏముంటుంది ?!

మనస్సు ఆనందంతో నిండుదనాన్ని పొంది బరువెక్కిపోతు ది. కళ్లముందు అనంతమైన సౌందర్యం పరుచుకుని వున్నది. కటి తర్వాత మరొకటిగా సౌందర్యద్వారాలు తెరుచుకున్నవి.

విప్పారిన కళ్లతో తలెత్తిచూచాడు. దూరాన, భూమినీ కాశాన్నీ కలుపుతున్న మహావృక్షం క్రింద ఒక ముసలాయన ప్పించాడు. అతని వయస్సు ఎంతో చెప్పడం కష్టంగాని అరవైదాటి ంటుందనిపిస్తున్నది. అతను రాతి దిమ్మెమీద కూర్చునివున్నాడు. క గోధుమవర్ణపు పాదాలు నేలమీద ఆనీఆననట్లుగా వున్నవి. పొడు టిచేతులు ఒళ్లో ధ్యానముద్రలో వున్నవి. పొడవాటి శరీరం తెల్లని ంచే, వల్లెలచే కప్పబడివున్నది. ఆయన తలమీది కొద్దిపాటి తెల్ల ంటుకలూ, మూతిచుటూ వున్న తెల్ల మీసాలూ, తెల్లని పొట్టిగడ్డమూ న్నీ ఆయన్ని వెలుగుదారాల్లా చుట్టి, తలచుట్టూ తెల్లనివెల్తురు ంయాన్ని ఏర్పరచినై. అతనిముఖం తేజోపూర్ణంగావుండి సర్వజ్ఞత స్ఫుటమౌతున్నాకూడా భావరహితంగానూ వున్నది. అతనిచూపు స్థానికి అతీతమైన శూన్యతను కలిగి వున్నది. శతకోటి సూర్య రాయణుల కాంతి అతనిలో నిక్షిప్తమైవుండి, అతనినుంచి చల్లని బుగు వెన్నెలగా బహిర్గతమౌతున్నది. అతను ఆకాశాన్నీ, భూమినీ బుపుతున్న వెన్నెల చారలాగా కూర్చుని వున్నాడు ఆ చెట్టుక్రింద!

ఎవరతను ? ఎప్పుడు, ఎక్కడినుంచి వచ్చాడు ? అతను ంంగా మనిషేనా? మనిషేఅయివుంటే మానవజన్మకుండే ఏవికారమూ రూపంలో తోచడంలేదేల ? ఒక ముసలాయన అనితప్ప అతని రించి గ్రహించడానికీ, తలచుకోవడానికీ, చెప్పడానికీ ఏగుణమూ ంతుచిక్కడంలేదు! అతను 'ఉన్నాడు', అంతే !

ఏ ఒక్క వస్తువునీ కాక సమస్తాన్నీ గ్రహిస్తున్న అతని ూపు, బుద్ధికి అతీతంగావున్న ఆ శూన్యతాభావం శివరావుకు కలవరం గ్గించింది, ఆ చూపు అతని అస్తిత్వాన్నే ప్రశ్నిస్తున్నట్లు భ్రమ గ్గింది .... అది మృత్యువేమోనన్న భయం కల్గింది.

అతను శివరావునే చూస్తున్నాడు...

శివరావుకి ఆదుర్దా కలిగింది. తానెవరో ఎక్కడున్నాడో అంతు చిక్కలేదు. ప్రయత్నంతో అతన్నుంచీ చూపు మరల్చుకున్నాడు. 'ఆ కన్పిస్తున్న దానితో నాకేమీ సంబంధంలేదు ! నేను మనిషిని - మనిషిగానే వుంటాను' అనుకున్నాడు.

అతని సుషుప్తి సాగరంలో చిన్న కలవరం బయల్దేరింది. 'ఏమిటో చెయ్యాలి... ఎమిటది?... రెడ్డెమ్మ ?... విషయం స్పష్టంగా ఎదుటనే ఉన్నది. కాని దాన్ని నిర్వచించే పదం దొరకటంలేదు !... పదమూ, విషయమూ కలిసే వుండాలి !

ఆ పదాన్ని అందుకుందామన్న కలవరం అలయైలేచి, కోణా కృతిగా ఏర్పడింది... దాని శీర్షం పైనుండి 'నిర్ణయం' అన్న పదం వచ్చింది.

ఆ పదం తనకు లభించినందుకు శివరావుకు గొప్ప సంతోషం కలిగింది. ఆ పదంతోటే విషయమూ పట్టుచిక్కింది... ఆ, అదీ!... రెడ్డెమ్మ విషయంలో ఒక నిర్ణయానికి రావాలి !

అతనిలో ఏదో నూత్న చైతన్యం మేలుకున్నది. తన మన సులో ఏర్పడే కదలికలు చూస్తున్నట్లు వింత అనుభూతి కలిగింది... నిశ్చలమైన మనస్సులో కదలిక ఏర్పడి, సాంద్రతరమై ఒక ఊహగా ఏర్పడుతున్నది ! ఆ ఊహ చిక్కనై పదం అవుతున్నది...ఆ పదాన్ని మరింత ఘనీభవింపజేస్తే ? !...

అతనిలో ఉత్సాహావేశాలు ఉరకలు వేసినై, 'నా పరిశోధన ఫలిస్తుంది... ఇది సాధ్యమే !' అనుకున్నాడు.

అప్రయత్నంగా 'సాధ్యం' అన్న పదం పుట్టుకువచ్చింది. ఆ పదం అతను చూస్తుండగానే ఘనీభవించింది !...

తర్వాత 'సుఖం' అన్నాడు. తర్వాత 'మంచితనం' అన్నాడు. అలా ఎన్నో, ఎన్నో...

ఎదురుగా మిరుమిట్లు గొలుపుతూ జ్ఞానవాహినిలా అనుభవాల ప్రోగు...అందులో నుంచి వెలికివస్తున్న మహత్తర సందేశాలు...

ఎలాగైనా యీ జ్ఞానాన్ని పట్టుకోవాలి ! భద్రపరచాలి ! సొంతంచేసుకోవాలి ! అనుకున్నాడు ఆదుర్దాగా.

తోచీతోచకుండా అతన్ని కలవరపెడుతున్న విషయం క్రమంగా వెలికి వచ్చింది.... తాను సృష్టిస్తున్నాననుకొంటున్నవన్నీ తాను ఉద్దేశించి చేస్తున్నవికావు ! ఇక్కడ ఉద్దేశ్యపూర్వక ప్రయత్నం లేదు ! తనబుద్ధి నిర్దేశానుసారంగా అవి ఏర్పడటం లేదు !

అవి నిజంగా భౌతిక సత్యాలేనా ?

ఈ స్థాయిలో భౌతికానికీ, అభౌతికానికీ మధ్యన గీత ఎలా గీయటం ?

యదార్థానికి నిర్వచనం ఎలావస్తుంది ?

అతనిలో ఆదుర్దా పెరిగిపోతున్నది... ఇక్కడ ఫలితం కన్పిస్తున్నదిగాని ప్రయోగ విధానపుపట్టు చిక్కలేదు ! ఇహ అది నిజమని ఋజువేమిటి ?

ఇది హేతుబద్ధ, శాస్త్రీయ యుగం.

ఏ ప్రయోగమైనా కొలతలకు కిట్టుబడాలి. పునఃప్రయోగానికి అనువుగావుండాలి. దాని వెనుకనున్న నియతి ఒక సిద్ధాంతంలోకి యిమడాలి. అప్పుడే అది శాస్త్రీయమైన నిజం అవుతుంది, అంతవరకూ అది ఉన్నాలేనిదీ, అయినా కానిదీగానే మిగిలిపోతుంది !

కాని ఈ అపూర్వ ప్రయోగం హేతుబద్ధ మానసంతో మరొకరు మరొకచోట చెయ్యగలగటం సాధ్యపడుతుందా? అనుకున్నాడు నీరసంగా.

వెంటనే అతన్లో ఒక బలవత్తరమైన శక్తి ఉద్భవించింది.

ఏది ఏమైనా...

అపరోక్షతనుంచీ పరోక్షతరావడానికి వీల్లేదు !

యాదృచ్ఛికతనుంచీ హేతువు పుట్టదు !

అవ్యవస్థనుంచీ వ్యవస్థరాదు !

అవిచ్ఛిన్న హేతుధారనుంచీనే శాస్త్రంపుడుతుంది. సత్యావిష్కరణ జరుగుతుంది ! అనుకున్నాడు ధృఢంగా.

అసలు యిదంతా నిజమేనా ?

నిజాన్ని కనుక్కోగల శక్తి మనస్సుకున్నదా ?

కొన్ని మూలప్రత్యయాల ఆధారంగానే మనస్సు ప్రపంచాన్ని గ్రహిస్తున్నది గనుక ఈ ప్రపంచం సాపేక్షమేగాని సత్యంకాలేదు గదా!

అలాంటప్పుడు నిజమంటే ఏమిటి ?....

శివరావుకు విసుగుపుట్టింది.... ఈ యుగంలో సత్యానికి చేరువ కాగల శక్తిగలదిగా ఋజువు పరచుకొంటున్న ఏకైక శాస్త్రమైన గణితశాస్త్రము మూలప్రత్యయాలను ప్రశ్నించదు; వాటి పరస్పర సంబంధాల నిజానిజాల్ని పరిశీలిస్తుంది. ఈ యుగానికి తాత్త్విక ప్రాతినిధ్యం వహిస్తున్న దృశ్యశాస్త్రం (Phenomenology) అనుభూతుల యాదార్థ్యాన్ని ప్రశ్నించదు. కాబట్టి ఇప్పుడు నేను ఈ అనుభూతుల యదార్థత జోలికి వెళ్లను! అని నిశ్చయించుకున్నాడు.

ఎదురుగా వున్న ఘనీభవించిన అనుభూతులను కూర్చి, అర్థవంతమైన ఆకారం యిస్తే ఎట్లుండునోనన్న ఆలోచన వచ్చింది. వాటిని నొకదానిపై నొకటి పేర్చాడు. చక్కగా అతుక్కుపోతున్నాయి !

ఇప్పటికైనా రెడ్డెమ్మ వస్తుందేమోనని చూచాడు. ఆమె రా డంలేదుగాని ఆ ముసలాయన అట్లాగే చూస్తూ కన్పించాడు. ఇప్పుడ అతను బక్కగా, అస్థిపంజరానికి చర్మం తొడిగినట్లుగా వున్నాడు ఒక్కోసారి అస్థిపంజరం లాగానూ కన్పిస్తున్నాడు.

అతని చూపు శివరావుకు భరింపరానిదిగా తోచింది. ఏ భావ లేకుండా అట్లా చూస్తాడేమిటి ?!

తను చేస్తున్న పనికి నవ్వినా, తిట్టినా, ఎగతాళిచేసినా శివరావుకి అర్థం అయ్యేది. కాని...ఈచూపుముందు తన ఆశయాలు, తన ప్రయోగాలు, ఈ మహత్తర విజయమూ - అన్నీ వ్యర్థమైనవిగా, వెర్రిచేష్టలుగా అన్పిస్తున్నవేమి ?

'ఆ చూపును భరించాల్సిన అవసరం నాకులేదు' అనుకున్నాడు.

తన చుట్టూ అనుభవాల కోటకట్టి, ఆ చూపు - ఆ అర్థరాహిత్యం - ఎప్పటికీ తనకు కనపడకుండా చేసుకోగలడు !

రకరకాల అనుభూతులను ఘనీభవింపజేసి, చిత్రవిచిత్రాలుగా పేరుస్తూ కోటగడుతూ పోతున్నాడు శివరావు. బాహ్య ప్రపంచాన్ని మరపించేటంతటి ఆసక్తిపుట్టింది పనిలో. చుట్టూ గోడలు పైకిలేచినై.

రెడ్డెమ్మ వస్తున్నదేమోనని ఆఖరు సారిగా చూశాడు శివరావు. రెడ్డెమ్మ జాడలేదు; కాని ముసలతను యింకా అట్లాగే చూస్తున్నాడు !

ఈ సారి శివరావుకు భరింపరాని కోపం వచ్చింది. ఆ ముసలతన్ని చూడకుండా వుండటానికి తన కోట పైనంతా మూసేశాడు !

ఇహ బయటి ప్రపంచంతో సంబంధంగా ఒక్కవాకిలి మిగిలింది. అందులోనుంచీ దూరాన రెడ్డెమ్మ కన్పించింది. గబగబా నడిచి వచ్చింది. తన ఆలస్యానికి క్షమాపణ చెప్పుకుంటున్నట్లుగా వేగంగా వస్తున్నది.

ఆమె సుకుమార రూపాన్ని చూడగానే అతనికి విసుగు పోయింది. సంతోషం కలిగింది ఒక్క క్షణకాలం.

కాని ఆమెకు ముందుగా ముసలతనున్నాడు ! అలానే అర్థశూన్యంగా చూస్తూనేవున్నాడు.

నిశ్చలంగా కూర్చునివున్న ముసలతను, వెనుకనే గబగబా నడిచివస్తున్న రెడ్డెమ్మ...వాళ్ళిద్దరూ ఒకటిగానే కన్పించారు శివరావుకు.

అప్పుడు జ్ఞాపకం వచ్చిందతనికి - రెడ్డెమ్మ తనను ఆ చెట్టు క్రిందకు రమ్మని చెప్పిందని !

ఇప్పుడూ అక్కడికే రమ్మంటుందా ? ఆ ముసలివానితో పాటుగా ఆ చెట్టు క్రిందనే కూర్చుందామంటుంది !.. నా కోటలోనికి మాత్రం రాదు !' అనుకున్నాడు శివరావు.

అకస్మాత్తుగా అతని మనసుకు పట్టిన మబ్బు ఎదో విడిపోయినట్లయింది. 'ఆ పిల్లకీ నాకూ ఏం సంబంధం? ఈ పల్లెటూరితో నాకేం పని?' అనుకున్నాడు ఆశ్చర్యంగా, అసహనంతో.

ఆలోచించినకొద్దీ ప్రేమ భావం అసహ్యంగా మారిపోయింది.

రెడ్డెమ్మమీద అసహ్యం, తన మీద అసహ్యం, ప్రేమమీద అసహ్యం!

తాను గొప్ప మేధావి. తన మేధా సంపత్తి వలన ప్రపంచ స్థాయి గుర్తింపు పొందబోతున్నవాడు. ఈ అనామకపు పల్లెపిల్ల మాయలో ఎలా చిక్కుబడ్డాడు?!

ఈ రెడ్డెమ్మ తన జీవితంలోకి అడుగు పెట్టకూడదు! యీ అమ్మాయితో తనకు ఏ విధమైన సంబంధమూ అవసరంలేదు!

తన జీవితానికి సాఫల్యం యిప్పటికి సిద్ధించింది! తన అనుభూతులన్నీ బాహ్యాలై అందుబాటులోకి వచ్చాయి. తాను యిన్నేళ్ళూ ఎదురు చూచిందీ, తపన పడిందీ దీని కోసమే! తన అభిరుచీ, అభినివేశమూ యిందులోనే వున్నై. తన అనుబంధాలన్నీ దీనిలోనే అనుకున్నాడు.

ఆ వాకిలితో, ఆ ప్రపంచంతో, ఆ రెడ్డెమ్మతో తనకు అవసరం లేదు. ఉక్కిరి బిక్కిరి చేస్తున్న ఆ వైశాల్యం ఆ స్వేచ్ఛ తనకు అక్కర్లేదు! తన స్వర్గం చాలు!

ఇలా నిశ్చయించుకోగానే అతన్ని కలవరపెడుతున్న భావాలన్నీ నిశ్చలతను పొందాయి.

ఇంతవరకూ రాత్రిగా మార్చని ఒక్కపదం కోసం, ఒక్క భావం కోసం తన అంతరాంతరాల్లో గాలించాడు. 'ప్రేమ' అనుకోగానే అదికూడా ఘనీభవించి విసుగు, కోపం, భయం, అసహ్యం అయి చీకట్లో కుప్పబడిపోయింది.

ఇక శివరావుకు ప్రపంచం లేదు! అతను ఒక్కడే ఉన్నాడు!

## 12

శివరావు అనుకున్నాడు - అనుభూతుల్ని శాశ్వతం చేసే ప్రక్రియ తనకు పట్టుబడింది. తన అనుభవాలన్నీ కరతలామలకాలై పోయాయి. తనకు పూర్ణత్వం సిద్ధించింది. ఇది కేవలం తన కోట! తన లోకం! తను!

ప్రపంచం నుంచీ వేరైపోవాలని అతను అనుకోలేదు.. క్వాంటం ఫిజిక్సులో సూక్ష్మాతి సూక్ష్మ రేణువుయొక్క ద్రవ్యరాశినీ, వేగాన్నీ రెండింటినీ ఖచ్చితంగా తెలుసుకోడానికి వీల్లేదు. అలాగే అనుభూతిలోకం తరచి చూస్తున్నపుడు ప్రపంచం స్పష్టంగా వుండదు. ప్రపంచ వ్యవహారంలో లీనమైనప్పుడు అనుభూతి అస్పష్టమౌతున్నది. మేధాపరమైన యీ అనివార్యద్వంద్వ వృత్తి తప్పనిది... యిప్పుడు అటువంటి ఆలోచనలు అనవసరం!

తనవైన అనుభూతుల మాధుర్యం అతన్లో నిండిపోయి మత్తెక్కించేస్తున్నది...

కాని కొంతసేపట్లోనే అతనికి ఊపిరాడనట్లైంది. ఉక్కిరి బిక్కిరి అవుతున్నట్లు, శరీరం బిగుసుకు పోతున్నట్లు అనిపించింది.

ఆయాసం.... ఆయాసం.... బాధ

గాలి! .... అడటంలేదు!

ప్రపంచానికి తనకీ కూడా కావలసినదీ, అన్నిటిస్థితికీ మూలమైనదీ, సర్వాన్నీ ఏకంచేసేదీ .... ఏదీ గాలి?

అతని చేతుల్లో, కాళ్లలో ఏదోశూన్యత ప్రవేశిస్తున్నది. అతని నరాలు నిస్సహాయంగా వెనక్కు తోడుకుపోతున్నవి. బాధ! బాధ! అతను మొదటిసారిగా, అదుర్దాగా తన శరీరాన్ని పరికించి చూచుకున్నాడు. దాన్నిగురించి అతను యింతకు ముందెప్పుడూ ఆలోచించలేదు గమనించలేదు! తనని కానిదాన్ని చూస్తున్నట్లు అర్థరహితంగా, అయోమయంగా చూచుకున్నాడు.

గుండెను నలిపేస్తున్న బాధలో అతనికోట కేవలం నిష్ప్రయోజకమైపోయింది!

శివరావులో కోపం, ఆశ్చర్యం ఉవ్వెత్తుగా లేచాయి.

తాను చచ్చిపోతున్నాడా?!

జీవపరిణామ క్రమంలో మహత్తరమైన వికాసాన్ని సాధించిన మానవబుద్ధికి ఒక కేంద్రమయిన యీ మనస్సు యింతటితో నిష్ఫలంగా మాయమై పోవటమేనా?!

శివరావు నమ్మలేక పోతున్నాడు!

తన జీవితం, తన ఆలోచనలు, తన తెలివితేటలు - ఈ చైతన్య పరిణామక్రమంలో అత్యవసరమైనవి కావా?

తాను సాధించిన విజయం మానవజాతి పదిలపరచుకోవలసిన అమూల్యమైన విషయం కాదా?

అంతా... అంతా... కేవలం నిష్ప్రయోజకంగా యింతటితో యిలా నశించిపోవటమేనా?!

శివరావు ఏమీ చెయ్యలేని నిస్సహాయుడై పోయాడు.

అతని శక్తి క్షీణించిపోతున్నది..

'మనిషి ఆ సంబంధాన్ని ఎప్పుడైనా పునరుద్ధరించుకోగలడని మార్టిన్ బూబర్ చెప్పాడు...' అనుకున్నాడు శివరావు.

భూమ్యాకాశాల్ని కలుపుతూ వెలుగుచారలాగా ముసలాయన ఆకారం మసగ్గా కనిపించింది. కాని శివరావు అతన్ని చూడ దలచుకోలేదు.

శివరావులో క్రమంగా నిస్పృహ చోటుచేసుకున్నది.

ప్రకృతి శక్తుల్ని కైవశం చేసుకుని, ప్రపంచాన్నంతటినీ తన పరధిలోకి లాక్కోగలిగిన యీ మానవబుద్ధి యావత్ ప్రకృతికీ మూలే స్థానం కాకుండా పోతుందని ఎప్పుడూ అనుకోలేదే !

ఈ బుద్ధి ద్వైయవస్తువైన ప్రకృతితో తన గ్రహణశక్తి వలన ఐక్యతను సాధించి అవి నా భావం పొందటంలేదా ?!

బుద్ధి గ్రహించే సత్యం బుద్ధికి వెలుపలనే వుండిపోతున్నదా ? ఈ గ్రహింపు ఆ సత్యాన్ని గురించిన భావన మాత్రమేనా ? ప్రతి బింబమేనా ? ఈ బుద్ధియొక్క సర్వేశ్వరత - నిజంగా - నిజంగా - పౌండ్రకవాసుదేవస్థితియేనా ?!

తన అన్వేషణలూ, తన ఆవేదనలూ, తన ఆలోచనలూ, తాను సాధించినదంతా - ప్రకృతి స్థితికి అత్యంతావశ్యకమూ, మూల స్తంభమూ కాదా ?!

...ఇంతకు మునుపెన్నడూ ఊహించనిదీ, తన ఊహకు అందీ అందకుండా వున్నదీ అయిన యీ క్రొత్త సత్యాన్ని చూడ ప్రయత్నిస్తున్నాడు శివరావు.

అతని మనస్సు మూగపోయింది. ఈ పరిణామాన్ని భరించ లేకుండా వున్నది——

అనంతమూ, కాలాతీతమూ, జన్మాంతరమూ, అయిన దుఃఖం అతన్ని ముంచెత్తింది.

జీవితానికి అర్థం - వుంది - లేదు - వుందీ, లేదు !

బుద్ధి వికాసానికి ప్రయోజనం - వుంది - లేదు - వుందీ,లేదు!

మనిషే - దేవుడు - కాదు - అవునూ, కాదు !

అయ్యో, ఏమిటీ భ్రమ ? ఎక్కడిదీ భ్రమయైన సత్యం ?

— — — — —

శివరావు యిహ భరించలేకపోయాడు.

అన్నివైపులనుంచీ చీకటి తెరలు, తెరలుగా మూసుకుంటూ వచ్చేస్తున్నది...

అతని లోకం చిన్నదై ——

మరింత చిన్నదై ——

మాయమై పోతున్నది !

అజ్ఞాతమూ, అజ్ఞేయమూ అయిన సత్యం అందీ అందకుండా ఎదురుగా పరచుకొని వున్నది...

దాన్ని అందుకుంటే!... అందుకోగల్గితే... అందుకొని తీరాలి !

శక్తినంతా సమీకరించుకొని కళ్లు తెరచి ఆశగా, అతృతతో ఆబగా చూశాడు.

అదిగో...అదిగో... అదే, అదే !

నవ్వుతున్నది ! నాట్యం చేస్తున్నది !

అది... అది... తనెరిగిందే !

అది .... అది .... ఎలక్ట్రో మాగ్నటిక్ ఎనర్జీ యొక్క సంపూర్ణ స్పెక్ట్రమ్ !

అదే మహత్తర సత్య స్వరూపం ....

-అంతటిలో అతనికీ, దానికీ సంబంధం తప్పిపోయింది. కళ్లు మూతలు పడిపోయాయి ....

* * *

గుట్టమీద వున్న మనిషి ఎప్పట్నుండో శివరావు చేస్తున్న వింతచేష్టల్ని గమనిస్తున్నాడు. ఆలోచనలో పడ్డట్టు, చేతిలో ఏమోవున్నట్టు, ఏదో పని చేస్తున్నట్టు శివరావు చేస్తున్న చేష్టల్ని చోద్యంగా చూస్తున్నాడు.

శివరావు పడిపోవటం చూసి గుట్టదిగి, దగ్గరకు వెళ్లి చూచాడు. అప్పటికే శివరావు శ్వాస నిలిచిపోయింది.

సరిగ్గా అప్పుడే అక్కడికి వచ్చింది రెడ్డెమ్మ. ఈ అనూహ్య సంఘటనకు చలించిపోయింది. కళ్లు నీటితో నిండిపోయాయి.

ఆమె మనో నేత్రం ముందు అనేక దృశ్యాలు.

"నాలో ప్రేమ ఉదయిస్తున్నది. గనుక యిదే మన ఆఖరు జన్మ...' అంటూ నవ్వుతున్న శివరావు.... 'అనంత కాలాల్లోనూ నువ్వు నాతోనే వుంటున్నావా?' అపనమ్మకంతో అడుగుతున్న శివరావు... ఎంతో దగ్గరగా వచ్చిపోయిన శివరావు... అతని కోరిక ఒకే ఒక్క కోరిక - మానవుడు కోరిన అనుభూతుల్ని శాశ్వతం చేసుకోగలగాలని -తద్వారా పరిపూర్ణత, సర్వేశ్వరత సాధించాలని!...

రెడ్డెమ్మ కళ్లు తుడుచుకున్నది.

రెడ్డెమ్మగుండులోని కోవెలలోకి వెళ్లిపోయింది.

(అయిపోయింది)



# ఊష్మోష్ణం - గ్రీష్మం

## శ్రీ సోమసుందర్

ఎండకు
ఎండలు నిట్టూరుస్తున్నాయి
ఎండెల మైదానాల్లో
గనిగలాడే పచ్చిక
ఇలా అలా వలస పోయిందెక్కడికో!
నా ఊరి శివార్లలో బందబయలు నడుమ
బంగరు పతకంలా తళతళలాడే తటాకం
కల కరచింది నిరాశగా; నాలుక వెళ్ళబెట్టింది
స్త్రాణగా ఒగురుస్తోంది
గులుగా చూస్తోంది
నేటి గుండెల్లోంచి పచ్చికలలా వెలువడిన
కే ఒక్క కలువకు చీమలు పట్టాయి—
పిక తీర్చుకుంటున్నాయి;
గావు కొట్టిన కలువ చొంగలు కారుస్తోంది
దేం నిన్నటివరకూ అల్లిబిల్లిగా ఒత్తుగా
లుముకుపోయిన పొదరిల్లు - ఇప్పుడేమో
డదెబ్బతిన్న కోడిపిల్లలా విలవిలలాడుతోంది
డుపులో దాగున్న దొంగల్ని పట్టియిస్తోంది.
తూర్పుగా తిరిగి నడువగా నడువగా
ప్రడమికి చివరి ఎల్లగా ఎదురయ్యే సముద్రం
క్కటే గుక్కెడునీళ్ళనందించడానికి
ద్ధంగా ఉంది; లోభి పీనుగ సంపదలం
క్కర తీర్చని వ్యర్థతీర్థమది!
ంగలార్చి లాభమేముంది
దలక చేసేదేముంది
కింకేం దిక్కు మిగిలింది?
చేతులెత్తి దండంపెట్టుకో
ఉటుపోయినా తప్పించుకోలేనిదొక్కటే
ఈ దేశాకాశంలో నిరంతరం సూర్యోద్రేకం!
ఈ దేశ ప్రజల నితాంత దరిద్రంలా
నరక సముద్రం!
కౌగిలింతల్లో కర్కశ ఖడ్గాలు గ్రుచ్చినట్లు
వసంతం వచ్చినట్లేవచ్చి
గ్రీష్మాన్ని అందించి వెళ్ళింది!
కానీ రాత్రులైనా ప్రశాంతంగా
కన్నులు మూదామంటే గాలివెళ్ళి
కొండశిఖరాలెక్కి కూర్చుంటుంది!
కుక్కల్నిమాత్రం విచ్చలవిడిగా ఒదులుతుంది
ఊరంతా తోచక తిరిగి తిరిగి
ఎవరూ నిద్రపోకుండా అదేపనిగా ఆర్భాటిస్తాయి.
శాపలా కాస్తున్నట్లు నటిస్తాయి!
తమలోతామే కలహించి కలహించి
సంగ్రామ సింహాలై ఉరుకుతుంటాయి....
దరిద్రానికి సైదోడు ద్వేషం....
లేపత్నికి సపత్నిరోగం....
సీ ప్రేళ్ళు ఇక్కడే దట్టంగా
మట్టిపెళ్ళల్ని కరచి పట్టుకున్నాయి
లో లోతులకు అల్లుకున్నాయి
ఎక్కడికని పోగలవీ నిశిరాత్రి?
ఎక్కడని వెదుతావు చల్లగాలి?
రాత్రో పగలో
తేడాతెలియని గుడ్డి ఉక్కకి
కూజా అంతా కడుపులో
దాచేసుకుందామన్నంత ఆబ!
ఇంకనీకేం మిగిలిందక్కడ?
వెళ్ళబెట్టడానికి ఎర్రని నాలుకతప్ప?
నిద్రగాని నిద్రలో కలవరించీ ఏలాభం?
నిన్నటివరకూ నీటిమబ్బుల్ని తరుముకుంటూ
తెల్లనికొంగలు ఆకాశమంతా తిరిగేవే-
ఎటుపోయింది నీదంభం?
వానకారు సంరంభం?
అరెరే, వైరినే స్తం?
ఏమిచ్చిందిరా నీకీ నిరంకుశోష్మం?
నిలువెల్లా కాల్చిపారేసే మహాఘోర గ్రీష్మం?
జ్యేష్ఠాదేవి నగ్ననాట్యంలా
ఎంతనిప్పచ్చరంగా ఉందినేల ?
మృషానయనోల్లాస పురాకాలనేమి-
పెంజీకటుల వేడినిట్టూర్పుతో
ఎంత వికారంగా
తలవిరబోసుకుంది జ్యేష్ఠం?

చల్లా రాధాకృష్ణ శర్మ



# కోపాన్ని జయించిన సౌశీల్యం

[ కవిచక్రవర్తి బిరుదాంకితుడైన కంబమహాకవి తన తమిళ రామాయణంలో తారను పరమ పవిత్రంగా అభివర్ణించాడు. వాలి మరణానంతరం ఆమె విరక్త మనస్కగా ఉండిపోయినట్లు ఆయన పేర్కొన్నాడు. ఆమె సౌశీల్యం ఆవేశపరుడైన లక్ష్మణుణ్ణి శాంతచిత్తుణ్ణి చేయగలిగింది. కంబకవి పేర్కొన్న యీ కథాంశం ఈ కథకు ఆధారం. ]

వానలు వెనకపట్టాయి. ఆకాశం నిర్మలంగా ఉంది. చెట్టు చేమలు పచ్చపచ్చగా ఉన్నాయి. అక్కడక్కడ వాననీరు గుంటల్లో నిలిచివుంది.

ఒక చెట్టుమీద రెండుకోతులు కిచకిచ లాడుతున్నాయి; పోట్లాడుకుంటున్నాయి కాబోలు. ఆ చెట్టుకింద ఒక ముసలికోతికి పడుచుకోతి పేలు చూస్తోంది. ఎటు చూసినా కోతులే - చిన్నవీ పెద్దవీ పడుచువీ ముసలివీ. అది ఋశ్యమూకపర్వతం

ఒక బండమీద రెండు కోతులు. ప్రేయసీ ప్రియులు! సంతోషంలో మైమరచి వున్నాయి.

దానికి దగ్గర్లో ఉన్న పర్ణశాల ఆవరణలో ఒక తిన్నెమీద కూర్చుని రాముడు ఆకాశంవైపూ, పచ్చని చెట్టుచేమల వైపు మార్చి మార్చి చూస్తున్నాడు. కోతుల కిచకిచలూ, పక్షుల కలాకలారావం ఆ పరిసరాలకి సందడి కలిగిస్తున్నాయి. దూరాన మదగజ ఘీంకారాలు వినవస్తున్నాయి.

ఉన్నట్టుండి రాముడు 'లక్ష్మణా !' అన్నాడు సంతోషంకొద్దీ.

బదులు వినిపించలేదు.

'తమ్ముడూ, తమ్ముడూ...'

బదులు రాలేదు.

నామతి మరుపు బంగారంగాను ! కందమూలాల కోసం అడివి వెళ్ళాడు... వెళ్ళి చాలా సేపయింది... మరీ లోపలికి వెళ్ళాడేమో పాపం, లక్ష్మణుడు నాకోసం ఎంతకష్టపడుతున్నాడు... పగలంతా సేవల్లోనూ కందమూలాల సేకరణలోనూ గడుపుతాడు...రాత్రిళ్ళు ్నమూయడు... కంటికి రెప్పలా నన్ను కాపాడుతున్నాడు .... ్మణుడి ఋణం నేనెన్ని జన్మలెత్తినా తీర్చుకోలేను...అనుకున్నాడు ముడు.

ఇంతలో బండమీది కోతులు కిచకిచలు మరీ ఎక్కువ కావడంతో టా అని రాముడు ఆవైపు చూశాడు. అవి భయంతో వణికి తున్నాయి.

ఆ బండ వైపుగా మదగజం ఒకటి పరుగెత్తుకుంటూ వస్తోంది. రిలో అడ్డం వచ్చిన చెట్టు, చేమల్ని తొండంతో నేలమట్టం చేస్తోంది. లా నేలకూలిన చెట్లమీది పులుగులూ పిట్టలూ కోతులూ ప్రాణాలు ప్పెట్లో పెట్టుకుని పరుగులు తీస్తున్నాయి. పరుగెత్తలేని ముసలి తులు కొన్ని ఏనుగు కాళ్ళకిందపడి నలిగిపోతున్నాయి. ఆ దృశ్యం సే బండమీద కోతులు గజగజ వణికిపోతున్నాయి.

అంత వరకూ సంతోషంగా ఉన్న కోతులు అలా వణికిపోవడం సి రాముడు వాటి మీద జాలిగొన్నాడు. వెంటనే బాణం సంధించి ల్లు ఎక్కుపెట్టాడు. అంతే; మదగజం వెనక్కి తిరిగిపోయింది, మెల్లమెల్లగా.

బండమీది కోతులు రాముడి వంక కృతజ్ఞతాపూర్వకంగా చూశాయి ఆ చూపు...రావణుడి కబంధహస్తాలకు చిక్కుకుని భయవిహ్వల అయిన సీత జటాయువుని చూసిన చూపుగా కనిపించింది....కింద తిరుగుతున్న కోతుల్ని చూసి నగలమూటను కిందికి విసిరివేసిన సీత చూపుగా కనిపించింది....

సీతా...ఆరోజు నువ్వెంత బాధ పడ్డావో యేమిటో! అది తలచుకుంటేనే మనస్సు వికలమై పోతోంది. ఆ రాక్షసుడి బారినుంచి నిన్ను కాపాడాలని జటాయువు తన శక్తినంతా వినియోగించాడు... చివరికి తన అసువులనే కోల్పోయాడు పాపం...రాక్షసశక్తే జయిం చింది. రాక్షసశక్తిని సర్వనాశనంచేస్తాను. అది నశిస్తేనే నా మనస్సుకి తృప్తి, లోకానికి శాంతి...సీతా, నీ మీద ఒట్టు సీతా...సీతా... అనుకుంటూ రాముడు మనస్సునంతా సీత మీద లగ్నం చేశాడు. విశ్వామిత్రుడు, జనకుడు...గుర్తుకి వచ్చారు. పాణిగ్రహణమహోత్సవానికి ముందు తాను సీతను చూసిన ఆ చూపు, ఆ తర్వాత ఆమె తనను చూసిన ఆ చూపు, ఆ చూపుల్లోని అమృతాన్ని మించిన తీపి, ప్రేమను మించిన తీపి, తీపిని మించిన తీపి...

కందమూలాలు తీసుకువస్తున్న లక్ష్మణుడు దూరంనుంచి చూశాడు తనను పర్ణశాలను. తలుపు తెరచివుంది. రెండు కోతులు గుమ్మం దగ్గిర కూర్చుని ఉన్నాయి. పక్కనేవున్న ఒక చిన్నగుట్ట ఎక్కి లక్ష్మణుడు నిశితంగా చూశాడు. రోజూ కూర్చునే అరుగుమీద రాముడు కనిపించలేదు. లక్ష్మణుడి గుండెలు వేగంగా కొట్టుకున్నాయి. నేను వచ్చేంతవరకూ అన్నయ్య ఎక్కడికీ వెళ్లడే! తలుపేమో తెరచి వుంది. గుమ్మందగ్గిరేమో కోతులు...అనుకున్నాడు. మళ్లీ ఏ రాక్షసుడు రాలేదుగదా!

లక్ష్మణుడు బాణంలా దూసుకువచ్చాడు సరాసరి పర్ణశాల లోపలికి వెళ్లబోతుంటే కోతులు కిచకిచ మంటూ తిన్నె వద్దకు వెళ్లాయి.

రాముడు అరుగుకి దగ్గరగా నేలమీద పడిఉన్నాడు. కట్టుకున్న వస్త్రానికి మట్టి బాగా అంటుకుని ఉంది. బుగ్గలు చారికలు కట్టి ఉన్నాయి కళ్లు ఎర్రగా ఉన్నాయి. కొంచెం వాచాయి కూడా!

అరుగు మీదనుంచి రాముడు కింద పడ్డాడా ? అవునన్నట్టుగా కోతులు కిచకిచ మన్నాయి.

'అన్నయ్యా! అన్నయ్యా!' ఆదుర్దాగా పిలిచాడు లక్ష్మణుడు.

రాముడు మెల్లగా కళ్లువిప్పాడు. తమ్ముణ్ణి ఆదరంగా చూశాడు.

'ఏమిటన్నయ్యా యిదంతా? అరుగు మీదనుండి కిందపడ్డావా? చూడు, కళ్లు ఎలా ఎర్రగా వాచిఉన్నాయో! ఎందుకన్నయ్యా, కంట తడి పెట్టావు? నేనుండగా నీ కేమీ భయం లేదు. వదిన తప్పకుండా కనిపిస్తుంది...?

రాముడు తల పైకెత్తి లక్ష్మణుడి కళ్లలోకి తొంగి చూశాడు.

'తప్పకుండా వదిన కనిపిస్తుందన్నయ్యా...నువ్వేమీ అధైర్య పడకు అని తమ్ముడు ధైర్యం చెబుతూ వుండగానే, రాముడి కళ్లలో నీళ్లు తిరిగాయి.

'అన్నయ్యా నా మీద ఒట్టు. నువ్వు కంటతడి పెట్టకూడదు...' రాముడి కళ్లు తుడిచాడు.

అన్నయ్యను అరుగుమీద కూర్చుండజేశాడు. తాను తెచ్చిన కందమూలాలను ముందుంచాడు. లోపలికి వెళ్లాడు.

ఎన్ని జన్మలెత్తినా యిలాంటి తమ్ముణ్ణి పొందలేను...అని లక్ష్మణుడి భ్రాతృప్రేమను తలచుకుని రాముడు మురిసి పోతుంటే అమ్ములపొదితో లక్ష్మణుడు వెలుపలికి వచ్చాడు పర్ణశాలలోంచి. ముఖంలో కోపం కనకనలాడుతోంది.

శీఘ్రకోపి...అనుకున్నాడు రాముడు. అయినా లక్ష్మణుడి కోపానికి కారణమేమిటో ! అని ఆలోచిస్తూ తమ్ముడివంక చూశాడు, నవ్వు మొగంతో.

అది గ్రహించకపోలేదు రామానుజుడు. అంతకోపమూ అంత లోనే మాయమైపోయింది. పరమశాంతుడై యిలా అన్నాడు.

'చూడన్నయ్యా! సుగ్రీవుడు ఎంత కృతఘ్నుడో...అతడి పబ్బంగడిచిపోయింది. నిమ్మకి నీరెత్తినట్టుగా కూర్చున్నాడు. ఇచ్చిన బాసకూడా మరచిపోయాడు...వానాకాలం కాగానే కొండంత సహాయం చేస్తానన్నాడు....మళ్ళీ యిటువైపు తొంగిచూడలేదు. కడుపునిండా తాగి కమ్మగా నిద్రపోతున్నాడేమో. వెళ్ళి నిద్రమత్తు కాస్తా వదిలించి వస్తాను...రామబాణ మహిమని గుర్తుచేస్తాను...' ఉన్నట్టుండి ఆగి పోయాడు, మధ్యలో ఆవేశం తెచ్చుకుని చెప్పుకుపోతున్న లక్ష్మణుడు.

రాముడు గుడ్డిచాటు చేసుకుని విలపిస్తున్నాడు. 'తమ్ముడూ, సీత కనిపిస్తుందన్న ఆశ నాలో రోజు రోజుకీ ఎందుకో తగ్గి పోతోంది....' అన్నాడు కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ.

లక్ష్మణుడు ఏమీ మాట్లాడలేదు. కోపావేశంతో ముందుకి చరచర నడిచాడు. అరుగుమీదనుంచి లేచి తమ్ముడు నడిచివెడుతున్న వైపే చూడసాగాడు రాముడు.

పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ లక్ష్మణుడు కిష్కింధ వైపు వెడుతున్నాడు. దారిలోని రాళ్ళూరప్పలూ కాళ్ళకింద నుగ్గునుగ్గు అవుతున్నాయి. నడుస్తున్న వేగానికి అమ్ములపొది అటూయిటూ ఊగి పోతున్నది. సుగ్రీవుణ్ణి ఏం చేస్తాడో యేమిటో అనుకున్నాడు, తమ్ముడి వాలకంచూసి.

లక్ష్మణుడు అగ్నిపర్వతంలా వస్తున్నాడన్న వార్త అప్పుడే అంచెలుఅంచెలుగా కిష్కింధకు వ్యాపించింది. భయగంపితులైన వానర వీరులు వెంటనే యువరాజు అంగదుణ్ణి సమీపించారు. అతనూ లక్ష్మణుడి రాకను గమనించాడు. ఆలస్యం చెయ్యకుండా సుగ్రీవుడి వద్దకు బయలుదేరాడు; ఆపద రానున్నట్టు గ్రహించాడు.

మద్యపాన నిరతుడైన సుగ్రీవుడు శయ్యాగృహంలో ఉన్నాడు, అంగదుడు సరాసరి అక్కడికే వెళ్ళాడు, ద్వారపాలకులు వారించినా లక్ష్మణుడి రాకను తెలియజేశాడు. అంతమద్యపానలోలుడూ లక్ష్మణుడి పేరు వినగానే హడిలిపోయి 'ఆఁ, ఆఁ' అన్నాడే కాని మరేమీ మాట్లాడలేకపోయాడు. ఇక లాభం లేదనుకొని అంగదుడు తనతల్లి తార వద్దకు బయలుదేరాడు. దారిలో హనుమంతుడు కలిశాడు. ఇద్దరూ తారను సమీపించారు.

వానర వీరుల ప్రవర్తన ఆమెకు నచ్చలేదు. మీరు కృతఘ్నులు రాములవారిని మరిచిపోయారు. వానలు వెనక పట్టిన తర్వాత ఆయనకి సహాయం చేస్తామన్నారు. మీరు మీమాట నిలుపుకోలేదు. అందుకే లక్ష్మణుడు యిక్కడికి వస్తున్నాడు రాముడలా భార్యను కో బాధ పడుతుంటే, మీరేమో మీ విలాసాలలో మునిగి తేలుత ఇది మీకు ధర్మమేనా? రాముడి కోపానికి గురికావడం మ క్షేమం కాదు! అంది తార.

ఇంతలో అగ్ని పర్వతంలా ప్రతిభాసించే లక్ష్మణుడు అంత ద్వారం సమీపించాడు. అది తెలుసుకున్న అంగదుడికి ఏంచేయ తోచలేదు. తల్లిని చూచాడు.

అప్పటికప్పుడే కొందరు స్త్రీలను వెంటబెట్టుకుని తార బ దేరింది. లక్ష్మణున్ని సమీపించింది.

తన ముందు నుంచున్న స్త్రీ సమూహాన్ని చూసి అవనతవ దయ్యాడు లక్ష్మణుడు, లజ్జతో. మౌనం వహించాడు.

"రాములవారిని ఒంటరిగా విడిచిపెట్టి రామానుజుల యిక్కడికి రావడంలోని ఆంతర్యమేమిటో... ఏమైనా మాకిది దినం. తమరాకతో మా రాజ్యం పరమపావన మయింది..."

ఎవరిదీ మధురకంఠం! వానరాంగనలకు కూడా ఇ కంఠమాధుర్యం వుంటుందా! ఆ మాటల్లో ఎంత ఆప్యాయత ఎంత అభిమానం! ఆశ్చర్యంలో మునిగిపోయాడు లక్ష్మణుడు. ఆ శ్రావ్యమైన కంఠస్వరంగల వానర స్త్రీని, రాముడిపట్ల గౌరవభా ప్రదర్శించిన ఆ సుమతిని చూడాలనే తహతహ కలిగింది. అతడు మెల్ల తల పైకెత్తాడు. బిడియపడుతూ ఆమెను చూశాడు.

ఆమె తెల్లని చీర కట్టుకుంది. ముఖంలో సహజమైన లక్ష నుదుట కుంకుమబొట్టు లేదు. మెడలో ఆభరణాలు ఏవీ లేవు. మాంగల చిహ్నాలు కనిపించలేదు.

అయోధ్యలో నా తల్లులు తారలా యిలాగే వున్నారు కాబోలు అనుకున్నాడు లక్ష్మణుడు. విచార వదనుడయ్యాడు. మనస్సు మనస్సులో లేదు.

'మా మరిదిగారు మిమ్మల్ని త్వరలోనే కలుస్తారు. మీకు తప్పకుండా సహాయం చేస్తారు.'

ఆ తర్వాత తార అక్కడినుంచి నిష్క్రమించింది.

తార పాతివ్రత్యం ఆమె కంఠమాధుర్యం, ఆమె మాటలతీరు... లక్ష్మణుడికి ఆమెపట్ల ఎనలేని ఆదరభావం కలిగించాయి.

అగ్నిపర్వతంలాంటి లక్ష్మణుడు మంచుకొండ అయ్యాడు.

# అరుణ కిరణం గుండెలో ప్రజాస్వామ్య పతాకతో

## శ్రీ మాదిరాజు రంగారావు

ణ కిరణం గుండెలో
ు మనిషి కదలిరా.
య చరణం బ్రతుకులో
మనిషి సాగిపో.

 యుగాల శిథిలాలను
పదాన కదలిస్తూ
తరాల జ్ఞాపకాలు
ంచే సరస్సు[1] తో

క్రమైన కరాలతో
్య వలయం తరుగణం
ములుగా నదీతలం
ెలుగా తరళ జలం[2]

ాసార్తయైన అవని
కణం దాహభరం
యాణార్తుడైన మనిషి
 పదం ఆటంకం.

ెలంతా మండే క్షణాలు
ాడిదలో దాగెను రాత్రి
ుడెల్లో ఆరని ఆశలు
రుల్లో ఒదిగేను పగలు

ళ్ళు తెరిస్తే ఉండే జీవితం
ప్ప వాలితే వేరే సమస్తం
రిత్రనూ సంస్కారాన్ని
నం చేసుకొని తనలో

కణ కణలాడే చరిత్రలో
ఆరాటం, ఆవేశం హింస!
గుబ గుబలాడే సంస్కృతిలో
ఆనందం అనుభవం శాంతి!

జలధియై కదిలేను ఊహ
జలదమై కురిసేను ఆశ.
సస్యమై వెలిగేను బ్రతుకు
మానవుని గతికాదర్శమై.

ప్రజాస్వామ్య పతాకతో
మానవీయ సూర్యునిలో
హృదయ నభంపై వెలిగే
ఆర్ద్రరాగ ఉదయంతో

పదం పదం 'గళం గళం
ఒకటిగా-
కదలుతూన్న ప్రజాగణం
అంతటా-

పగటి వెలుగులు కళ్ళలో
రాత్రి చుక్కలు నిద్రలో
సుప్తబీజ ముఖాలలో
చేతనా ప్రభవాంకురం.

అరుణ కిరణం గుండెలో
వెలుగు మనిషి కదలిరా
విజయ చరణం బ్రతుకులో
నిలిపి మనిషి సాగిపో.

---

[1] అవ్యక్త చైతన్యం    [2] వ్యక్త చైతన్యం



శ్రీ సూర్యదేవర రవికుమార్

# మహాభారత కథాకాల విశేషములు

**1967** సెప్టెంబరులో అప్పటి ఖాండ్వా ప్రభుత్వ కళాశాల ప్రిన్సిపాల్ ప్రొఫెసర్ జి. డబ్లియు. కవీశ్వర్ గారు మహాభారతముపై ఢిల్లీలో చేసిన ప్రసంగంలోని విశేషాలను 'భవన్స్ జర్నల్' పత్రిక ప్రత్యేక విలేఖరి 17-12-1967 నాటి 'భవన్స్‌జర్నల్' లో పొందు పరిచారు. అందులో ప్రొఫెసర్ కవీశ్వర్ గారు మహాభారత కథాకాల విశేషాలను ఎన్నిటినో వివరించినట్లు తెలిపారు. ఆయా విశేషములను కవిత్రయ మహాభారతములో ముఖ్యముగా తిక్కన మహాభారతముతో పోల్చిచూచుట ఈ వ్యాసోద్దేశము.

ముందుగా ప్రొఫెసర్ కవీశ్వర్ గారు సూచించిన విశేషములను తెలుసుకొందాం.

పాండవులు శకునితో జూదమాడి ఓడిపోయి వనవాసమునకు వెళ్ళినరోజు జ్యేష్ఠశుద్ధ ఏకాదశి. పాండవుల అజ్ఞాతవాసము ముగిసినది నిజవైశాఖ బహుళాష్టమి. ఈ రెండు తిథుల నడిమికాలం 18 రోజులు కనుక వ్యాసుడు మహాభారతయుద్ధము 18 రోజులే జరిగినట్లు వర్ణించాడు.

మహాభారతయుద్ధము ఏడు రోజులకు రానున్న అమావాస్యనాడు జరుగునని శ్రీకృష్ణుడు తెలిపాడు. యుద్ధంలో 14వ రోజు రాత్రి చంద్రోదయము తెల్లవారుఝామున జరిగినట్లు మహాభారతములో చెప్ప బడినది. దీని ప్రకారం యుద్ధము అమావాస్యనాడు ప్రారంభమైనట్లు కనబడదు. కాని యుద్ధములో 10వ దినమున భీష్ముడు పడిన దగ్గర నుంచి అతని మరణమువరకు 58 రాత్రులు గడచినవనీ, బలరాముని తీర్థయాత్ర 42 రోజులు సాగినదనీ మహాభారతములో చెప్పబడినది. వీటినన్నిటిని సమన్వయించి ప్రొ. కవీశ్వర్ గారు మహాభారతయుద్ధము అమావాస్యనాడే ప్రారంభమై రోజుమార్చి రోజు జరిగినది. భీమ దుర్యోధనుల గదాయుద్ధము శల్యుని మరణదినమున కాక ఆ మరునాడు జరిగినదని నిర్ణయించారు.

కవిత్రయ మహాభారతమున పై సంఘటన లేవిధముగా చెప్ప బడినవో గమనింతము :

పాండవులు వనవాసమునకు బయలుదేరినరోజు ఏదో నన్నయ గారు తెల్పలేదు. అజ్ఞాతవాసము బహుళాష్టమితో ముగిసినదని, బహుళ నవమినాటి ఉత్తర గోగ్రహణ కాలమున భీష్ముడు "రెండవయేఁట నొక్కండధిమాస మిట్లెక్కిన యన్నెల లెల్లఁ గూర్చికొనఁ బదుమూఁడ హాయనములు దప్పక నిన్నటితోడన నిండె" (విరా. 4-232) నని చెప్పినదానిని బట్టి తెలియుచున్నది. అధికమాసములతో గలిపి 13 సంవత్సరములు పూర్తయినవని తిక్కన పైన తెల్పియున్నాడు. కనుక వనవాస ప్రారంభానికి అజ్ఞాతవాస సమాప్తికి నడుమగల కాలము తిథుల ననుసరించి 13 × 12=156 మాసములు. ఇందుకొన్ని అధిక మాసములున్నవి కనుక పాండవుల వనవాస అజ్ఞాతవాసములు 156 మాసములతో పూర్తయినవని, వనవాసము బహుళ నవమినాడు ప్రారంభమైనదని ఆంధ్రమహాభారతాభిప్రాయము.

అజ్ఞాతవాసము పూర్తయిన బహుళాష్టమి ఏ నెలకు చెందినదో తిక్కన తెలియజేయలేదు. కాని ఉత్తరదేశమందలి మూలభారత ప్రతులలో నిది 'ఘర్మపక్ష' మని సూచించ బడినదని, "ఘర్మపక్ష మనగా నిదాఘము. ఆషాఢమని అర్జున మిశ్రుని వ్యాఖ్యానమువలనఁ దెలియుచున్నది" అని కీ. శే. కోరాడ రామకృష్ణయ్యగారు వ్రాశారు. (చూ. ఆంధ్రభారత కవితా విమర్శనము, పు. 180) దీనినిబట్టి అజ్ఞాతవాసము ఆషాఢ బహుళాష్టమితో పూర్తయినదని తెలుస్తున్నది. ప్రొ. కవీశ్వర్‌గారి అభిప్రాయము ననుసరించి అది నిజవైశాఖ బహుళాష్టమి. ఈ రెంటికి రెండునెలల అంతరము కలదు.

అజ్ఞాతవాసము ముగిసిన పిదప ఉత్తరాభిమన్యుల వివాహ మైనది. ఆ వివాహమైన నాల్గవనాడు (ఉద్యో. 1-3) దుర్యోధనుని కడకు బ్రాహ్మణుని దూతగా పంపుటకు నిర్ణయించబడినది. అనంతరము బలసమీకరణ జరిగింది. బ్రాహ్మణ, సంజయ, శ్రీకృష్ణరాయబారములు విఫలము కావటముతో యుద్ధము నిశ్చయమైనది.

కృష్ణరాయబారము జరిగిన నెలలోనే యుద్ధము ప్రారంభమని "ఇమ్మాసంబు సౌమ్యంబై శీతోష్ణంబులు లేక పుష్పఫలో పేతంబును సమగ్రధాన్యంబును సులభయవ సైంధవంబును నగుచు నొప్పి యున్నయది. యేడెనిమిది దివసంబులకు నమావాస్య వచ్చు నది పుణ్యదినంబు నాఁడు ఖండనంబు గావలయు..." (ఉద్యో. 4-49) నని శ్రీకృష్ణుడు తెల్పిన మాటలనుబట్టి తెలియుచున్నది. తిక్కన "ఇమ్మాసంబు" అన్నాడు కాని అది ఏదయినది చెప్పలేదు. యుద్ధము దక్షిణాయణములో జరిగినది కనుక దక్షిణాయణమున "శీతోష్ణంబులు

ికి పుష్పఫలోపేతంబును సమగ్రధాన్యంబును" అయిన మాసము శ్వయుజ కార్తీకములలో నొకటి కావచ్చును.

శ్రీకృష్ణుడు బహుళ బహుళాష్టమినాడే కర్ణునితో యుద్ధదిన నిశ్చయము తెల్పి దశమినాటికి ఉపప్లావ్యమున గల పాండవుల వద్దకు తిరిగివచ్చినట్లు కనబడుచున్నది.

శ్రీకృష్ణుడు తిరిగివచ్చిన మరునాడు (ఉద్యో. 4-113)-అనగా ఏకాదశినాడు - ధర్మరాజు సేనానాయకుల నభిషేకించినాడు. ఆ మరునాడు (ఉద్యో. 4-117) - ద్వాదశినాడు - దండు బయలుదేరి హిరణ్వతి నదిచెంత విడిసినాడు (ఉద్యో. 4-130). ఇది దుర్యోధనుడు వారులవలన తెలుసుకొనినాడు. ఆ మరునాడు (ఉద్యో. 4-136) - త్రయోదశినాడు - దుర్యోధనుడు సేనానాయకుల నభిషేకించి దండు వెడలి కురుక్షేత్ర సమీపమున విడిసినాడు (ఉద్యో. 4-164). తరువాత ఉలూకుని రాయబారము. శ్రీకృష్ణుడు ఉలూకునితో రేపే యుద్ధమని చెప్పి పంపును. (ఉద్యో. 4-210) అనగా ఆ రోజు చతుర్దశి యన్నమాట.

అమావాస్యనాడు యుద్ధము ప్రారంభమైనది. యుద్ధప్రారంభము అమావాస్యనాడు అయినట్లుకాని, కానట్లుకాని మహాభారతమున చెప్పబడలేదు. శ్రీకృష్ణుడు 'అమావాస్యనాడు భండనంబు కావలయు' నని చెప్పినదానిని బట్టి అది అమావాస్యనాడే ప్రారంభమైనదని ఊహ.

ఈ యుద్ధదినములలో తిక్కన చేసిన సాయంరాత్రుల వర్ణనను గమనించవలసి యున్నది.

మొదటిరోజు : పాండవసైనికుల 'మనముల భీత్యంధకార మడరు కరణి, జీకటి యెడనెడఁగవియు దెంచె' (భీష్మ. - 1-300)

రెండవరోజు : వర్ణనలేదు.

మూడవరోజు : "అరుణ గభస్తి యస్తగిరి మస్తకాంత రితుండయ్యెనా సంధ్యా సమయంబున .... భీష్మ ద్రోణ బాహ్లిక దుర్యోధనులు బలంబులఁ దివియంబంచి మరలి కర దీపికలు వెలుంగ విడిదలకు వచ్చిరి" (భీష్మ. 2-166)

నాల్గవరోజు : వర్ణనలేదు.

ఐదవరోజు : "ఇపుడు సంధ్యాసమయం బింతట నేటికి నని సాలింతము .... అని తలంచి ... అరిగి రుభయ సైన్యజనంబులును దీవియలు వెలుఁగంగాన్" (భీష్మ. 2-342)

ఆరవరోజు }
ఏడవరోజు } : వర్ణనలేదు.

ఎనిమిదవరోజు : "తిమిరము గవిసినఁ బాండవ సమితియుఁ గౌరవులు రణము సాలించి నివాసములకుఁ దగఁజనిరయ్యష్టమయామిని ..." (భీష్మ. 3-164)

ఆ రాత్రి దుర్యోధనుండు "అలంకృతుండై తమ్ములుం దగువారలుం బరివేష్టింపఁ బరిమళ పరంపరా భాసిత నూతన తైలధారాభిషేక ప్రదీపితంబులగు కరదీపికా సహస్రంబులు వెలుంగ" "రథంబెక్కి ... మందాకినీ నందను మందిరంబు సేరంజని ..." (భీష్మ. 3-169)

తొమ్మిదవరోజు : 'నలినాప్తుండు గ్రుంకె' 'అట్టియెడ ధర్మతనయుండతి ఘోరంబగు సంధ్యాసమయంబున... విడిదలకుం గడు విన్ననయిపోయె' (భీష్మ. 3-271-73) ఆ రాత్రి పాండవులు రహస్యముగా భీష్ముని వద్దకు వెళ్ళినపుడు తిక్కన కరదీపికలను పేర్కొనలేదు.

పదవరోజు : వర్ణనలేదు.

పదకొండవరోజు : "గభస్తిమంతుండస్త శైలాంతరితుండైనఁ బార్థ బాణాంధకారంబునకుఁ దోడు సంధ్యా సమయంబు గవిసినం గురుసైనికులకుఁ దమవార లెదిరివారలని నిరూపింప నశక్యంబగుటయు ద్రోణ దుర్యోధనుల సమరంబు సాలించి." (ద్రో. 1. 213)

12వ రోజు : వర్ణనలేదు.

13వ రోజు : వర్ణనలేదు.

14వ రోజు : "సంజచీఁకటి చూపునకుఁ జొరవయొకున్నను సైనికని కర వివిధాభరణ మణికిరణ కలాపంబులుఁ జర్మవర్మాతపత్ర కేతుకీలిత రత్న రశ్మిజాలంబులు నాలోకనంబు నాపాదించె" (ద్రో. 5.86)

"అద్దెసనిద్దెస వీరులు వోరుచుండ నంధకారం బతి సాంద్రదంబై చిక్కవఱిచె" (ద్రోణ. 5-142)

"ధృతరాష్ట్రుండు సంజయునితో నిత్తెరంగునం బన్ని బహుళతిమిరంబున సమరంబెట్లు సేసిరని యడిగిన నతండతని కిట్లను నాసమయంబున నక్కురు భూపాలుండు దమ కాలుబలంబులనెల్ల నాయుధంబులు వెట్టి దివియలు పట్ట నియోగించిన..." (ద్రోణ.5-142)

తరువాత, సైనికులు నిద్రాపరవశులగుట గమనించి

"గాండీవి యిరువాగు నుద్దేశించి యెలుంగెత్తి
అడరెడు నిద్రాభరమునఁ
గడు డస్సితి రెల్లవారుఁ గలనను జాడ్యం
బెడలఁగ జొక్కుమడుపుఁడి
ప్పుడచంద్రుఁడు వొడుచువెండి పోరుట యొప్పున్"

అనెను. (ద్రోణ. 5-267-68)

అంత చంద్రోదయమైనది. ద్రోణుడు "పాంచాల బలంబుదిక్కు పేరుక్కున నడచెఁ గౌరవపతియును బాండవుల వలనికి నురవడించె నిట్లు వేకువజామున సంగ్రామంబు సెల్లఁ బదంపడి దూర్పు నెఱ్ఱనగుచు వచ్చె." (ద్రోణ. 5-278)

క్రమముగా సూర్యోదయమైనది. "అప్పుడు రెండు దెఱంగుల జనంబులుం గాలోచిత కృత్యంబులు సలిపి క్రమ్మఱఁ గయ్యంబు సేయం దొడంగిరి."

(ద్రోణ. 5-286)

15వ రోజు : వర్ణనలేదు.

16వరోజు : "అంశుమంతుండ పరగిరి యవలకుం జనుటయు ధరా ధూళికిఁ దోడు సంధ్యారాగ మిళితంబైన తిమిరంబు గవిసిన నెద్దియుం గానరామిం జిత్తంబులు గరంగ రాత్రి యుద్ధంబునకు నోహటించుటం జేసి మనదొరలఁ బాండవసైనికులు దజిమినందాల్మి వాటింపక తిరిగి పోయిరి." (కర్ణ. 1-209)

17వ రోజు : "అపర జలనిధిలోనికి నరిగెనినుడు" (కర్ణ. 3-369) "ధర్మనందనుండు పొలికలను సూచువేడుక దన కుంబుట్టిన ... కరదీపికా సహస్రంబులు వెలుంగ సమస్త బంధుమిత్ర సోదర పరివృతుండై యరిగి ... కర్ణుని శిరమును దత్తనయుల గాత్రములుఁ జూచె" (కర్ణ. 3.393-395)

18వ రోజు : 'మధ్యాహ్నంబున మద్రపతి...తెగియె.. కురువిభుండని పనిసాలించి ... యొక్క మడువుసొచ్చి దాఁగియుండె ... పాండవేయులు ... చుట్టుముట్టి పిలిచిన వెడలి వడముడి తోడి పెనంకువం బెద్దయుం బ్రొద్దుపెనంగి యా భూనాథుండును బ్రొద్దుసాల వాలినప్పుడు భీము గదా ఘాతంబునఁ దొడలు విరిగి పడియె నంత నిశా సమయంబున నశ్వత్థామ ... సమయించె మఱునాడు సంజయుండు కురుక్షేత్రంబు నందుండి పూర్వాహ్ణంబునఁ గరినగరంబున కరుగుదెంచి ... " (శల్యా. 1-5)

ఇది నాటి సంక్షేపకథ.

18వ యుద్ధదినమున శల్యుని మరణానంతరము దుర్యోధనుడు ఏకాకియై క్రోశమాత్రంబున నున్న ద్వైపాయన హ్రదమున దాగాడు కృపాచార్య, కృతవర్మ, అశ్వత్థామ సంజయులు దుర్యోధనునిత సంభాషించుటను బోయలు చూచి పాండవులకు తెల్పగా పాండవుఁ రాకను గమనించి అశ్వత్థామాదులను రాత్రికి రమ్మనిచెప్పి దుర్యోధనుడు మడుగు బ్రవేశించాడు. ఆ తరువాత మడుగు వెడలివచ్చి భీమునితో గదాయుద్ధముచేసి తొడలు విరిగిపడినపుడు "ప్రొద్దుసుంజాఱ్ఱెవాలె" (శల్య. 2-382) నని తిక్కన చెప్పియున్నాడు. అశ్వత్థామాదులు తొడలు విరిగిన దుర్యోధనుని చేరి తగిన మాటలాడగా రాజరాజు అశ్వత్థామ నభిషేకింపజేసిన పిదప వారు బయలుదేరి పాండవ శిబిర సమీపమునకు చేరునపుడు అక్కడి జయోత్సాహ ధ్వనిని విని, తిరిగి తూర్పున గల అడవికి వెళ్ళి అక్కడి మడుగులో నీళ్ళుత్రాగి పాండవశిబిరంలోని జయోత్సాహధ్వనిని నాలకించుచుండగా "పశ్చిమ ధరాగ్ర పశ్చిమంబునకుఁ బోయె మార్తాండ మండలంబు" "తిమిరపటలి ... పరగఁజొచ్చె ... చుక్కలు దోఁచె" నని (సౌప్తిక. 1-11-14) తిక్కన వర్ణించినాడు. పైసంఘటనలన్నీ 18వ యుద్ధదినముననే జరిగిన వని తిక్కన స్పష్టపరిచినాడు. దీనినిబట్టి శల్యుని మరణదినముననే భీమ దుర్యోధనుల గదాయుద్ధము జరిగినట్లు ఆంధ్రమహాభారతాభిప్రాయము.

పై యుద్ధదిన వర్ణనలలో ప్రధానమైనది పదునాల్గవరోజు రాత్రి వర్ణన. ఆ రాత్రి వేకువజామున చంద్రోదయమైనదని వర్ణించబడినది. అనగా ఆరోజు బహుళదశమి – త్రయోదశిల మధ్యదినములలో నొకటి కావలయును. అమావాస్యనాడు యుద్ధము ప్రారంభమై ప్రతినిత్యము జరిగిన, 14వ రోజు బహుళపక్షము కాజాలదు. కాని యుద్ధము అమావాస్యనాడు ప్రారంభమై రోజుమార్చి రోజు జరిగిన 14వ యుద్ధదినము బహుళ ఏకాదశి, ద్వాదశులలో నొకటియగుటకు, ఆ రాత్రి చంద్రోదయము వేకువజామున అగుటకు అవకాశమున్నది. కాని తిక్కన భారతయుద్ధము రోజు మార్చి రోజు జరిగెనని చెప్పలేదు సరిగదా అతని రచన యుద్ధము ప్రతినిత్యము జరిగినట్లే తెల్పుచున్నది. యుద్ధము ప్రతినిత్యము జరిగి 14వ యుద్ధదినము రాత్రి చంద్రోదయము వేకువజామున అయినప్పుడు యుద్ధము అమావాశ్యనాడుకాక శుక్లదశమి ఏకాదశులలో ప్రారంభమై యుండవలయును. ఇట్లనుకొనుటకు మహాభారతమున ఏ ఆధారము కన్పించదు.

ఇక ఇతర యుద్ధదినముల సాయంర్రాతుల వర్ణనలను పరిశీలింతము.

మొదటిరోజు ప్రొద్దుక్రుంకగనే "చీఁకటి యెడనెడఁ గవియు దెంచె" నని చెప్పబడినది. సూర్యాస్తమయానంతరము చీకటి బహుళ

క్షసూచకము గదా! ఇది యుద్ధము అమావాస్యనాడే ప్రారంభమైనదను
కొనుటకు ఒక సాధకము. మూడవనాటి యుద్ధానంతరము భీష్మాదులు
'కరదీపికలు వెలుంగ విడిదలకు వచ్చిరి'' అని చెప్పబడినది. ఇట్లే 5వ
దినము నాటి యుద్ధానంతర గమనము చెప్పబడినది. ఎనిమిదవనాటి
రాత్రి దుర్యోధనుడు నడిరేయిన 'కరదీపికాసహస్రంబులు వెలుంగ'
రథమెక్కి భీష్ముని చూడబోయెను. కర్ణవధానంతరము 17వ యుద్ధ
దినము నాటి రాత్రి ధర్మరాజు 'కరదీపికాసహస్రంబులు వెలుంగ'
యుద్ధభూమిని చూడబోయెను. ఇతర దినములలో తిక్కన ఈ కర
దీపికల ప్రసక్తిని తేలేదు. ఈ కరదీపికలు తత్కాల తిమిరధ్వంస
కములుగా కాక మహారాజ లాంఛనములుగా తిక్కన వర్ణించినట్లు
కనబడుచున్నది. చీకటిలో దారికొరకే కరదీపికలను సూచించినట్లయిన
మరికొన్ని దినములలో సైతము వీటిప్రసక్తి తేవలసియున్నది.

8వ యుద్ధదినాంతమున 'తిమిరము గలిసిన' దని చెప్పబడినది.
ఇది బహుళపక్ష సూచకము. ఇట్లే 11వ యుద్ధదినాంతమున పర్విన
చీకటిలో 'కురుసైనికులకుఁ దమవార లెదిరివార లని నిరూపింప
నశక్యంబగుట' తెల్పబడినది. 16వ యుద్ధదినమునాటి రజనీముఖమున
తిమిరంబు గవిసిన నెద్దియుం గానరా' లేదని, 18వ యుద్ధదినాంతమున
'తిమిరపటలి ... పరగఁజొచ్చె ... చుక్కలు దోచె'' నని వర్ణించ
బడినది. ఇవన్నియు బహుళపక్ష సూచకములు.

8, 11, 16 యుద్ధదినాంతములలో వర్ణించబడిన చీకటి
యుద్ధము అమావాస్యనాడు ప్రారంభమై రోజు మార్చి రోజు జరిగిన
దనుకొనుటకుపకరించును. యుద్ధము శుక్లదశమి ఏకాదశులలో
ప్రారంభమై ప్రతినిత్యము జరిగిన దనుకొనుటకు కూడ పై వర్ణన
విరోధము కాదు. కాని రానున్న అమావాస్యనాడే యుద్ధప్రారంభము
అని శ్రీకృష్ణుడు చెప్పినదానికి విరుద్ధముగా యుద్ధము శుక్లదశమి ఏకా
దశులలో ప్రారభమైనదనుకొనుటకుగాని, యుద్ధవర్ణనలో తిక్కన
ప్రయోగించిన 'మఱునాడు' 'ఎల్లి' పదములను పట్టించుకొనక యుద్ధము
రోజు మార్చి రోజు జరిగినదనుకొనుటకుగాని అవకాశములు లేవు.

ఇక్కడ మరియొక విషయమును గమనించవలసి యున్నది.

అశ్వత్థామ ఉపపాండవాదులను చంపిన మరునాడు "సకల బంధు
మిత్ర జనంబులకు నుదక కర్మంబాచరించి పాండవులు గంగాతీరంబున
మాసమాత్రంబు నిలిచిరి'' అని తిక్కన తెల్పినాడు. (శాంతి. 1-2)
ఆ "మఱునాడు'' (శాంతి. 1-34) ధర్మరాజు పట్టాభిషేకము. ఆ
తరువాత "ఒక్కనాడు'' (శాంతి. 2-2) ధర్మరాజుతో గలిసి శ్రీకృష్ణుడు
భీష్ముని దర్శించి

'అనఘ ! ఇనుఁడింక నేఁబదియారు దివస
ములకుఁ దా నుత్తరాయణమునఁ జరింపఁ
దొడఁగు నీవప్డు దేహంబు విడిచి యేఁగు
దవు నరావృత్తిపదమున కభినుతముగ''
(శాంతి. 2-116)

అని చెప్పను.

దీనినిబట్టి పదియవ యుద్ధదినమునాడు భీష్ముడు పడినదిమొదలు
ఉత్తరాయణము వచ్చువరకు ఎన్ని దినములు గడచినవో చూతము.

| | |
|---|---|
| భీష్ముని పతనానంతరము జరిగిన యుద్ధదినములు : | 8 |
| పాండవులు గంగాతీరమున నివసించిన దినములు : | 30 |
| ధర్మరాజు పట్టాభిషేకము తరువాత కృష్ణునితో కలసి భీష్మునివద్దకు వెళ్ళువరకు గడచిన దినములు | కొన్ని |
| భీష్మునివద్దకు వెళ్ళిన రోజుకు ఉత్తరాయణము వచ్చెడి రోజుకు మధ్యగల దినములు | 56 |
| మొత్తము : | 94 + కొన్ని |

భీష్మ నిర్యాణము మాఘశుద్ధ ఏకాదశి. ఆ ఏకాదశినుండి 94
దినములు వెనుకకు లెక్కించిన అది కార్తీక శుద్ధషష్ఠి లేక సప్తమి
అగును. యుద్ధము భాద్రపద అమావాస్యనాడు ప్రారంభమై రోజు
మార్చి రోజు జరిగిన భీష్ముని పతనము ఆశ్వయుజ బహుళ తదియ
అగును. ఆశ్వయుజ బ. తదియకు, కార్తీకశు. షష్ఠి, సప్తమిలకు మధ్య
గల దినములు 18 లేక 19 అగును. ఈ లెక్క ప్రకారము పై 'కొన్ని'
దినములు 18 లేక 19.

యుద్ధము భాద్రపద అమావాస్యనాడు ప్రారంభమై ప్రతి
నిత్యము జరిగిన భీష్ముని పతనము ఆశ్వయుజ శు. నవమి అగును.
దీనికిని, కార్తీక శు. షష్ఠి, సప్తమిలకు మధ్యగల దినములు 27 లేక
28 అగును. ఈ లెక్కన పై కొన్ని దినములు 27 లేక 28.

10వ యుద్ధదినమున భీష్ముడు పడినది మొదలు అతని
మరణము వరకు 58 రాత్రులే గడచినవని మూల భారతములో చెప్ప
బడినదని ప్రొ. కవీశ్వర్‌గారు తెలిపినదానినిబట్టి భీష్మ నిర్యాణము
నుండి 58 రోజులు వెనుకకు లెక్కించిన, భీష్ముని పతనము మార్గశిర
శు. ద్వాదశి అగును. దీని ననుసరించి, ఏవిధముగా లెక్కించినను,
యుద్ధప్రారంభము అమావాస్యనాడు కాజాలదు.

బలరాముని తీర్థయాత్ర "పెక్కు దినంబులు" (శల్య.2-141) సాగినదని చెప్పెనేగాని ఖచ్చితముగా 42 దినములని తిక్కన చెప్ప లేదు. ఇక భీమదుర్యోధనుల గదా యుద్ధము శల్యుని మరణదినముననే అనగా 18వ యుద్ధదినముననే జరిగినట్లు తిక్కన స్పష్టముగా చెప్పి నాడు. (చూ. పై 18వ యుద్ధదిన వర్ణన)

మరియొక విషయము.

భారతయుద్ధము ముగిసిన మరునాడు అశ్వత్థామ 'అపాండవం బయ్యెడుమని' బ్రహ్మశిరోనామకాస్త్రమును ప్రయోగించగా శ్రీకృష్ణుడు ఉత్తర గర్భస్థశిశువు నా అస్త్ర బాధనుండి రక్షించెను. దీనినిబట్టి మహా భారతయుద్ధమునాటికి ఉత్తర గర్భవతి యని స్పష్టము. అయిన అప్పటికా గర్భస్థ శిశువు వయస్సెంత ?

పాండవుల అజ్ఞాతవాసము ప్రొ. కవీశ్వర్‌గారి అభిప్రాయాను సారము నిజమై శాఖ బహుళాష్టమితో ముగిసిన దనుకొనిన ఉత్తరాభి మన్యుల వివాహము జ్యేష్ఠమాసమున జరిగియుండును. అర్జునమిశ్రుని అభిప్రాయానుసారము అజ్ఞాతవాసము ఆషాఢ బహుళాష్టమితో ముగిసిన దనుకొనిన వివాహము శ్రావణమున జరిగియుండును. భారత యుద్ధము భాద్రపద అమావాస్యనాడు ప్రారంభమైనది. అప్పటికి ఉత్తర గర్భవతి యని స్పష్టము. కనుక ఉత్తరాభిమన్యుల వివాహము జ్యేష్ఠమాసమున జరిగిన దనుకొనుటయే సమంజసము. పాండవుల అజ్ఞాతవాసము నిజమై శాఖ బహుళాష్టమితో ముగిసినదన్న ప్రొ.కవీశ్వర్ గారి అభిప్రాయం సరియైనదిగా కన్పించుచున్నది. దీనినిబట్టి అశ్వత్థామ అస్త్రప్రయోగమునాటికి ఉత్తర గర్భస్థ శిశువు వయసు మూడు నెలలని అనుకొనవచ్చును.

ఇక యుద్ధానంతరము సుమారు నూరు దినములకు భీష్మ నిర్యాణమని పైన తెల్పబడినది. అప్పటికి ఉత్తర గర్భస్థ శిశువు వయసు సుమారు ఏడు నెలలు.

ధర్మరాజు భీష్మునకు తిలోదక ప్రధానములాచరించి "గంగా తీరమున గొన్నిదినంబులు నిలిచి" (అశ్వ. 1. 136) "కతిపయ దినంబుల కచ్చోటు కదలి...పరిపాలన ధురంధరుడై" నాడు. (అశ్వ. 1. 138)

ఈ "కొన్ని దినంబులు" పది దినములను మించవు.

ధర్మరాజు రాజ్యమేలు చుండగా కృష్ణార్జునులు "ఇంద్రప్రస్థ మున వసించి... సరిత్కానన పర్వతసానుదేశముల జరించుచు విప్ర పూజల బుణ్యకథాశ్రవణముల సత్కావ్యగోష్ఠి బ్రొద్దుపుచ్చుచు" (అశ్వ. 1-141) నుండగా కృష్ణుడు "ద్వారకకు బోయివచ్చెద" నని అర్జునుని తోడ్కొని కరిపురమునకు వెళ్ళి ధర్మరాజు అనుమతి బడసి ద్వారకకు వెళ్ళెను. తరువాత కొన్నాళ్ళకు వ్యాసప్రేరితులై ధర్మ రాజాదులు అశ్వమేధయాగమునకు కావలసిన బంగారమునకై హిమ వత్పర్వత ప్రాంతమునకు ప్రయాణమై వెళ్ళిన వృత్తాంతమును విని శ్రీ కృష్ణుడు కరినగరము చేరినాడు. ఆరోజే ఉత్తర ప్రసవించినది.

పై కథాకాల మెన్నాళ్ళు జరిగెనో తిక్కన తెల్పలేదు. కాని సుమారు మూడునెలలు జరుగుట కవకాశము కలదు. దీని ననుసరించి కూడ భారతయుద్ధం నాటికి ఉత్తర గర్భస్థశిశువు వయసు మూడునెల లను కొనుట సమంజసమే.

ఇక,

శ్రీకృష్ణనిర్యాణమునాడే కలియుగారంభమైనదని భాగవతమున చెప్పబడినది. కలియుగారంభము ఫిబ్రవరి 20వతేదీ అర్ధరాత్రి ప్రాంత మున జరిగినట్లు ఏప్రిల్ 1983 'భారతి' పుట 67 లో చెప్పబడినది. మహాభారతయుద్ధము ముగిసిన మరునాడు గాంధారి "నేడాదిగా ముప్ప దాఱగునేడైన యద్దినమున... గూలువాడ" వని శ్రీకృష్ణుని శపించి నది (స్త్రీ పర్వము 2-161). దీని ననుసరించి శ్రీకృష్ణ నిర్యాణము, మహాభారత యుద్ధము జనవరి, లేక ఫిబ్రవరి నెలలలో జరిగియుండ వలెనుగదా ! జనవరి - ఫిబ్రవరి నెలలు ఉత్తరాయణము లోనివి. మహాభారతయుద్ధము గాంధారీ శాపము ననుసరించి జనవరి - ఫిబ్రవరి నెలలలో జరుగుటకు అవకాశములు లేవు.

సంస్కృత మహాభారతమున కీచకవధ నాటికి అజ్ఞాతవాసము పదినెలలు మాత్రమే గడచినదని చెప్పబడగా, తిక్కన "కతిపయ దినంబులు గొఱంతగా నేడు కాలంబు" గడచినదని చెప్పి; భీముడు కీచకుని చంపిన రాత్రి కాక ఆ మరునాడు ఉదయము ఉపకీచకుల జంపెనని సంస్కృత భారతమున ఉండగా ఉపకీచకులను కూడ భీముడు కీచకుని చంపిన రాత్రే చంపెనని చెప్పి తిక్కన మహా కవి "కథాసందర్భమునకు చక్కని పొందిక గల్పించినాఁడు" అని కీ. శే. కోరాడ రామకృష్ణయ్యగారు. 'ఆంధ్రభారత కవితా విమర్శ నము' న వ్రాసిరి. ఇవి తిక్కన మహాభారత కథాకాలమును గూర్చి చేసిన కృషికి నిదర్శనములు. ఎంతో కృషి చేసి మూలభారతములోని కథాకాలములను సంస్కరించిన తిక్కన మహాకవి మహాభారతయుద్ధ కాల క్రమవర్ణనమున మాత్రము పొందిక సాధించు యత్నము చేసినట్లు కనబడదు.

మహాభారతమందలి పైవిషయములను గూర్చి దేశవ్యాప్తముగ ఎంతో పరిశోధన జరిగియుండుననుటకు సందేహము లేదు. ఆయా పరిశోధనల ఫలితాంశములను 'భారతి' పాఠకులకు కూడ అందించవల సినదిగా పరిశోధక పండిత ప్రకాండులను ప్రార్థించుచున్నాను.



# ఆకలి

పాలగుమ్మి వెంకటేశ్వరరావు

బాగా కొమ్మలూ రెమ్మలూ సాచి, విశాలంగా, ఏపుగా విస్తరించుకునివుంది; ఎత్తుగానూ పెరిగింది.

ఆ నిద్రగన్నేరుచెట్టు ! వూరికి ఉత్తరంగా రోడ్డు ప్రక్కనే, ఏకాకిగా నిలచివున్న ఆ నిద్రగన్నేరు చెట్టుకి దాపుల్లో, అటూ యిటూ మరే చెట్టూ చేమా లేదు. హేమంతంలో ఆకులు రాల్చి బోసిగానే నిలిచినా, దిగులుగానే మొహం పెట్టినా, వేసవి రాకముందే చిగుళ్లువేసి ఆకుల్ని తొడుక్కుని - ఎండలకాలం ఇంతచల్లని చక్కని నీడనీ, వానాకాలంలో కొంచమయినా రక్షణనీ యివ్వగలిగిన శక్తి ఆ నిద్రగన్నేరుకి వుంది. అందుకే పుట్టి బుద్ధెరిగిన దగ్గర్నుంచీ కనకయ్యకి ఆ చెట్టుక్రిందే నివాసం. వాడ్ని కొందరు కుంటికనకయ్య అంటారు. కనకయ్యకి ఒక కాలు కుంటిది. కుంటికాల్ని ఎగరేసి నడుస్తాడు. ఇంకొందరు వాడ్ని గుడ్డికనకయ్య అంటారు. వాడికి ఎడం కన్ను అసలు కనబడదు ! కనకయ్యని కన్న తల్లిదండ్రులెవరో కనకయ్యకే తెలియదు ! గాలికి పుట్టాడు. గాలిరూపు వచ్చింది. గాలికి పెరిగాడు. గాలికి కొట్టుకుపోతూ, వయస్సు ఆగదుగనక, మీసాలూ, గెడ్డాలూ వచ్చినా, గాలి మనిషిగానే గాలిబ్రతుకు బ్రతుకుతున్నాడాకనకయ్య.

సంజె చీకటి పడగానే వీధులవెంట పడతాడు. గొంతెత్తి బిగ్గరగా ఆర్తనాదాలు చేస్తాడు.

'అమ్మా ! అవిటోణ్ణి ! మాడాకబళం తల్లీ ! అన్నపూర్ణమ్మ తల్లీ గుడ్డిముండాకొడుకునమ్మా'

తల్లీ ! కుంటోడ్ని. ఇంత అన్నంముద్ద పెట్టు అమ్మా ! ఆకలితో సచ్చిపోతున్నాను తల్లీ !' కనకయ్య అరుపులకి గుండె కరిగిన ఏ తల్లో, మిగిలిపోయిన ఇంత చద్దిముద్ద పడేస్తుంది. అది తెచ్చుకుని తృప్తిగా తిని ఆ ప్రక్కనే వున్న పంపునీళ్ళుతాగి హాయిగా నోటికొచ్చిన పదాలు పాడుకుంటూ ఆ నిద్రగన్నేరు చెట్టు వడిలో ఆదమరచి నిద్రపోతాడు. తెల్లారిలేచి, మొహం కడుక్కుని, బస్టాండు దగ్గరో రయిల్వే స్టేషన్ దగ్గర్నో, అడుక్కుని నాలుగు పైసలు సంపాదించుకుని మూట గడతాడు. తిండివేళ దగ్గర పడేసరికి మళ్ళీ బజార్న పడి ఆక్రందనలు చేస్తాడు. ఏదన్నా దొరికితే తింటాడు. దొరకన్నాడు ఆ పైసలుపెట్టి టీ తాగి, కడుపులో కాళ్ళు పెట్టుకొని ముడుచుకుని కూర్చుంటాడు. ఆకలికి పేగులు గుడగుడ మంటాయి. చలికి వళ్ళు చిమచిమ మంటుంది. ఎండకి శరీరం చవటగారి జవజవలాడ్తుంది. అన్నిట్నీ అనుభవిస్తూ, ఎదురు తిరుగుతూ, పోరాడ్తూ, లొంగిపోతూ బాధపడుతూ, అట్లాగే, ముప్పయి సంవత్సరాల బ్రతుకును నెట్టుకు వచ్చాడు కనకయ్య. కడుపునిండిననాడు పండుగ. కడుపు ఎండిన రోజు కార్తీక సోమవారం. సుఖమూ, దుఃఖమూ, తృప్తీ, అసంతృప్తీ సంతోషమూ, దుఃఖమూ, ఆ ఎండిన మొండి బ్రతుకులోనూ, బండగా చోటు చేసుకోగా, ముప్పయి ఏళ్ళవయసుకే ముసలి రూపెత్తి, ముదివగ్గులాగా అయ్యాడు కనకయ్య.

రోజూలాగే ఆరోజూ— కాళ్ళరిగేట్లు బజార్లు తిరిగాడు కనకయ్య.

చీకటి పడినాక బజార్లువెంట దిరిగి- కాళ్ళు నొప్పులుపుట్టేట్టు నడిచి, గొంతు ఆర్చుకుని పోయేటట్లు అరిచి, ఆక్రోశించి, ఆకల్తో

'అల్లాడి- గిజగిజలాడి- ఏమీ దొరకక్కపోగా- నీరసంగా పంపుదగ్గర నీళ్ళుతాగి తన నిద్రగన్నేరు చెట్టుని ఆశ్రయించబోయిన కనకయ్యకి బోల్డుఆశ్చర్యం ఎదురయింది! ఆ వెంటనే కోపంతో కన్నులు ఎర్ర బడ్డాయి, ఎన్నో ఏళ్ళుగా, తన ఆధీనంలో వున్న ఆ 'స్థలాన్ని' ఎవరో, దుర్మార్గంగా ఆక్రమించుకొని వున్నారు.

'ఏయ్! ఎవరెహ!?' కోపంగా అరిచాడు కనకయ్య.

ఆ నిద్రగన్నేరు చెట్టు మొదట్లో ఒక చిన్నమూటా, చిరుగుల చాపా, ఆనించివున్నాయి.

'ఏయ్! ఎవరంటే మాట్లాడవేంటెసా?! ఈ జాగానాదీ లేండి లేండి అవతలికి పోండళ!' అని కేకలు పెట్టాడు; కుంటికాలు ఎగరేసి చిందులు తొక్కాడు, కనకయ్య.

అప్పుడు, ఆచోటునుంచి సమాధానం వచ్చింది, కనకయ్యకి.

'అన్నా దిక్కులేనోళ్ళం. మాక్కూడా కాత్త చోటియ్యి.'- ఒక ఆడగొంతు దీనంగా వేడుకుంది.

'ఎహె! దిక్కులేనోళ్ళకి దేముడే దిక్కు. లే. లే. పో. పోమ్మంటావుంటే నీక్కాదూ?'

'అన్నా. పిల్లలు కలదాన్ని. ఈళ్ళనాన్న అర్ధాంతరంగా లారీ క్రిందపడి, చచ్చిపోయాడు. పొట్టచేత్తో బట్టుకుని పిల్లల్తో కొత్తగా ఈ వూరొచ్చాను. నాకేందెలియదు. నువ్వు పొమ్మంటే ఈ చీకట్లో నే నెక్కడికి పోను? ఈ గంగమ్మని దేముడు చిన్నసూపు జూశాడు- నువ్వు కూడా నన్ను, కాదు పొమ్మంటావా, అన్నా!' అని దీనంగా ప్రాధేయపడి శోకాలు దీసింది గంగమ్మ.

'సర్లె. తెల్లారగానే ఎల్లిపోవాలిమరి. ఎల్లకపోతే వూరుకునేది లేదు. ఆ' అని వుదారంగా పర్మీసను ఇచ్చి ఆ రాత్రికి ఒక ప్రక్కన సర్దుకున్నాడు కనకయ్య. ఆడకూతురు గందా! పాపం కష్టాలలో మునిగి వున్నట్లువుంది. ఒక రేత్రికేం పోయిందిలే అనుకున్నాడు.

మర్నాడు.

ఉదయ సంధ్య వళ్లు విరుచుకుంటూ వుండగా, పిల్లాడి ఏడుపుకి వులిక్కిపడి నిద్ర లేచాడు, కనకయ్య.

'లే. లే. పో. పొమ్మంటూ వుంటే' అని అరిచాడు నిద్ర లేస్తూనే.

చిరిగిన చొక్కా, మాసిన నిక్కరూ వేసుకుని వున్న ఒక పదేళ్ళ కుర్రాడూ, ఒక ఏడేళ్ళ కుర్రాడూ చిన్న చిన్న గుంటలు తీసి, కర్రలు పాతి, గుడ్డలు కప్పి టెంపరరీగా గుడారం తయారు చేస్తు న్నారు. ఏడుస్తూ వున్న పసిపిల్లని వొళ్లోవేసుకుని పాలిస్తూ వుంది గంగమ్మ.

'పోన్లే గదాని, దయదల్చి వేలు పెట్టనిస్తే కాలు పెట్టిన లే. లే. పో. పో.' అంటూ, కుంటికాలు ఎగరేస్తూ మీదమీదకి కనకయ్య. గంగమ్మ నిలువుగుడ్లు వేసుకుని చూసింది.

'అన్నా నువ్వు ఒంటరివాడవేగందా! ఈ నీడని మనం కుందాం, కాదనకు' బతిమాలింది గంగమ్మ. 'నా పిల్లలు చిన్న నేను ఆడదాన్ని' అని సొద వెళ్ళబోసింది.

'అదేం కుదర్దు. లే. లే. పోండి. పోండి.' అని గదమాయిం కనకయ్య పీరుడిలాగ.

'పోండి. పోండి - అని నువ్వు కూడా అంటే ఎక్కడ పోతామన్నా ?'

'అదేం నాకు దెలీదు. నువ్వు నీ పిల్లలూ ఈడనుంచి వె ల్సిందే. ఈ జాగా నాదీ.'

'అన్నా, అన్నా.' బతిమాలింది గంగమ్మ. ఆమె బతిమ కాళ్లు పట్టుకున్నకొందీ చెలరేగిపోయాడు కనకయ్య. పిల్లకి పాలిస్తు గంగమ్మని, రాక్షసంగా జుట్టు పట్టుకుని లాగాడు. అటూ ఇ బలంగా గుంజాడు. వీపుమీద గుద్దాడు.

ఫెడేల్మని అంది, సడన్‌గా వెనకాల. కనకయ్య వీపు చు మంది.

కనకయ్య ఎగిరి పడ్డాడు. అదిరిపోయాడు.

'అమ్మ. నీయమ్మ! సచ్చాన్రా' అని బాధగా అరిచా కనకయ్య.

గంగమ్మ పెద్ద కొడుకు చేతిలోని కర్ర మళ్ళీ పైకి లేచిం పౌరుషంగా.

'ఒరే! నీయమ్మ. కుర్రనాయాల! ఏంటిరా ? నీ దౌర్జన్యం అని గుడ్లురిమాడు, కనకయ్య.

కర్ర మళ్ళీ ఫెడేల్మంది! కనకయ్య వీపు విమానం మో మ్రోగింది. ధయిర్యం జావగారిపోగా- 'అమ్మ దొంగనాకొడక సంపుతావంట్రా ? !' అని కుంటికాలెగరేసి దూకాడు కనకయ్య 'తప్పురా.' ఒరే నాన్నా. ఆగరా. ఏంటిరా అది ?' అని గంగమ్మ అంటూనే వుంది. కుర్రాడి చేతిలోవున్న కర్ర, ఆగలేదు. ఒక కాల పోయిన మిల్కాసింగులాగా, కనకయ్య పరుగు లంకించుకున్నాడు క్షణాలలో ఆ ప్రదేశం నుంచి అదృశ్యమయిపోయాడు కనకయ్య.

ఎండ మాడ్చేస్తూ వుంది.

వీపు చుర చుర మంటూ వుంది.

'అమ్మా! ఆకల్తల్లీ! ఇంత ముద్ద బడెయ్యి తల్లీ' అంటూ నోరు అర్చుకుపోయేటట్టు అరుస్తూ వీధులవెంట దిరుగుతున్నాడు

య్య. అరికాళ్ల పెనంమీద బెట్టినట్టు మండిపోతున్నాయ్. గాలి ల్నీ బుట్టిస్తావుంది. సూరీడుకి దయ అన్నదే లేదు.

ఆపూటా ఏతల్లికీ దయ కలగలేదు, కనకయ్యమీద.

కనకయ్యకి ఇంత ముద్దయినా దొరకలేదు. ఇంతయినా దయ ఏని ఈలోకం ఏమిలోకం! తిరిగి తిరిగి వేసారి, అప్రయత్నంగానే న్నిదగన్నేరు చెట్టు క్రిందకి వచ్చాడు కనకయ్య. బెరుకు బెరుగ్గా న్నిపక్కల పరకాయించి చూసాడు. నిశ్శబ్దంగా వుంది. గంగమ్మ దాని కొడుకులు గానీ వున్నట్లు లేరు. కసిగా పళ్ళు పటపట పించి క్రూరంగా చూసాడు కనకయ్య. ఆ గుడ్డల ఇంటిని పీకి సేసి ఆ చెంబూ తపేలాల్ని అవతలకి విసిరేస్తే తనకి అడ్డు ఎదెవరూ ?

న్నిదగన్నేరు మొదలు చాటునుంచి ఇవతలికి వచ్చాడు- ఏడేళ్ళ రాడు.

'ఒరేయ్! బుడ్నాయాలా ? ఇలారా.' గొంతులోపలికి, ్చనంత కర్కశత్వాన్ని రానిచ్చాడు కనకయ్య. ధయిర్యంగా కయ్యని సమీపించి ఏమిటన్నట్లు కళ్ల ఎగరేసాడు, వాడు!

'నీ పేరేంట్రా? ఆఁ!' అని షోగ్గా కుంటికాలెగరేసాడు కయ్య.

'నారాయణ'

'ఒహో! ఆ దున్నపోతు పేరేంటి ?'

'దున్నపోతెవరూ ?!'

'ఆడే. నీ అన్ననాయాలు'

నారాయణ నవ్వు ఆపుకుని అన్నాడు- 'గగ్గయ్య'

'ఏడి అ గగ్గడు? భయపడి పారిపోయాడా ?'

'ఉహూ'

'మరి ఎందుకు పారిపోయాడురా ?'

'పారిపోలేదు. సైకిలుషాపులో పనికి కుదిరాడు. రోజుకి ఐదు ాపాయలు.'

'పనిచేసి మిమ్మల్ని పోషిస్తాడన్నమాట! ఎధవ సన్నాసని! న్నాసి మెమ్మేదీ ?'

'తనూ పనికి బోయింది'

'ఒరే! దానికేం పనొచ్చురా? నాకు తెలవక అడుగు ఏన్నాను, జెప్పు.'

'అంట్లు తోముతుంది. ఇళ్లు, వాకిళ్ళు వూడుస్తుంది. నీళ్ళు ోడుతుంది...ఇంకా...'

'దొడ్లు ఎత్తదూ? ఛి. ఛీ. ఇయ్యేం పన్లురా? ముండనాయాల'

'బతకటానికి ఏదో ఒక పని చెయ్యాలిగందా!'

'అయితే మాత్రం...!'

'అడుక్కు-తినడం కంటే నయమేగందా!'

కనకయ్యకు కోపం పొంగుకు వచ్చి కళ్ల ఎర్రబడ్డాయి. కుర్ర వెధవ నీతులు వల్లిస్తున్నాడు.

'నీయమ్మ! నన్నే దెప్పిపొడుత్తావంట్రా?! బుడ్డనాయాల! వుప్పుడు నీ ఈబ్బలగొట్టి, ఈ చెంబూ తపాళా ఎత్తుకుపోయి అమ్ము కుంటే నీకు దిక్కెవర్రా ?

'అది వల్లగాదు.'

'ఎందువల్ల గాదురా? ఏమిటా ధయిర్యమూ?! చెప్పు వింటా'

'అటుజూడు! ఆ ఎదురుగా వున్న సైకిలుషాపులోంచి, మా యన్న ఇదంతా చూస్తానే వున్నాడు. పిచ్చిపన్లు చేసావంటే, ఆడు లగెత్తుకొచ్చి, నీ 'శావ' జేస్తాడు. జాగ్రత్త.'

కసిగా వూశాడు కనకయ్య.

'నీయమ్మ! ఆ రాక్షసుడు పీడ నాకు వదల్లేదన్నమాట! ఇదుగో, విను. ఆడు ఇట్టాగే ఆ దవుర్జెన్యం కొనసాగిత్తే యల్లకాలమూ సాగదు. ఎప్పుడో - ఇంతకి ఇంతా అనుభవిస్తాడు. ఒక పెద్దా చిన్నా వుండాలి. మంచీ మర్యేదా కావాలి. న్యాయం అన్యాయం చూడాలి. తెలుసునా ?

'అయన్నీ నువ్వు గూడా గమనించాలి గదా! రూల్సంటే నీకయినా, మాకయినా ఒకటే గందా.'

'నీయమ్మ! నీతో నాకెందుగ్గానీ, ఇదుగో తిరిగి తిరిగి నా కాళ్ల నెప్పులు పెట్టున్నాయి. కాసేపు నేను ఇక్కడ కూర్చోవచ్చునా? వెంటనే నాకు సమాధానం గావాలి మరి!'

'కూర్చో. అందులో పోయిందేముంది ?'

కనకయ్య ఇంత నీడ చూసుకుని కూలబడ్డాడు.

వంట్లో నరాలు లాగాయి. ప్రేగులు గుడగుడ మన్నాయి. కడుపులో ఆకలి చెలరేగింది. కండరాలు నిస్సత్తువగా మూలిగాయి. అన్నం కోసం మూడు దినాల్నుంచీ ఒకటే తపన!

లాగూ జేబులోనించి ఒక డాగు మామిడికాయని దీసి చీకటం మొదలుపెట్టాడు నారాయణ,

కనకయ్య నోరూరింది.

కనకయ్య మనస్సు గిలగిలలాడింది. కడుపులోవిప్లవంచెలరేగింది

'ఒరే! నారాయణా!'

'ఏం ?'

'నువ్వు మంచాడివిలాగే వున్నావురా. నాకాస్త పెట్టవంట్రా?'

నారాయణ మవునంగా తింటం కొనసాగించాడు.

'ఇవతలనేను ఆకల్తో నకనకలాడి పోతావుంటే, నువ్వు ఒక్కడివే ఎట్టా తింటావురా? నారాయణా. మూడురోజులయి నేమ అన్నందినలేదురా. నేను ఆకలితోమాడి సచ్చిపోవటం నీకు ఇష్టమంట్రా ఆలోచించుకొని జెప్పు.

సగం తిన్న డాగు మామిడికాయని, కనకయ్యకి అందించి, పంపుదగ్గిరికి మూతి కడుక్కోటానికి వెళ్ళాడు నారాయణ. ఆబగా ఆ కాయని పీకి, పూర్తిగా నాకేసి, టెంకని విసిరేసాడు కనకయ్య. మూతిని లాగుకు తుడుచుకుంటూ వచ్చాడు నారాయణ.

'ఓరి నారాయణా! నువ్వు మంచాడివేరా. నీయన్న, ఆగగ్గడే దుర్మార్గుడురా'

'...'

'అనవసరంగా నా ఈవు పగలగొట్టాడు. అవాతలు ఇంకా సలుపుతా వున్నయిరా'

'...'

'ఒరే! నేను పెద్దమనిషినిగదా! వాడు అట్టా నామీద దవుర్జన్యం చెయ్యచ్చునా? నువ్వేచెప్పు!

'ఆడదనయినా ఆలోచించకుండా నువ్వు ఎగబడి, మా యమ్మ జుట్టుపట్టుకొని కొట్టడం దవుర్జన్యంకాదా? ఒక పెద్దమనిషి అట్టా చేయగలడా పెద్దాయనా?'

'ఓర్నీయవ్వ! నిజమేగందా! నేను మాత్రం ఎట్టా కాదం టానురా ? తప్పే ?'

'అందుకే – అన్న కోపం పట్టలేక నీ 'శావ' జేసాడుగాని, మాయన్న చాలా మంచాడు అసలు.'

'సర్లేరా నేను మాత్రం ఎందుక్కాదనాలి ? మనం అందరమూ మంచినాయాళ్ళమే ! దురుమార్గాన్ని దూరంగా వుంచి, మంచిగానే, మసలుకుందాం. అందరం ఈ చెట్టుక్రిందే వుంటూ కలిసి మెలిసి ఇకపయిన వుందాం. ఏమంటావు ?

'ఆ సంగతి నువ్వు మమ్మతోనూ, మన్నతోనూ, మాట్టాడు. నాకేం దెల్సు ? నేను బుడ్డనాయాల్ని,'

'సర్లేరా. నారాయణా. నువ్వు జెప్పిన దేన్ని నేను కాదన్నానూ! నేనిట్టా అన్నానని, నువ్వు ఆళ్ళకి జెప్పు ఆ తర్వాత ఆళ్ళతో నేను మాట్లాడతాలే' అని కనకయ్య లేచాడు. కాలు ఎగరవేస్తూ, ఆ ఎండను బజార్న పడ్డాడు. చుక్కాని విరిగిన నావలా సాగిపోయాడు.

పంపు దగ్గర కుండతో ఇన్ని నీళ్ళుదెచ్చి, పిల్లదాన్ని తోమి, నారాయణ కప్పగించి, ఏరి, మూడురాళ్లు చేర్చి, పొయ్యి వెలిగించి, మూటలోంచి ఇన్ని బియ్యం దీసి వుడకేసింది గంగమ్మ.

ప్రొద్దుగూకింది. ఆకలో అంటూ ఎగబడ్తారు పిల్లలు. కడుపులో ఇంత ముద్ద బడకపోతే వాళ్ళు పెరపెరలాడతారు. దేముడు దయ గలిగినవాడు. తనకి నాలుగిళ్ళు పనికి దొరికాయి. గగ్గయ్యకి ఒక పని దొరికింది. పర్వాలేదు. చీకటిలో తడుములాడుకుంటూవున్న తనకి ఒకదారి దొరికింది.

ఏదో ఒకలాగా బ్రతుకు బండి నడిచి, ఈ పిల్లలు పెద్దవాళ్ల యితే అదే పదివేలు !

'నారాయణా ! పిల్లని ఇట్టా ఇచ్చి స్తానం చేస్తారా బాబూ! అన్నయ్య రాగానే అన్నం పెడతాను' అంది గంగమ్మ. పిల్లని తల్లి కందించి, పంపుదగ్గరకి పోయాడు నారాయణ.

బరువుగా అంగలు వేసుకుంటూ అ చీకట్లో తల్లి దగ్గరకి వచ్చి నిలిచాడు గగ్గయ్య.

'అమ్మా !'

'ఏంట్రానాన్నా ? ఆ బుజాన్న ఏమిటి ?' అంది గంగమ్మ. చీకట్లోకి కళ్లు చించుకుని చూస్తూ.

తన బుజాన్న ఉన్న బరువును దించాడు గగ్గయ్య.

'కొద్దిగా నీళ్ళూ, ఇంత అన్నమూ పెట్టమ్మా. త్వరగా కావాలి'

'ఎవర్రా అదీ ? ఏమయిందీ?'

'పాపం ! ఆకలికి తాళలేక మన కుంటి కనకయ్య, మా సైకిలుషాపు ముందు పడిపోయాడమ్మా ! తీసుకొచ్చాను !

ఆకలి ఎటువంటితో, ఆ బాధ అనుభవించినవాళ్ళకే తెలుస్తుంది ఆ మాట వినగానే చటుక్కున లేచి, గిన్నెలో అన్నము పెట్టుకొని, చెంబుతో నీళ్ళుతెచ్చి, గగ్గయ్యకి అందించింది గంగమ్మ.

కుంటాడ్ని వళ్ళో పడుకోబెట్టుకుని రొండు ముద్దలుబెట్టి, ఇన్ని నీళ్ళు త్రాగించాడు గగ్గయ్య. గుటకలేసి తిని, మ్రింగి- వళ్ళు మళ్ళీ దారికిరాగా–

లేచి పోబోయిన ప్రాణం తిరిగిరాగా- శరీరాన్ని స్వాధీనంలోకి తెచ్చుకుని, నిమ్మదిగాలేచి కూర్చున్నాడు కనకయ్య. కళ్ళుతెరిచి పరకాయించి చూసాడు.

'ఎవడ్రా నువ్వు?'- అని అడిగాడు.

'నేను గగ్గయ్యని.'

'ఒరె. గగ్గయ్యా! అయితే -నన్ను సంపేత్తావంట్రా నువ్వు !? నేనసలే మంచి గాడిదకొడుకుని గాదురొరేయ్ ! డొక్క-చించి పేగులు మెడలో వేసుకుంట్రా్నా ! నా జాగాకాజేసి నన్నే కొడతావంట్రా ? ఒరేయ్!'- ఆక్రోశించాడు కనకయ్య.

'అన్నా! ఏ మడిసికయినా, చివరికి అవసరమయ్యేది ఆరడుగుల జాగా. కడుపులునింపు కోవటానికే వెంపరలాటలుపోయే మనలాటి వాళ్ళకి, జాగాలనిగురించి తగువులేల? అన్నా! నీకిష్టం లేక పో అట్లాగే మేమెళ్ళిపోతాంగానీ, సావబోయిన నిన్ను మళ్ళీ బ్రతిక నందుకా, మళ్ళీ నా బిడ్డమీదకి కాలు దువ్వుతున్నావ్!' అన్నా! నీ తగదు!' అంది గంగమ్మ.

'నేను సావబోయానా? గంగమ్మా!'

'అవును ఆకలికి తాళలేక నువ్వు రోడ్డుమీద బడిపోతే, నా నిన్ను మోసుకొచ్చి నీకు ప్రాణం పోశాడు. అందుకని నువ్వు మ బాగా జవాబుచెప్తున్నావ్!'

గగ్గయ్యని వాటేసుకుని చిన్నపిల్లాడిలాగా, బావురుమ బిగ్గరగా విలపించాడు కనకయ్య.

# ఆర్ద్రత ?

అడుగడుగునా అడ్డుపడే
వైఫల్యాల చరిత్రను
అడగాలి కాలికి తగిలేకంకరరాళ్ళనే!
కాయాకష్టంకింద మొద్దుబారిన
రోజువారి మృత్యురహస్యం
ఆ కంకరకొట్టే చేతుల్లోనే.

కాస్సేపు కిటికీలో నిలుచునే
స్థిర చిత్రంలా ఆ నెలవంక,
ఎండాకాలంలో సందులోంచి
శరీరాన్ని పల్కరించే
సాయంత్రపు చల్లని రివటుగాలి
స్నేహాలకు ఎలాంటి హద్దులు కలవని
మంచి మనసులకోసమే అన్వేషణ.

మతాల కుట్రలు కుహకాలు
స్వల్ప బేధాభిప్రాయాలు
సృష్టించే అగడ్తలకు..
అతీతంగా కలిగే ఆర్ద్రత
ఎక్కడని వెతకను ?

తల్లీకొడుకుల అనుబంధం
భార్యా భర్తల అనురాగం
అన్నా చెల్లెల ఆప్యాయతలు
అన్నీ ఈ రోజువారి లెక్కల్లో
గొప్పతనాన్ని చాటుకుంటున్న-
వస్తువుల్లో నిబద్ధమైన విలువలతో
సిగ్గు విడిచిన ఈ తరుణంలో
వాడుకలోకి వచ్చిన కొత్తనుడికారం

త్మవంచన?
నవనైజాల నైరూప్యకళ!
చిన దాగని గుండెకోత
తివొక్కడిలో వుందిదాకో్కని

ు ప్రఖ్యాతులు
త్కాలిక అనుభూతులు
శిఖరాలు అమరత్వంకోసం
చక్కగా నటించే ఆప్యాయతకు
రేమి పేరు పెడతారో చెప్పండి
గా....
తిష్టకోసం ముడుచుకపొండి!!

బడిన సంవత్సరాల అనుభవాల
నసాగిన దారులవెంబడి

ఎవరెవరి ఆర్ద్రత
ఎంతెంత మోతాదులో
అవసరాల కనుగుణంగా
ప్రతి స్పందించిందో
గీతలు పడిన మనహృదయాలేసాక్షి!

ఆర్ద్రత- ఆర్తి ఇచ్చిపుచ్చుకునే
మహారాజ పోషకత్వమా?
అప్పులా - వడ్డీలా ?
కానేకాదని మీకూ- నాకూ తెలుసు,
గుండె కోనలోన ఉబికే స్వచ్ఛత
ఎర్రెర్రగా ప్రతిఫలించే స్నేహం
ప్రతిఫలాపేక్షలేని మానవసారం.

# ఎందాకా ?

గానికి దగ్గరగా నడక
ం దూరం చేరుకునే లోనే
ఖంపై పడుతున్న లోయలు
ంటీ ముడుచుకునే ముడతలు ?

ం నిర్దాక్షిణ్యంగా నిలేసి
ందాకా ఈ ఫలితం లేని ప్రయాణం"?
గుండెపై గుద్దితే
త్కాలికంగా
ంతరంగా
పోయిన రైలువైపు చూపు

రాత్రంతా కురిసినవాన___
వెలిసే దిక్కుమొగము!

విధ్వంసంకాని ఒకే ఒక విశ్వాసం
కవి జీవితం
ఎప్పటికీ మూడు పదులే
నిత్య యౌవ్వనంలో నిరంతరం
రగిలే మార్పుల కోర్కెలే
ప్రౌఢత్వపు అంచులు
తాకుతూ వోడిపోని పరిపక్వతే !

శ్రీ నిఖిలేశ్వర్



# శరద్దీప్తి!

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

చల్లనై సుధాతరంగ సరసమై దిగంత పూ
ర్ణోల్లస న్మహాత్మ్యమై మహోజ్జ సాతివేలమై
సల్లలితకళా విముగ్ధ సాంద్ర మధుర శిల్పమై
వల్లవీ కిశోరు హాస వైభవమున వెన్నెలల్ !! 1

విప్పుకున్న అంచరెక్క విధము వెలుగు వెన్నెలల్
కప్పుకున్న పట్టుబట్టగా వెలుంగు వెన్నెలల్
కుప్ప వోసినట్టి పాము కుబుసములుగ వెన్నెలల్
చెప్ప శాలిగర్భ మృదుల సిద్ధకాంతి వెన్నెలల్ ! 2

వైభవమున మెఱసి భక్తి భావమంది స్వచ్ఛ క్షీ
రాభిషేక మాచరించునా ? తలంప విశ్వరూ
పాభిరాముడైన యంధకారి కిన్నసంగ పూ
ర్ణాభుడై వెలింగె కుముదనాయకుండు రాత్రులన్ ! 3

నిసువు మెఱుగు కండ్ల చలువనింప తల్లి ప్రేముడిన్
వెస కుమారుఁజేరి పాలు పిదుక కంటి కెక్కుడై
పసి కపోల వీధిజారు పాలవోలె చలువలొ
నిశి శరత్సుధాంశు విమల నిర్భరంపు వెన్నెలల్ ! 4

జలధి నొక్క గ్రుక్కఁద్రావి-సర్వతోముఖ ప్రభా
విలస దఖిల తపముఁబేర్చి-వీరరాక్షస ద్వయం
బలఘు శక్తిఁగూల్చి-వింధ్య మానతముగ జేయువా
డల దిగంతవీధి యామ్యమందు తోచె చుక్కయై ! 5

[ నా అముద్రిత "ఋతుదీప్తి" నుండి ]



...రియల్

# థాంక్యూ మిస్టర్ గ్లాడ్

మరాఠీ మూలం: అనిల్ బర్వే ### తెలుగు అనువాదం: కె. సుజనాదేవి

(గత సంచిక తరువాయి)

9

ల్లని తారోడ్డు మీద బూట్ల చప్పుడు ఎప్పటిలా టకటక లాడలేదు. అయినా రోడ్డు నిర్మానుష్యమైంది. చెట్లమీద పక్షుల కిలారావం ఆగిపోయింది. గ్లాడ్‌సాబ్ కూతుర్ని తీసుకుని జైల్‌కేసి స్తున్నాడు.

చల్లగాలికి జీన్ తలకి చుట్టుకున్న స్కార్ఫ్ ఎగురుతూంది. దాలదాకా వేలాడుతున్న ఆమె ఫ్రాక్ గాలికి ఫడఫడ మంటూంది. డ్‌సాబ్ ఆమె చెయ్యి పట్టుకుని అపురూపంగా నడిపిస్తున్నాడు. ఓ ప్రేమ విచిత్రంగా తోచిందేమో ఓ కొంటె కోకిల కూ కూ ంటూ కూసింది.

"పపా కోకిల" అంటూ ఆనందంగా అరిచింది జీన్. గ్లాడ్ బ్ కనుబొమలు ముడిపడ్డాయి. అది చూచి జీన్ "పపా మీకు కిల తియ్యని పాట రుచించలేదా?" అనడిగింది ఆశ్చర్యంతో.

"కాకి నయం కోకిలకంటే. అది ఏటికేడాదీ ఒకేలా అరుస్తుంది. జిత్తులమారి కోకిల, మామిడిపూత చూసినంతసేపే దీనిపాట. షి జాతిది... బద్‌మాష్ సాలీ?

జీన్ చిన్నబుచ్చుకుంది. మాట్లాడకుండా నడవసాగింది. గార్డ్ ్యూటీ హవల్దార్ అలవాటుగా సలాం కొట్టాడు. కాని సాబ్ కూతుర్ని స్తూనే అతని కళ్లు మెరిసాయి. నోరు తెరిచి అలాగే చూస్తూండి యాడు. మేన్‌గేట్ తెరచుకోగానే గ్లాడ్‌సాబ్ ముందు నడిచి తురుకు చేయందించాడు. ఆమె తన సుతిమెత్తని పాదాలు జైల్లో పగానే ఆ ప్రదేశమంతా ఇంపోర్టెడ్ సెంటువాసనతో గుబాళించింది. ోగేట్‌లోని జైలర్లూ, జమేదార్లూ సాబ్‌కు కనబడకుండా ని క్రీగంట దొంగచూపులు చూడసాగారు.

పిల్లాజెల్లా కల సీనియర్ జైలర్‌కు మాత్రం గ్లాడ్‌సాబ్ ప్రవర్తనేం నచ్చలేదు. స్త్రీ సంగతలా ఉంచి మామూలు సివిల్ డ్రెస్ గుడ్డకూడా కంటబడని ఖైదీల ముందునించి తన కూతుర్ని తిప్పడం సీనియర్ హిందూ బుద్ధికేమాత్రం నచ్చలేదు. కాని గ్లాడ్‌సాబ్ నేమన గలడు?

సాబ్ ఫాసీగేట్‌వేపు నడుస్తుంటే ఖైదీలంతా ఆకలిగొన్న చూపుల్తో జీన్‌ని మింగేస్తున్నారు. కాని ఆమె కళ్లల్లోకి చూచే ధైర్యం మాత్రం ఖైదీలకే కాదు; ఫాసీగేట్ జైలరిక్కూడా లేదు.

గ్లాడ్‌సాబ్ ఫాసీగేట్లో అడుగు పెట్టాడు. జైలు మొత్తం లోనూ నక్సలైట్ మాత్రం జీన్‌కేసి తలెత్తి చూశాడు.

"ఎలా ఉంది మా అమ్మాయి?" గర్వంగా అడిగాడు.

"అందంగా." నక్సలైట్ జవాబిచ్చాడు.

"ఎంత?" సాబ్ ప్రశ్న.

"ఎంతందంగా అంటే... ఈమెను చూసి ఉంటే చాలామంది రొమాంటిక్ కవుల కవితలు మరింత రొమాంటిక్‌గా బాగా తయారయ్యేవి."

ఈ మాట వింటూనే ఫాసీగేటంతా దద్దరిల్లేలా నవ్వాడు గ్లాడ్‌సాబ్. తన కూతురి అందచందాలను నక్సలైట్ మెచ్చుకోవడంతో సాబ్ తన్ను తాను మరచిపోయి మనసారా నవ్వుతూ అడిగాడు "జీన్‌నుచూసి నీకేమన్నా కవిత్వం పుట్టుకురాలేదూ?"

"లేదు. నా కామెను చూస్తుంటే వాళ్ళమ్మ హత్య గుర్తొచ్చింది."

ఆ మాటతో గ్లాడ్‌సాబ్ గుండె చెఱువయింది. జీన్ విస్మయంగా నక్సలైట్‌కేసి చూసింది. అతని కళ్ళలో అశ్రువులు.

ఫాసీగేటంతా నిశ్శబ్దం పేరుకుంది. కాసేపయాక జీన్‌యే నిశ్శబ్దాన్ని చీలుస్తూ "మీకు చూపించాలని నేను నా కవితల నోట్ బుక్ తీసుకొచ్చాను" అంది.



"ఓ...అలాగా, ఏదీ చూద్దాం" తన్ను తాను సర్దుకుంటూ అన్నాడు నక్సలైట్.

జీన్ తన చేతిలోని నోట్‌బుక్ అతనికిచ్చింది. అతడు దాన్నోసారి తిరగేశాడు. చాలా విలువైన నీలంరంగు అందమైన నోట్‌బుక్ అది. దానిపై సెంట్ చల్లినట్టున్నారు. అందమైన గుండ్రని అక్షరాల్లో చాలా కవితలు వ్రాసి ఉన్నాయి. ఓ పెద్ద శ్రీమంతుని గారాల ఏకైక పుత్రిక వ్రాసే కవితల్లాగానే ఉన్నాయి. చంద్రుడూ, నక్షత్రాలూ, అరిగిన రికార్డులాంటి అమరప్రేమా... ఇంకా ఇలాంటివే.

ఒకటి రెండు కవితలు చదివాక నక్సలైట్ నోట్‌బుక్ తిరిగి ఇచ్చేస్తూ జీన్‌తో అన్నాడు "కవితలు అసంపూర్ణంగా ఉన్నాయి."

"ఎందుకని?" గారంగా అడిగింది జీన్.

"వీటిల్లో జోలపాటలేవి? ప్రపంచంలోని మొట్టమొదటి కవిత స్త్రీముఖంనుంచి జోలపాటగా బయటపడింది. అందుకే కవిత శబ్దం స్త్రీలింగ శబ్దం. పుల్లింగ శబ్దం కాదు" అన్నాడు.

జీన్ నిరుత్తరురాలైంది. నిశ్శబ్దంగా ఉండిపోయింది. ఆరు గంటలు కొట్టారు జైల్లో. వెళ్ళేముందు జీన్ "ఒక్కమాటడగనా?" అంది. అడగమన్నట్టు తలూపాడు నక్సలైట్.

"మీ మృత్యు పత్రం పవిత్రంగానూ, తేజోవంతంగానూ ఉంది. చాలా బావుంది, ఓ క్రాంతి వీరుడి కవితలా. కాని ... ఆ ఆవేదన, ఒక్కొక్క అవయవమే మీ ఒంట్లో నుంచి ఊడబెరుకుతుంటే ఆ హింస, ఆ వేదన మీరెలా భరించగలరు? మీకు కష్టం కలుగదా?" అంది

లేదన్నట్టు తలూపి నక్సలైట్ నెమ్మదిగా అన్నాడు "ఏవి గొడ్డునొప్పులుకావో వాటికై దుఃఖించే పనిలేదు". చర్చిలోంచి ఆర్గన్ వినిపిస్తూంది. యార్డుల్లో హరికెన్ లాంతర్లు వెలుగుతున్నాయి. గ్లాడ్ సాబ్ కూతుర్ని తీసుకుని బయల్దేరాడు.

వెల్లకిలా పడుకుని గుర్రుపెడుతూ నిద్రపోతున్న గ్లాడ్‌సాబ్‌కు నైట్ లాంప్ వెలుతురుతో మెలకువ వచ్చింది. కళ్లు తెరిచిచూస్తూ పక్కకు ఒత్తిగిల్లాడు.

బెడ్‌రూం గుమ్మం దగ్గర అస్తవ్యస్తంగా ఉన్న గుడ్డలతో చిందరవందర జుట్టుతో జీన్ నుంచుంది. తండ్రి మేల్కొన్నది చూచి దగ్గరికొచ్చి కూర్చుంది. గ్లాడ్‌సాబ్, విచారంతో జీన్ ముఖం అలసిపోయిందనీ, ఏడ్చి ఏడ్చి కళ్లు ఎఱ్ఱబడ్డాయనీ, చెక్కిళ్లు ఉబ్బాయనీ గుర్తించాడు. తల్లి జ్ఞాపకంతో జీన్ నిద్రపోలేదేమో అనుకున్నాడు. దగ్గరగా తీసుకుని వీపుతట్టూ "నిద్ర రావడం లేదామ్మా ? భయం వేస్తోందా ?" అంటూ బుజ్జగించాడు.

కాదన్నట్టు కేవలం తలాడించి జీన్ తండ్రి ఒళ్లో కాసేపలాగే ఉండిపోయింది. కాసేపయాక ఆవేశంతోలేచి తండ్రిని రెండు చేతుల్తో ఊపుతూ అరిచింది "పపా ! యూ మస్ట్ బిహేవ్ విత్ ఎ సోల్జర్ లైక్ సోల్జర్."

గ్లాడ్‌సాబ్ ఉలిక్కిపడ్డాడు. అతని నిద్ర పారిపోయింది. కూతుర్నడిగాడు "వాడ్డూయూ మీన్ జీన్" అంటూ.

"ఐ మీన్ పపా ... హీ ఈజ్ నాట్ ట్రేటర్ ... పపా, హీ ఈజ్ గ్రేట్ రెవల్యూషనరీ...రియల్లీ హీ ఈజ్ బ్రేవ్ సోల్జర్..."

ఆవేశంతో అరుస్తోంది జీన్. గ్లాడ్‌సాబ్ లేచి కూర్చున్నాడు. తండ్రి నైట్‌గౌను కాలర్ సరిచేస్తూ అంది.

"పపా, హంతకులూ, గజదొంగల్లాగా అతన్నెందుకు హాంగ్ చేస్తారు. అతని ప్రాణమే తీయాలనుకుంటే ఎదురుగా కాల్చి చంపండి. గివ్ హిమ్ ఎ సోల్జర్ డెత్."

ఖిన్నుడయ్యాడు గ్లాడ్‌సాబ్. నిరుత్తరుడయ్యాడు. కూతురి మాటలతనికి నచ్చాయి. ఓ తేజస్వి, క్రాంతి వీరుణ్ణి దొంగల్లాగా ఉరికంబమెక్కించాలంటే అతనిక్కూడా నచ్చలేదు. కాని తను నిస్సహాయుడు.

డ్రాయర్లోంచి విస్కీ బాటిల్ తీశాడు. పళ్ళతో మూత ఊడబెరికాడు. ఇంతలో జీన్ అతని చేతిలోంచి బాటిల్ లాగేసుకుని అంది "పపా, యూ ఫస్ట్ ఆన్సర్ మీ".

"ప్లీజ్ జీన్...జీన్ ప్లీజ్...ప్లీజ్" సాబ్ బ్రతిమాలుతూ సీసా తీసుకుని నోట్లో నాలుగ్గుక్కలు పోసుకున్నాడు. కొంచెం ప్రాణం లేచొచ్చినటయిందతనికి. జీన్‌తో అన్నాడు.

"జీన్ యూ డోంట్ నో మై పొజిషన్. బట్ హీ నోస్...హీ నోస్ దట్ అయాం ఎ లిటిల్ పెట్టీ బ్యూరోక్రాట్."

తను కూడా ఇతరుల ఆజ్ఞకు బద్ధుడినన్న గుర్తింపుతో గ్లాడ్ సాబ్‌లోని సాబ్ కుప్పకూలిపోయాడు. సాబ్‌లేచి ఈజీ చెయిర్లో కూలబడ్డాడు. దుఃఖంతో తల్లడిల్లుతున్న జీన్ తన దుర్బలుడైన తండ్రి ఒళ్లో తలపెట్టుకుని ఏడుస్తూ ఉండిపోయింది.

అది నిశ్శబ్దమైన చీకటి రాత్రే. అయినా నైట్ క్వీన్ గర్వంగా, ఠీవిగా నుంచోలేదు. సువాసనలు గుబాళించలేదు. గ్లాడ్‌సాబ్ బంగళాలో పైన బెడ్ రూంలో సన్నని, బలహీనమైన దీపంమాత్రం క్షీణంగా వెలుగుతోంది. ఊరికే వెలుగుతూ ఉంది.

## 10

గ్లాడ్‌సాబ్ మనుషుల్లో పడ్డాక జైలంటే ఓ ధర్మశాలై కూర్చుంది. ఈ రెణ్నెల్లనుంచీ ఎవరి వీపుమీదా రూళ్ళకర్ర విరగలేదు. సాబ్ వస్తుంటే చెట్లేం ఖర్మ ఖైదీలు కూడా దొంగలుగా భావించటం లేదు.

"ఈ లక్షణాలేమీ బాగులేవు." సీనియర్ జైలర్ గొణుక్కున్నాడు. సాబ్ ఇలాగే ప్రవర్తిస్తుంటే జైల్ అడ్మినిస్ట్రేషన్ పాడై పోతుందనిపించింది. ఫాసీగేట్ వెర్రి జమేదార్ సంగతే తీసుకోండి. నిజానికా మూర్ఖుణ్ణి అక్కడ ఉంచడం సీనియర్ కిష్టమేలేదు; పైగా ఓ విధమైన భయం కూడా. కాని ఏం చేస్తాడు ? గ్లాడ్‌సాబ్‌కు వాడంటే ఇప్పుడు పంచప్రాణాలు. దానిక్కారణం లేకపోలేదు. వాడి ముసలి తల్లి ఆ చుట్టుపక్కలకంతా మంత్రసాని అని ప్రసిద్ధి. సాబ్ కూతురికి నెలలు నిండుతున్నాయి. ఒకేసారి ముగ్గురేసి ఖైదీలను నిర్వికారంగా హాంగ్ చేసిన గ్లాడ్‌సాబ్ గుండె ఇప్పుడు కుందేలు పిల్ల గుండెలాగా ఊరికే దడదడలాడుతోంది. జీన్‌కి డాక్టర్ వాడమన్న మందులేకాక ఆ ముసల్దిచెప్పే చిట్కాలన్నీ చేసి చూస్తాడు. అక్కడికీ సీనియర్ జైలర్ మూణ్నాలుగుసార్లు "దీంట్లో భయపడాల్సిన అవసరమేమీలేదు సర్ దటీస్ నాచురల్" అని చెప్పిచూశాడు. అయినా సాబ్‌కు భయమే. అసలే ఆ యింట్లో ఎప్పుడూ ఆడ మనిషి నీడ కూడా పడలేదు. అందునా ఇప్పుడు ప్రాణం కన్నా ప్రియమైన కూతురి పురుడంటే ... ...

ఏదెలాగైతేనేం, కూతురి పురుడు నెపంతోనన్నా గ్లాడ్‌సాబ్‌కు సంఘంతో పని పడింది. ఎప్పుడూ పెద్దపులిలా తన గుహలాంటి బంగళాలో గాండ్రిస్తూ కూర్చునే సాబ్ ఇటీవల అందరిలో కలవసాగాడు. ఈమధ్యే ఓసారి వంటశాల జైలర్ ఇంటికి దుర్గాపూజ

క్కూడా వెళ్లొచ్చాడు. అన్నింటికన్నా ఆశ్చర్యమేమంటే బంట్రోతుల పిల్లలు ఈమధ్య సాబ్ బంగళా వరండాలో, తోటలో ఆడుకోవడం చూశాడు సీనియర్.

గార్డ్ డ్యూటీ సిపాయి సలాం చేశాడు. మేన్‌గేట్ తలుపులు కిరకిరలాడుతూ తెరచుకున్నాయి. గ్లాడ్‌సాబ్ జైల్లో అడుగుపెట్టాడు. నేరుగా ఆఫీసు రూంకెళ్ళాడు. ఓ నిజాయితీ పరుడైన క్లర్కులాగా వంచిన తల ఎత్తకుండా పనిలో నిమగ్నుడయ్యాడు.

సాబ్ రోజుకంతా సరిపడే భయాన్ని ఎవరిలోనూ కలిగించ లేదు సరికదా ఎవర్నీ ఊరికే కోప్పడనన్నా లేదు.

గంటలు గడుస్తున్నాయి. పొద్దుపోతోంది. విసుగు చెందిన స్కూల్ పిల్లల్లా ఎవరి పనులు వాళ్లు యాంత్రికంగా చేసుకు పోతున్నారు. ఫాసీగేట్ జైలర్ సీనియర్ జైలర్‌తో అన్నాడు. "ఈమధ్య సర్వీస్‌లో థ్రిల్‌లేదు యార్" సీనియర్ నిస్పృహగా ఊకొట్టాడు.

దూరం నుంచి మోటారు సైకిల్ చప్పుడు వినిపించింది. "ఆఫీస్ విడిచే వేళ కిదేం పీడ !" అంటూ విసుక్కున్నాడు సీనియర్ జైలర్.

రైడర్ మేన్‌గేట్ ముందు మోటార్ సైకిల్ ఆపి జైల్లో కొచ్చాడు. హోమ్ డిపార్టుమెంట్ రైడర్నిచూచి సీనియర్ తల్లో నానా అనుమాన భూతాలుద్భవించాయి.

అటెంషన్‌లో సెల్యూట్‌కొట్టి రైడర్ సీల్డ్ కవరందించి, సీనియర్ దగ్గర్నించి లెటరందినట్టు వ్రాసిన కాగితం పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

సీనియర్ కవరు చించి చదివాడు. అతని ఆనందానికి హద్దు లేకపోయింది. ఖైదీ నెం. 842 వీరభూషణ్ పట్నాయక్ ఉరిశిక్షను రాష్ట్రపతి ఆమోదించిన పత్రం అది. ఉరితీయాల్సిన డేట్, వారం, టైమ్ ఇవన్నీ వేసి హోం డిపార్ట్‌మెంట్ పంపిన ఆర్డరది. సీనియర్ గబగబా లేచాడు. చాలా రోజుల తరువాత 'ఓ థ్రిల్లింగ్ ఎక్స్‌పీరి యన్స్" దొరుకుతూంది. ఈ ఆర్డర్ చూస్తూనే గ్లాడ్‌సాబ్ నార్మల్ కొస్తాడనుకున్నాడు. ఉరిశిక్ష ఒక్కొక్క ఆర్డరూ, గ్లాడ్‌సాబ్‌కు ఒక్కొక్క 'మనిషిని వేటాడే' అవకాశం. ఒక్కొక్కళ్లనీ హాంగ్ చేస్తుంటే, ఒక్కొక్క ధార్మిక సత్కృత్యంచేసిన సాత్విక తేజస్సాయన ముఖం మీద వెల్లి విరుస్తూంది.

సెల్యూట్‌చేసి సీనియర్ జైలర్ సాబ్ చేతికి లఖోటా అందిం చాడు. చాలా సేపటిదాకా సాబ్ కవరుకేసిచూస్తూ కూర్చున్నాడేతప్ప, కవర్లోంచి కాగితంతీసి చదవలేదు. అందులో ఏం వ్రాసి ఉంటుందో అతనికి తెలుసు. కాని వద్దనుకున్నా ఊరుకోలేడుకదా? లెటర్ తీసి మొక్కుబడిగా శూన్య దృక్కులతో చదివాడు.

అటెన్షన్‌లో నుంచున్న సీనియర్ నడుం నొప్పెట్టింది. కాని గ్లాడ్‌సాబ్ అతనికేసి చూణ్ణున్నాలేదు. స్థితప్రజ్ఞునిలా కూర్చుండి పోయాడు. సాబ్ ముఖంమీద క్రౌర్యం, ఆనందం మాటలావుంచి, దుఃఖంకూడా ప్రస్ఫుటించలేదు. చాలా సేపు ఆలోచిస్తూ కూర్చున్నాడు. లేచి చెంబుడు నీళ్లు గడగడా తాగేశాడు. తలపై క్యాప్ పెట్టుకుని నీరసంగా ఆర్డరిచ్చాడు. "ఉరిశిక్షకి తయారు చేయండి" అంటూ.

సీనియర్ తల వంచుకుని బైటపడ్డాడు. సాబ్ స్విచ్ వేశాడు. ఆఫీసంతా మందమైన, ఉదాసీనమైన వెలుతురు ప్రసరించింది. ఆఫీసు బయట తల్లడిల్లుతూన్న రాత్రి తలయెత్తింది.

## 11

ఆ అస్వస్థతను పెంచే కాళరాత్రి గ్లాడ్‌సాబ్ కనుగుడ్లను ఏదో అజ్ఞాతశక్తి పెరికివేసింది. కనుగుడ్లస్థానే గుంటలు పడ్డాయి. వేడి రక్తం గ్లాడ్‌సాబ్ బుగ్గలమీదుగా ప్రవహిస్తూంది. ఓ చేత్తో రెండు కళ్ళనూ గట్టిగా అదిమి పట్టుకుని ఇంకోచేత్తో తడుముకుంటూ స్విచ్ నొక్కాడు గ్లాడ్‌సాబ్. నిర్వికారమైన వెలుగు గదంతా పరచుకుంది. నెమ్మదిగా కళ్లు తెరిచి అద్దంలో చూసుకున్నాడు సాబ్.

అతని కనురెప్పలు తడిగా ఉన్నాయి. రెండు బుగ్గలమీదుగా రెండు కన్నీటి ధారలు మెడదాకా కనబడుతున్నాయి అంతే. రాత్రి పడుకోబోయేముందు, కొంచెం డోస్ ఎక్కువగా పుచ్చుకొన్నందు వల్ల కళ్లు ఎర్రబడ్డాయేతప్ప ఎక్కడా గాయాల్లేవు. "హమ్మయ్య" అను కున్నాడు. ఎన్నో ఏళ్ల తరువాత అతనికి భయంకరమైనదైతేనేం కలవచ్చింది.

ఆ గూఢమైన, భయంకరమైన కల అర్థమేమిటాని గ్లాడ్‌సాబ్ ఆలోచించసాగాడు. కాని ఎంత బుర్ర బద్ధలు కొట్టుకున్నా అతనికేం అర్థం కాలేదు. కాని ఆ ఆలోచనల్లో మాత్రం అప్పుడప్పుడు సర్చ్‌లైట్ రాసాగాడు. మత్తుగా, భారంగా ఉన్న తలను గ్లాడ్‌సాబ్ ఓసారి గట్టిగా విదిలించాడు. డ్రాయర్ తెరిచి విస్కీబాటిల్ అందు కున్నాడు. నాలుగు గుక్కలు నోట్లో ఒంపుకుని ధడాల్న డ్రాయర్ మూసేసి లైటార్పి నిండుగా బ్లాంకెట్ ముసుగుతన్ని పడు కున్నాడు...

గ్లాడ్‌సాబ్ ఎప్పటిలాగే ఖైదీలను చర్మం చిరిగేలా బూట్ల కాళ్లతో తన్నేస్తున్నాడు. ఇంతలో ఆకాశానికి పెద్ద రంధ్రంపడింది.

ఆకాశమంతా నిస్తేజమైంది, నలుదిక్కుల్నించి చీకట్లు అలముకో సాగాయి. పెద్ద పెద్ద మబ్బులు రాజమండ్రిజైల్ మీదకు దండెత్తాయి.

గ్లాడ్‌సాబ్ గబగబాలేచి విజిల్ ఊదాడు. అలారం మ్రోగింది. తన్నుతూ, తోడుతూ ఖైదీలందర్నీ మళ్ళీ సెల్‌ల్లో తోశారు. అన్ని యార్డుల్లోనూ ఖైదీలను లెక్కపెట్టసాగారు. జైలు సిపాయిలు జైల్ చుట్టూ కాపలాకోసం నుంచున్నారు, గార్డ్ డ్యూటీ హవల్దార్‌లు ఆ నల్లని మేఘాలకేసి తుపాకీలు గురిపెట్టారు. అయినా దశదిశలనుండీ ఉరుములూ, మెఱుపులు జైలుమీదికి దండెత్తి వస్తూనే ఉన్నాయి. గ్లాడ్‌సాబ్ నడుముకు బెల్ట్ బిగించాడు, పరుగెత్తుకుంటూవచ్చి మేన్‌గేట్ బాల్కనీలో నుంచున్నాడు. కాని గ్లాడ్‌సాబ్‌ను కూడా లెక్కచేయ కుండా మేఘాలు ముందుకొస్తున్నాయి. గ్లాడ్‌సాబ్ కోపంతో వణికి పోయాడు. రక్తమంతా ముఖంలో పేరుకుందా అన్నంత ఎఱ్ఱగా తయారయిందతని ముఖం కోపంతో. రివాల్వర్ నల్లని మేఘాలకేసి గురిపెట్టి ఓపన్‌ఫైర్ చేశాడు. అయినా మేఘాలకిదేం పట్టినట్టు లేదు. జైల్ కాంపౌండువాల్ మీదకొచ్చి మేఘాలు పిడుగుల్ని కాంపౌండు వాల్‌మీదకు విసరసాగాయి. పిడుగులవర్షంతో వాల్ బీటలువార సాగింది. కదిలి కూలిపోసాగింది. ఇంతలో ఆ నల్లని మేఘాల్లోంచి ఓ ఎఱ్ఱని మేఘం ముందుకొచ్చి ఓ మంటలాంటిదేదో మేన్‌గేట్‌మీదికి విసిరింది. మేన్‌గేట్‌మీద ఎగుర్తున్న పతాకంతోసహా గేట్ కూల సాగింది. వాటినుంచి వస్తున్న పొగతోనూ, మంటతోనూ ఉక్కిరి బిక్కిరి అవసాగాడు గ్లాడ్‌సాబ్. రాతి గోడలక్రింద, మట్టిలో కూరుకు పోసాగాడు.

గ్లాడ్‌సాబ్ భయంతో వణికిపోతూ లేచాడు, ఒళ్ళంతా చెమటలుపట్టేసింది, బ్లాంకెట్‌తోనే ఒళ్ళంతా తుడుచుకుని లేచినుంచు న్నాడు నైట్‌డ్రెస్ బెల్ట్ బిగించి గాలికోసం కిటికీ తెరిచాడు. బయట కుండపోతగా వర్షం కురుస్తోంది ఉరుములూ, మెరుపుల్తో. కిటికీ తెరువ గానే జల్లుకొట్టింది గదిలోకి.

ఆ భయంకర స్వప్నంతో గ్లాడ్‌సాబ్ నిద్ర పూర్తిగా తేలి పోయింది. బెడ్‌రూంలో కూర్చోలేక వరండాలో కొచ్చాడు. సన్న సన్నగా వర్షపు జల్లులు గాలికి ఒంటిమీద పడుతుంటే ఈజీచెయిర్లో కూర్చుని ఊగసాగాడు. మరియమ్‌తో కలిసి ఆల్ప్స్ పర్వతాలదగ్గర కన్న కలను గుర్తుచేసుకోసాగాడు. అదే అతని ఆఖరి కల. ఆ కల గ్యాస్ చేంబర్లో కాలి బూడిదయింది. ఆ తర్వాత సాబ్‌కూ స్వప్నా లకూ సంబంధమే లేకుండాపోయింది. గ్లాడ్‌సాబ్; క్రౌర్యం, పగ నిండిన కళ్ళల్లోకి రావాలంటే కలలకు భయంవేసేది. ఈ పాతికేళ్ళలో మంచిదికానీ, చెడుదికానీ ఏ కలా కూడా పొరపాటుగానైనా అతని దగ్గరికి రాలేకపోయింది. కళ్ళుమూసుకున్న వెంటనే శాంతంగా నిద్ర పట్టేది. ఒకేరోజు ముగ్గురేసి ఖైదీలను ఉరితీసికూడా ఇంటికొచ్చి హాయిగా నిశ్చింతగా నిద్ర పోయేవాడు. కాని ఇవాళ నక్సలైట్‌ను ఉరితీయాలన్న ఆలోచనతోనే అతనికి నిద్రపట్టడంలేదు. ఆలోచిస్తూనే సాబ్ వెనక్కొరిగాడు...

అందమైన నీలాకాశం. ఆకాశంలో భూమి నెమ్మదిగా, గుండ్రంగా తన చుట్టూ తాను తిరుగుతూంది. ఇంతలో ఎక్కణ్ణించో ఓ పెద్ద అంపంలాంటి ఆయుధాన్ని ఝుళిపిస్తూ ఓ నక్సలైట్ ముందు కొచ్చాడు. ఆతడు తిరుగుతున్న పృథ్విని తన మోకాలితో అదిమిపట్టి, ఉత్తర ధృవం వద్ద అంపాన్నుంచి పృథ్విని కోయసాగాడు. ఈరాక్షస కృత్యం అల్లంత దూరాన్నుంచి కనిపెట్టిన గ్లాడ్‌సాబ్ పరుగు పరుగున వచ్చి నక్సలైట్ చేయిపట్టి ఆపుతూ అరిచాడు "ఏయ్ ఖైదీ నం. 842 ఏం చేస్తున్నావు?" అంటూ.

గ్లాడ్‌సాబ్‌ను దూరంగా తోస్తూ నిర్వికారంగా నక్సలైట్ జవాబిచ్చాడు "కనపట్టం లేదూ! ఇన్నాళ్ళవరకూ అన్యాయంగా, అక్రమంగా పూడ్చిపెట్టబడ్డ వాళ్లని పైకి తీస్తున్నాను."

"ఎందుకని?" గ్లాడ్‌సాబ్ ప్రశ్నించాడు.

"ఇవాళ పునరుద్ధాన దినం కదా!" నక్సలైట్ చెప్పాడు.

పునరుద్ధాన దినం! గ్లాడ్‌సాబ్‌ఒళ్లు జలదరించింది. కళ్లు తెరచి చుట్టూ చూశాడు. ప్రకృతి అంతా తృప్తిగా హాయిగా కనిపించింది. దూరంగా చర్చినుంచి మందంగా ఉదాసీనంగా ప్రజల పాపక్షాళనకోసం ప్రార్థన ఆర్గన్ మీద వినిపిస్తుంది. చర్చి శిఖరంకేసి కన్నార్పకుండా చూశాడు గ్లాడ్‌సాబ్. ఏదో నిర్ణయానికొచ్చినట్టు తలాడిస్తూ, డ్రాయింగ్ రూంలో కొస్తూ కూతుర్ని పిలవసాగాడు. "జెనీ, జీన్, స్వీట్ జీన్ లిటిల్ జీన్, జెనీ" గ్లాడ్‌సాబ్ పిలుపుల్తో బంగళా మార్మోగింది. కాని జీన్ జవాబు రాలేదు. "మార్నింగ్ వాక్ కెళ్ళినట్టుంది" అనుకుంటూ స్లిప్పర్లు తొడుక్కుని నైట్‌గౌన్‌తోనే బైటబడ్డాడు.

చర్చి ద్వారం ముందు గ్లాడ్‌సాబ్ క్షణంసేపాగాడు. అపార మైన కరుణా, పశ్చాత్తాపం పేరుకున్న కళ్ళతో చర్చి గోపురం కేసి చూశాడు. గత పాతికేళ్లుగా ప్రభువునీ, ధర్మాన్నీ, చర్చినీ ద్వేషిస్తూ వచ్చాడు. ఇంత శక్తిశాలి ఆ భగవంతుడు దుష్టుల బారి నుండి మరియమ్‌ను రక్షించగలిగాడా? హిట్లర్ గ్యాస్ చేంబర్లో మరియమ్‌తో బాటు గ్లాడ్‌సాబ్ శ్రద్ధాభక్తులుకూడా మాడిపోయాయి.

అయినా గ్లాడ్ ఇవ్వాళ ప్రభువు గుమ్మంలోకి వచ్చాడు. ఈ క్షణంలో ఆ అజ్ఞాత ప్రభువు తప్ప వేరే ఎవరి అధారమూ లేదతనికి. గ్లాడ్‌సాబ్ చర్చి మెట్లెక్కుతుంటే ఫాదర్ కూడా ఆశ్చర్యంవేసింది. ఆర్గన్ వాయించే అబ్బాయి తనకు తెలీకుండానే స్వరం హెచ్చించాడు.

నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ గ్లాడ్‌సాబ్ మదర్ మేరీ స్టాచ్యూ ముందుకొచ్చాడు. మోకరిల్లి నమస్కరించాడు.

వెనక బెంచ్ మీద కూర్చున్న జీన్ తన డాడీ మోకరిల్లడం చూచి కళవళపడింది. జీవితంలో ఎవర్నీ కేర్‌చెయ్యని మొరటువ్యక్తి తన డాడీ కూడా ఎవరికో శరణంటూ మోకరిల్లడం, ఆమెక్కూడా ఆశ్చర్యంగా తోచింది.

గ్లాడ్‌సాబ్ చర్చ్ నుంచి తిరిగొచ్చేసరికి కుక్ డైనింగ్ టేబుల్ మీద బ్రేక్‌ఫాస్ట్ అమర్చడంలో నిమగ్నుడయ్యాడు. కాని గ్లాడ్‌సాబ్‌కు తిండిమీద ఏ మాత్రం ఇష్టం లేదు. డిష్‌ను ముట్టుకోకుండానే, పరకడుపున గ్లాసెడు మంచినీళ్లు తాగి బెడ్‌రూంలో కెళ్ళాడు.

బీరువాలో ఎన్నేళ్ళనాటిదో అతనిదో సివిలియన్ సూట్ అనాథలాగా పడిఉంది. బ్రష్‌తో కాస్త దుమ్ముదులిపి ఆ సూట్ వేసుకున్నాడు. ఆనందంతో కూతుర్ని పిలిచాడు. "జెనీ, జీన్, స్వీట్‌జీన్, లిటిల్ జీన్" అంటూ ఇల్లు దద్దరిల్లేలా అరుస్తూ క్రిందికొచ్చాడు.

డాడీ పిలుపు వినగానే ఓపలేనిదైనా చిన్న పిల్లలాగా ఉత్సాహంగా పరుగెత్తుకొచ్చింది జీన్. తండ్రి ఒంటి మీద సివిలియన్‌సూట్ చూస్తూనే ఆమెకు ఆశ్చర్యంతో పాటు నవ్వొచ్చింది. కొంచెం ఎగతాళి ధ్వనిస్తున్న స్వరంతో "డాడీ మిమ్మల్ని మమ్మీఅన్నా ఎప్పుడన్నా సివిల్ డ్రెస్‌లో చూసిందా?" అంది.

నిజానికి మారాపేరు వినగానే గ్లాడ్‌సాబ్ ముఖంలో సంతోషం వెల్లివిరియాల్సింది. కాని అతడలాగే గంభీరంగా అన్నాడు. "అసలు నన్ను నేనుమాత్రం ఎప్పుడన్నా చూసుకున్నానా? సివిల్‌డ్రెస్‌లో? సరే కాని జీన్ టౌన్‌కొస్తావా?"

"వైనాట్ డాడీ?" అంది జీన్.

గ్లాడ్‌సాబ్ యాక్సిలరేటర్ బలంగా కాలితో నొక్కాడు. జీప్ వేగంగా పరుగెత్తింది. జీప్ మలుపు తిరిగేప్పుడు కొంచెం వేగం తగ్గించి కూతుర్నడిగాడు. "జీన్ బేటా, ఇండియన్ కల్చర్ గురించి నీకు తెలుసు కదూ?"

"తెలుసు డాడీ, ఆంగ్లో ఇండియన్స్‌మే అయినా మనం ఇండియన్స్‌మే కదా! స్కూల్లో ఇండియన్ కల్చర్ సబ్జెక్టు తీసుకున్నాన్నేను."

జీన్ జవాబుతో గ్లాడ్‌సాబ్‌కు పరమానందం కలిగింది. స్టీరింగ్ మీద పట్టు ఏ మాత్రం సడలించకుండానే నోట్‌బుక్, పెన్ కూతురికిస్తూ "నాలుగు హిందూ ధర్మ గ్రంథాల పేర్లు వ్రాయి దీని మీద, మనం పర్చేస్ చేద్దాం" అన్నాడు.

"వై డాడీ?" వ్రాస్తూనే అడిగింది జీన్.

"ఆ నక్సలైట్‌కు చదివేందుకిద్దాం. దట్ బ్లడీ బ్రేవ్ మ్యాన్; ఉరికంబం ఎక్కేముందు కుర్రాడి ధైర్యం లొద్దు" చెప్పాడు.

జీన్ కన్నార్పకుండా తండ్రికేసి కాసేపు చూసింది. కంబం ఎక్కేముందు నక్సలైట్ అధైర్యపడడన్న సంగతి ఎప్పుడో గుర్తించింది. కాని అతణ్ణి ఉరితీయాలన్న ఆలోచ తన తండ్రి ధైర్యం సడలిందని మాత్రం ఆమెకిప్పుడర్థం అయ గ్లాడ్‌సాబ్ తన మూడ్‌లోనే ఉన్నాడు. ఆమెతో మాట్లాడుతున్నా స్వగతమో తెలీకుండా గొణుగుతున్నాడు.

"జీన్, ఆత్మ పునర్జన్మ ఉంటాయో లేదో నాకు తె కాని ఉంటాయేమో, ఉండాల్సిందే. లేకపోతే చూడు మృత్యు అంతా అయిపోయింది. ఖలాస్. అంతా అయిపోయిందన్న భా ఎంత అసహ్యకరం. ఎంత క్రౌర్యమైందంటే అచ్చంగా వైరి తోస్తుంది."

"కాని డాడీ పునర్జన్మ ఉంది," జీన్ తండ్రి మాటలను అందుకుంది.

"వాట్ నాన్సెన్స్" కూతురి మూఢవిశ్వాసం చూసి కున్నాడు గ్లాడ్‌సాబ్. "ఆత్మ, పునర్జన్మ ఆల్ హంబక్. టిక్ కల్పన." వెటకారంగా అన్నాడు.

జీప్ బ్రిడ్జిమీంచి నడుస్తూంది. గాలికి జీన్ జుత్తు ఎ తూంది. జుత్తు సవరించుకుంటూ తన మాటలెలా కరక్టో తం నిశ్చయకంఠంతో వివరించసాగింది: "నో, డాడీ, వెస్ట్‌లో ఇ సైంటిఫిక్ రిసర్చి సాగుతూంది. ఈమధ్య సైంటిస్టులుకూడా పునర్జన్మల కల్పన నిజమేనంటున్నారు."

గ్లాడ్‌సాబ్ ఒక్కసారిగా బ్రేక్ నొక్కాడు. ఫోర్ అక్కడికక్కడే ఆగింది. ఆవేశంతో జీన్ చేతులు తనగుం హత్తుకుంటూ "అయితే జీన్, మారా నాకు మళ్ళీ కలుస్తుందంట మారాని నేను మళ్ళీ చూడగలనా?" అన్నాడు. అతని కళ స్వర్గసుఖాలనుభవిస్తున్న ఆనందం! ఆ ఆనందం పట్టలేక గుండె పగిలిపోతుందా అనిపించింది.

కాని మరుక్షణం ఆ పిచ్చిఆశ, ఆవేశం ఓగాయి. గ్లాడ్ చేతుల పట్టు సడలింది. నిస్సహాయంగా స్టీరింగ్‌వీల్‌మీద తల వెక్కివెక్కి ఏడవసాగాడు.

రాక్షసుడిలాంటివాడని పేరుగాంచిన తన మొరటు డాడీ జ్ఞాపకంతో కుమిలిపోతుంటే పట్టరాని దుఃఖంతో తండ్రి భుజం తలపెట్టి వెక్కి వెక్కి ఏడవసాగింది జీన్.

బ్రిడ్జిక్రింద నది శాంతంగా ప్రవహిస్తోంది. చల్లగాలి వీస్తోంది. తండ్రీకూతుళ్ళు రెండు తీరాలకూ కాకుండా దూరంగా మధ్యలో ్కడో తమ జీవితాలు కాలి నాశనమైనట్టు భావిస్తూ తమపై తామే ి చూపుకుంటున్నారు.

## 12

ఠణ్ ఠణ్...... ఉదయం ఆరుగంటలయింది. ఖైదీల పల తాళాలు తెరువబడ్డాయి. ఖైదీలు కొళాయిల మీదా, స్నానాల పల్లో రద్దీ చేస్తున్నారు.

ఫాసీగేట్‌లో నక్సలైట్ మాత్రం పక్కకు ఒత్తిగిలుతూ గం నిద్రలో గొణుక్కుంటున్నాడు. "ఇక ఒక్కరోజు మాత్రం ిగిలింది. 24 గంటలు." అనుకుంటూ కంబళి ముసుగుతన్నాడు. ంతలో గాలిలో తేలుతూ ఓ శబ్దం విన వచ్చిందతనికి. "వాసాంసి ర్ణాని యథా విహాయ, నవాని గృహ్ణాతి నరోఽపరాణి। తథా శరీరాణి హాయ జీర్ణా, న్యన్యాని సంయాతి నవాని దేహీ". ॥

కొంచెం అనునాసికంగానూ, అఖండంగానూ వినవస్తున్న ంస్కృతశబ్ద ఝంఝాళంతో నక్సలైట్ నిద్ర తేలిక్షోపడంతో అతడు యటకు చూశాడు. కటకటాలముందు వ్యాసపీఠంమీద భగవద్గీత ంచి ఓ బ్రాహ్మణుడు తన ద్రవిడ పద్ధతిలో పఠిస్తున్నాడు. నిద్ర ూర్తిగా తేలిపోవటంతో నక్సలైట్ కంబళి కప్పుకుని కటకటాల గ్గరికొచ్చి "ఇదేమిటని" అడిగాడు.

పండితుడి బదులు వ్రైరిజమాదార్ "బడాసాబ్‌గారి హుకుం. న్ని పురాణాలూ ధర్మ గ్రంథాలూ చదివి మీకు అర్థం చెప్పమ ్నారు." అంటూ తాళం తెరిచి ఓ పెద్ద సంచీ అతని చేతికందిం ాడు. సంచీ కుమ్మరించి చూస్తే గీత, రామాయణాలనుండి సత్య ారాయణవ్రతకథదాకా ఓ పాతిక ధర్మగ్రంథాలు బయటపడ్డాయి.

"బడాసాబ్ స్వయంగా వెళ్ళి తెచ్చారు మీకోసం" అన్నాడు ిమాదారు.

"మీ బడాసాబ్ చాలా ఉదారుడయ్యాడే" అంటూ అన్ని పుస్తకాలు ఒకటిమీదొకటి పేర్చి వాటిమీద పెంకుముక్కల్తో తయా ుచేసుకున్న అష్ట్రే అమర్చాడు. నక్సలైట్ ఈ ప్రవర్తన చూసి ఆత్మ అమరత్వాన్ని ఋజువుచేసే, ఆ నిర్జీవ గ్రంథాలు సిగ్గు డ్డాయి.

"ఏ విధంగా మానవుడు తన పాత వస్త్రాలను విడిచి కొత్త వస్త్రాలను ధరిస్తాడో ఆత్మకూడా అదేవిధంగా పాతదేహాన్ని విడిచి క్రొత్తదేహాన్ని తొడుక్కుంటుంది."

బ్రాహ్మణుడు ఒక్కొక్క శ్లోకమే చదువుతూ అర్థం చెపుతుంటే నక్సలైట్ మాత్రం అతని సంస్కృతోచ్చారానుగుణంగా కదిలే అతని పెదాలకేసీ, ముఖంకేసీ చూస్తూ తాపీగా సిగరెట్ కాల్చుకోసాగాడు.

ఉదయం భోజనం రావటంతో పాపం బ్రాహ్మడికి భోజనం గుర్తొచ్చింది కాబోలు. ఆత్మ అవినాశి అని చెప్పడం చాలనిపించి లేచాడు. హస్తకాన్ని గుడ్డల్తో చుట్టి ఉద్ధరిణితో నీళ్లతీసి చల్లుతూ ఏదో మంత్రం ఆత్మకే వినిపించేలా అర్థమయ్యేలా గొణిగి బయల్దేరాడు. వ్రైరి జమాదారు ముందుకొచ్చి గ్లాడ్‌సాబ్ యిచ్చిన దక్షిణ డబ్బులు జేబులోంచి తీశాడు. ఆ హీనకులంలోని ఆత్మను స్పృశించ కూడదనుకున్నాడేమో, బ్రాహ్మడు పైనుంచే డబ్బులు వేయమని దోసిలి చాపి తీసుకుని వెళ్ళిపోయాడు.

ఆ దశగ్రంధి బ్రాహ్మణుడు మేన్‌గేటునుంచి బయటపడుతుంటే గ్లాడ్‌సాబ్ చూశాడు. ఆత్మ అవినాశి అన్నసంగతి ఆ నక్సలైట్‌కు ఇప్పటికైనా తెలిసి ఉంటుందన్న తృప్తితో టిఫిన్ తీసుకునేందుకు వెళ్ళాడు.

నక్సలైట్‌కసలు భోజనంమీద యిష్టం, ఆపేక్ష ఎప్పుడో సశించింది. అయినా వచ్చిన భోజనాన్ని వాపసు చేసేవాడుకాదు. ఏదో రెండు ముద్దలు తినేసి మిగతాది పిచ్చిఖైదీకి యిచ్చేవాడు. లేదూ కారియర్ రాలేదన్న నెపంతో వ్రైరిజమాదారు తినేసేవాడు. ఇవ్వాళ అంతే! భోజనం రాగానే జమాదార్‌సాబ్! మీ భోజనం వచ్చిందా?" అడిగాడు నక్సలైట్.

జమాదార్ కటకటాల దగ్గరిగావచ్చి కొంచెం సిగ్గుతో అన్నాడు. "ఏం చెయ్యాలి? మా కుర్రాళ్ళున్నారే ఒట్టి సైతాన్‌లంటే నమ్మండి. ఎన్నిసార్లు వాళ్ళతో చెప్పానో నేను సర్కారు మనిషిని. ఖైదీల భోజనం నేను తీసుకోవటం బావుండదని. కాని వింటారా? నేనిటు రాగానే వాళ్ళటో వెళ్తారు. భోజనం తెచ్చే వాళ్ళెవరసలు ? ముద్ద నముల్తూనే మాట్లాడ్డం జమాదారుకు అలవాటు.

కాని ఈ ఒక్కపూట ఇంటిభోజనంరాకపోతే అంతే రేపొద్దున పిల్లలకు మిగులు అన్న వాడి ఊహ, వాడి దారిద్ర్యం బలహీనతా వాడెంత దాచాలనుకున్నా నక్సలైట్‌కి తెలియంది కాదు.

"అసలు కథ పాతదే అనుకోండి. కాని కథనం కొత్తది" తన మామూలు ఊత వాక్యం మొదలెట్టాడు జమాదార్. "అప్పట్లో నేను మా డివిజన్‌తో కలిసి అబిసీనియాలో రోమేలతో యుద్ధం చేస్తున్నాను..." తింటూ తింటూ ఖుషీగా యుద్ధం రోజుల్లో తామెలా ఉపవాసాలు చేసేవారో, చేయాల్సొచ్చేదో వర్ణించ సాగాడు. నక్సలైట్‌కూడా ఇక రెండు గంటలు కాలక్షేపానికి లోటు లేదనుకుంటూ అతని మాటల్లో ఇంట్రెస్టు చూపసాగాడు. ఇంతలో జమాదారు ఒక్కసారిగా నోరు తెరిచాడు. క్రింద పడబోతున్న ముద్దను మళ్ళీ నోట్లోకి ఆదరాబాదరాగా తోస్తూ లేచి నుంచున్నాడు. కాలితోనే నక్సలైట్‌ను లోనికి తోస్తూ "లోపలికి... లోపలికి పద. బేబీ మేంసాబ్ వస్తున్నారు" అన్నాడు రహస్యంగా.

చల్లని గాలితోబాటు కమ్మని సెంట్ గుబాళించింది. ఆ తరువాత నెమ్మదిగా బడాసాబ్ అందమైన గారాల కూతురు, బేబీ మేంసాబ్ అడుగులో అడుగు వేసుకుంటూ వస్తున్నది. ఆమె ఓ చేతిలో పూలంగుత్తి ఇంకో చేతిలో ఏదో డిష్ ఉంది. నక్సలైట్ సెల్ దగ్గరికి వచ్చి క్షణంసేపూరికే నుంచుంది. తరువాత తన చేతిలోని పూలగుత్తి నక్సలైట్ చేతికిస్తూ "పప్పా పర్మిషన్‌తో ఈ రోజు నిన్ను ఆఖరుసారిగా కలుసుకుందామని వచ్చాను" అంది.

"మంచిదే రేపు మీ పప్పా పర్మిషన్ ఇచ్చినా నీవు నన్ను కలుసుకోలేవుకదా?" నవ్వుతూ అన్నాడు నక్సలైట్.

మృత్యువు నీడక్రింద నక్సలైట్ నవ్వు! జీన్ గుండె చీలుస్తోంది. క్షణకాలం ఆమెకేం మాట్లాడాలో తోచలేదు. తను కొన్న పుస్తకాలకేసి చూస్తూ "ఎలా ఉంది నా సెలక్షన్?" అంది ఎట్టకేలకు.

"చాలా బరువుగా ఉంది" అన్నాడు నక్సలైట్.

"అదికాదు. నీకు అర్థమైందనుకుంటాను..."

"ఏమిటి?" అన్నాడు నక్సలైట్.

"ఆత్మ అమరమైనదని"

నక్సలైట్ మాట్లాడలేదు. కావాలనే మాట్లాడలేదు. తన హత్యాపాతకం గ్లాడ్‌సాబ్ నెత్తిన రుద్దడం అతనికిష్టంలేదు. ఆత్మ అమరత్వంవల్ల ఆ పాపం వాళ్లకంటదని ఆ తండ్రీ కూతుళ్ల ఊహ. ఆ సంతృప్తి వాళ్లిద్దరినుంచీ లాక్కొని వాళ్లిద్దర్నీ దుఃఖంలో తోయదలచుకోలేదు నక్సలైట్. అందుకే ఊరుకున్నాడు. కాని జీన్‌కి మాత్రం ఇంకోలా అర్థమైంది. "అయితే ఆత్మ సంగతి ఇతనికీ అర్థమైందన్నమాట" అనుకుంది. మెల్లిగా చేతిలోని డిష్ ముందుకు చాపింది. వెర్రి జమాదారు డిష్‌కేసి ఆబగా చూస్తూ తాళం తీశాడు; నక్సలైట్ డిష్ అందుకుంటూ అడిగాడు ఏమిటిదంటూ.

"ఏదో స్వీట్..." అంది జీన్.

"మంచిదేకదూ...చచ్చేముందు నోరు తీపిచేసుకుని ప్రపంచం వద్ద సెలవు పుచ్చుకోవచ్చు" అంటూ డిష్ పుస్తకాలమీదుంచాడు. జమాదార్ మళ్ళీ తాళం వేశాడు.

చాలా సేపు అలా నిశ్శబ్దంగా గడిపారు. జీన్ కేదో చెప్పాలనున్నట్టుంది, కాని చెప్పుకోలేకపోతోంది. చివరికేదో నిశ్చయం చేసుకున్నట్లుంది. కొంచెం పిరికి స్వరంతో అంది "నీకు నచ్చానా."

"ఓహ్ నువ్వెవరికి నచ్చవుగనక?" నక్సలైటన్నాడు.

"మరైతే నా మాటొకటి వింటావా?"

"ఏమిటది?"

"రేపు...నిన్ను...నువ్వు...ఊహూఁ ఓ పదిహేనురోజులాగవూ నాకోసం. ఆ తరువాత మళ్ళీ జన్మ ఎత్తి నా కడుపున పుట్టు." ఒక్క గుక్కలో అన్న జీన్ మాటలకు ఆశ్చర్యంగా తలెత్తి ఆమెకేసి చూశాడు నక్సలైట్. ఆమె కళ్లల్లో నీళ్లు కదలాడుతున్నాయి.

"నాకు నీలాంటి బాబు కావాలి. నీలాగే శూరుడూ, కవీనూ, కేవలం నాకోసం పదిహేనురోజులాగవూ" ఆమె కంఠంలో అర్థింపు ఉంది.

నక్సలైట్ జీన్‌కేసి చూడలేక తలొంచుకున్నాడు. అతనికేం మాట్లాడాలో తోచలేదు. అతని నిశితమైన తెలివితేటలు జీన్ కోమలమైన భావాలముందు ఎందుకూ పనికి రాకుండా పోయాయి. అతడేమీ మాట్లాడలేకపోయాడు. జీన్‌యే తన రెండుచేతులూ కటకటాల్లోకి పోనిస్తూ అతని తలయెత్తి గద్గదకంఠంతో మళ్ళీ అర్థించింది "నేను నీకు నచ్చాను కదూ! నా కడుపున పుడతావు కదూ!"

నక్సలైట్ గుండె బరువెక్కింది. అతని నోటినుంచి ఒక్క శబ్దంకూడా రాలేదు. కేవలం అలాగేనన్నట్టు తలూపాడు. దానికే సంబరపడిపోతూ జీన్ అతన్ని దగ్గరకు లాక్కుని అతని తలను తన గుండెలకు హత్తుకుంటూ చంటిపాపను ముద్దెట్టుకున్నట్టు గబగబా ముద్దులవర్షం కురిపించసాగింది. "ఎదురు చూస్తానాన్నా నీ కోసం! ఎదురుచూస్తా" నంటూ పిచ్చిగా గొణుక్కోసాగింది.

(సశేషం)



# నిరాకరణ

శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి

అచటి నుండి మనల ఆవలకున్ బహి
ష్కరణ చేయ ఏరి తరము కాని
స్వర్గమొక్క స్మృతుల వరసీమ మాత్రమే
అని వచించి నాడు ఘను డొకండు!

లలిత సువర్ణ చంద్రికల
రాజిలు అంబర వీధి క్రిందుగా
గలగల పారు నిర్ఝరిణి
గట్టున, మెత్తని గడ్డి పాన్పుపై
అలరుల తీయతావులు ది
గంతములన్ వెదజల్లు శీతలా
నిలములలో వసించి కమ
నీయ గళస్రుత చారు గీతికా
ళుల వినుచున్, సఖీమృదు వి
లోల విలాస వినీల చూర్ణకుం
తలముల వ్రేళ్లు జొన్పుచు, సు
ధారస బంధుర పాటలా ధర

మ్ముల ఎలతేనె లానుచు అ
పూర్వ సుఖాంబుధి తేలినట్టి రో
జుల స్మృతు లీయెదన్ కదలు
చో నరకమ్మగు గాని స్వర్గమా?

కాల సాగర భీకరా గాధములను
చిమ్మ చీకట్ల వలలలో చిక్కుపడిన
ఆ ముహూర్తము లిక పునరావృతమ్ము
కావు ఒకపరి కూడ ఈ జీవితాన!

వాని స్మృతులు మటుకు పటుతరమై గుండె
మూల మూలలందు మూగి, దాగి
ఇంత అనువు దొరికె నేని ఒక్కమ్మడి
ఎగసి పడుచు వెతల ఎడద నింపు!

అందుకే నా మనస్సు శూన్యముగ అగుచు
కాళ సాంద్ర తమోమయ గహ్వరముల
నిలువగా కోరుకొందును! వలదు నాకు
గడిచి పోయిన కాలపు జ్ఞప్తు లసలు!

# కనీసం నీవైనా చెప్పు

శ్రీ బండి రాధాకృష్ణ

వీళ్ళను,
ఈ దీనుల్ని ....
దివారాత్రాలు శవాల్లా,
ఆకలి ముళ్ళని తింటూ,
బ్రతుకుతున్నారు చూడు.
వీళ్ళను ఏమంటావు?
జాతి గత చరిత్రలో,
అక్షరాలు చెక్కని గవాక్షాలా?
బుక్కలు వల్లించే దేశంలో,
**దిక్కులేని వాళ్ళా?!**
కనబడుతున్న మనుష్యుల్ని
కనబడని దేవుళ్ళని
దుమ్మెత్తి పోస్తూ,
ఈగల్ని దూరం చేయలేక
మోగనిస్తూ;
బురదలో బుగ్గికావాల్సిన
తామరలా?
బ్రతుకు సత్యం తెలియని
సోమరులా?
ఎవరంటావు ....
నాగరికతపై
గోడకట్టిన పామరు[1]లా,
ఏమీ తెలియని పామరులా?
అకస్మాత్తుగా, తమకోసం వచ్చిన
ఎన్నికల జీపులో, పాలోమని
ఎక్కే ఓటరులా?
ఎవరు వారు?

1. తామర - చర్మవ్యాధి.

డా॥ హెచ్. ఎస్. బ్రహ్మానంద

# భాషావిజ్ఞానం - కావ్యశాస్త్రం*

## 1. భాష - సాహిత్యం

సాహిత్య మంతటా భాషే వుంది.[1] కాని భాషంతా సాహిత్యం కాదు. సాహిత్యం కేవలం భాషేకాదు. ఇంకా చాలా అంశాలు చేరితేనే సాహిత్యమవుతోంది.[2] కాని సాహిత్యం ప్రధానంగా భాషామయం, అది మౌఖికమైనా, లిఖితమైనా, గేయమైనా, పద్యమైనా-గద్యమైనా, ప్రాచీనమైనా, ఆధునికమైనా ప్రతి సాహిత్య రూపమూ భాషాశ్రయం గానే వుంటుంది. కాని ఆ భాష ఒక ప్రత్యేక స్థితి-దశ-వృత్తిలో వాడబడి వుండటం మరువరాని అంశం.[3] ఇంకా కొంత లోతుగా ఆలోచిస్తే - సాహిత్యం లేని భాష ఉండవచ్చు. ఉదాహరణకు కంప్యూటర్ తయారుచేసే 'సంకేతాత్మక భాషల్లో' సాహిత్యాంశ ఉండాల్సిన అవసరంలేదు. కాని సాహిత్యంలోమటుకు 'భాష' (మానవులు వాడేది) ఉండక తప్పదు.

పైన ఆ భాష ఒక ప్రత్యేకస్థితిలో వాడబడ్డప్పుడే సాహిత్యం అవుతోందని చెప్పడం జరిగింది. కాని ఆ 'స్థితి' ఏమిటని చెప్పటమే చాలా క్లిష్టమైన సమస్య. అసలు మనం ఏం మాట్లాడినా కేవలం అభిప్రాయ నివేదనం కోసమే కాకుండా దానికి మించిన ఏవో విలువలను, భావగాఢతలను ప్రదర్శించడంకోసంకూడా మాట్లాడుతూ వుంటాం. ఇది చాలా నగ్నమైన సత్యం. అందుకే మనం ఏవస్తువునీ, ఆకారాన్ని చూసినా-కడకు అది ఏయంత్రమో-రాకెట్టో అయినా సరే-అందులోంచి ఏదో ఒక భావాన్ని పిండటానికి ప్రయత్నిస్తూ వుంటాం.** అలాగే మనం ఎంత ఆలంకారికాంశ లేకుండా మాట్లాడాలని రాయాలని ప్రయత్నించినా అసాధ్యమే. ఏ సాంకేతికతతో, ప్రతీకాత్మకతతో, ధ్వనో, అనుమానమో, వక్రోక్తో, ఉపమో, ఉత్ప్రేక్షో-ఏవీ లేకుండా అసలు ఏ మానవుడూ భాషను వ్యవహరించడని అర్థం. దీన్నిబట్టి 'భాష' కేవలం పదాల అనుసంధానం కాదన్న మాట. ఏవో 'పదాల్ని' ఏవో 'వరస'లలో అమర్చడం అని గుర్తించాలన్నమాట.[4] ఆ వరసలోనే 'సాహిత్యం' పుడుతోందన్నమాట. ఆ వరస నెరిగినవాణ్ణి కవి - రచయిత - అని అంటున్నాం. వాడు ఆ వరసని మామూలు రోజూ వాడే పదాల-వ్యాకరణాంశాల-వరసల కన్నా తప్పకుండా భిన్నంగానే కూరుస్తున్నాడన్నమాట.[5] అది వివక్షాత్మకం.[6] అంటే సాహిత్యాన్ని మానవుడే కావాలని కోరి సృజిస్తున్నాడని అర్థం. కవే కాదు. కవి చుట్టూవున్న సమాజంలోను స్పష్టత, గాఢత, వైయక్తికత, ధార-కల్గి మాట్లాడే ఎవడిలోనైన భాషలోని ఈ 'సాహిత్యాత్మ' కనిపిస్తూనే వుంటుంది. కాబట్టి సాహిత్యానికి దూరంగా జరిగి పోవాలని మనిషి కోరుకుని-చేయాలి. తప్ప-సహజంగా మనిషిలో-భాషలో-భావ ప్రతీకాత్మకత-నిసర్గమైన ధర్మమని అర్థం. అదే వివక్ష. అంచేత భాషలో సాహిత్యాంశ సహజంగా ఉందని అర్థం.[7]

కానీ సాహిత్యంలో ప్రవేశించేటప్పటికి భాష తనకు పార్యంతిక ఫలితాన్ని ఒకదాన్ని ఎంచుకుని పుడుతోంది. అది భాషాభివ్యక్తి తప్ప వస్తునివేదనంకాదు. వస్తునివేదనం కాకపోతే రచనలో సత్యాన్ని-విలువలను - ధర్మాల్ని వెదకటం కుదరని పని అని అనుకోవాల్సిన పనిలేదు. పురాణాల్లో చరిత్రవుంది. కాని 'స్టోరీ' చెప్పటం కాదు పురాణ ధ్యేయం. కావ్యంలో కథవుంది. కాని కథ మాత్రమే కాదు దాని దృష్టి. అలాగే జానపద గేయంలో వాస్తవికత వుంది. కాని గేయం నిర్ద్వంద్వంగా రసాత్మకమే. అంటే అక్కడ చెప్పబడిన వస్తువు నాధారంగా కాకుండా భావాన్ని (అనుభవాన్ని) ఆధారంగా గేయం పుడుతోందని అర్థం. అలాగే ఏ యుగంలోనైనా ఎవరైనా కేవలం వస్తువు-విషయం-నీతి మొదలైన వీటి కోసం సాహిత్యాన్ని చదవరు. అందులో నిస్సందేహంగా నాదాత్మకమైన భావం ఒకటి ఉంటోంది. దాన్ని అందుకోవడంకోసమే సాహిత్యాన్ని చదవటం. అంచేత సాహిత్యంలో భాష ఉన్నా అది రసాత్మకం. అదే పైన పేర్కొన్న విలక్షణస్థితి.

## 2. ప్రాచీనుల దృష్టి

పాశ్చాత్యదేశాల్లో కూడా (ఇండియాలోలాగే) సాహిత్యాన్ని భాషామయంగా చూడటం ఉండేది. అంటే మనదేశంలో ఎలాగయితే ఆలంకారికులు కావ్యవాక్కు - వ్యవహారభాషకన్నా భిన్నంగా ఉంటోందని, కావ్య 'వాఙ్నిర్మాణం' విలక్షణమని - ప్రత్యేకమని - అందులో అక్షరం మొదలు వాక్యసమూహందాకా అన్నీ శిల్పించబడ్డవేనని - వాటికి ప్రత్యేకమైన వివక్షాభావ నేపథ్యాలున్నాయని భావించారో[8], అలాగే పాశ్చాత్యుల్లోకూడా భావించారు. కవి ఎవ

నంపే - ఎవడు శ్రోతను ఆకట్టుకొనేలా - ప్రభావితం చేసేలా - అలంకారికమైన రసమయోక్తిని సృజిస్తాడో వాడు - అని వారూ భావించారు. అలా 'కావ్యశాస్త్రం'[9] వక్తృత్వశాస్త్రం (రెటరిక్స్)లో భాగంగా పాశ్చాత్యభూముల్లో పుట్టింది. వైయాకరణులు, మతబోధ కులు - వక్తృత్వశాస్త్రాన్ని పరిరక్షిస్తూ వచ్చినవాళ్ళు. ఒక రాజ కీయవాదికి, న్యాయవాదికి భాష ఎంత ప్రధాన సాధనమో - అలాగే కవికి కూడా - అని ఆనాడు అందరూ భావించేవారు. కవి అంటే 'వాక్‌స్రష్ట'[10] అన్నది ఆనాటి 'కవి' నిర్వచనం. హోమర్ శబ్దజాలంలోని గీతాత్మకత, సంక్షిప్తత - వీని కారణంగానే పాఠ కుడు ఆనాటికీ ఈనాటికీ కూడా మారకుండా నిలిచిన భాషా నిత్య నూత్నత్వాన్ని దర్శించగలుగుతున్నాడు. ఇలియడ్‌ని తరతరాలుగా భాష్యం చెపుతూ వ్యాకరణం నేర్పించిన ప్రాచీన వైయాకరణు లందరూ భాషా విజ్ఞానులే. వారు ప్రధానంగా చేస్తూవచ్చిన పని వాక్ శిల్పులు, కవులు ఎలా భాషా సామగ్రిని అనుసంధించి, స్థితిని కల్పించి ఉదాత్తరమ్యహర్మ్యంగా కవితను నిర్మించారో, విద్యార్థులకు చూపించడం. 'ఇయాన్'లో ప్లాటో వాపించినట్టుగా కవిలో అతీంద్రి యమైన ఒక అద్భుతశక్తి కావ్యరచనావేళలో పనిచేస్తూ ఉండొచ్చు. అంతమాత్రాన హేతుమంతంగా కావ్యశరీరాన్ని కోసి చూపడానికి వీలు లేదని కాదు. ఆ హేతువంతా కవి వక్తృత్వ లక్షణంలోనే ఉంది[11]. దాన్ని తార్కికంగా ప్రదర్శించి చూపడానికి వీలుంది. సాంప్రదాయికమైన కావ్యనాటక విమర్శకులు ఆ కాలాల్లోను ఒక మౌలికమైన ప్రశ్నను - (కళా భాషా స్వభావసంబంధి) – వేసుకొని సమాధానం చెప్పడానికి ప్రయత్నించారు. ప్లాటో చెప్పిన అనుకరణ (మైమెసిస్)[12] వాదానికీ, అరిస్టాటిల్ చెప్పిన క్షాళన (కెథార్సిస్)[13] వాదానికీ నడుమఉన్న సంఘర్షణలోనే ఈ మౌలికాంశం ప్రతిబింబిత మవుతోంది. ప్లాటో భాషలోని గీతాత్మకత నాధారంగా పుట్టే అనుకరణధర్మాన్ని దర్శించాడు.[14] శబ్దం కల్పనం, అంటే కృత్రిమం. (ఎప్పుడో తర్వాత ఫ్రాయిడ్ చెప్పిన) 'వాస్తవికతా' మాత్రాన్ని దర్శించడానికి ఈ కల్పిత శబ్దం అసమర్థం. అంచేత కల్పనాత్మకతే-జగత్తును-సత్యాత్మకంగా ప్రదర్శిస్తున్నది. అందుకే వ్యావహారిక హేతుసత్యంకన్నా అనుభవముఖమైన కావ్యసత్యం భిన్న మని ప్లాటో భావించాడు. ఈ అంశం భాషాతత్త్వ దృష్ట్యా చాలా ప్రధానమైంది. అరిస్టాటిల్ ప్రతిపాదన శబ్దార్థాలు 'రూపం' (ఫార మ్‌లో) పొందే అన్వయాన్ని (సింథెసిస్) ఆధారంగా పుట్టింది. అంటే శబ్దమూ - దాని వ్యావహారికార్థమూ భిన్నం కావని - రూపమే వస్తువు (కంటెంట్) అని అరిస్టాటిల్ సిద్ధాంతం.[15] అయినా 'పొయెటిక్స్' అనే గ్రంథంలోనూ (ఇయాక్, రిపబ్లిక్‌లలో కూడా) భాష ఎలా ప్రవర్తిస్తుందన్న విషయంగా చాలా మీమాంస చేయ బడింది.[16] ఆ మీమాంసలో చేయబడ్డ ప్రతిపాదనల్లో చాలా వాటికి ఈనాటికీ సవరణలు లేవు. పొయెటిక్స్ - ఆనాడు వ్యాకరణంలోను, వక్తృత్వ శాస్త్రంలోను భాగం అన్నంతవరకు వ్యావహారికమైన విషయమేతప్ప-శాస్త్రీయం కాదు. సిసరో, క్వింటిలియన్‌ల ద్వారంగా మధ్య యుగాల్లో కూడా పొయెటిక్‌ని ఇలాగే వ్యాకరణాంతర్భావగానే భావిస్తూ వచ్చారు.[17] ఉదాహరణకు హ్యూస్ డి సెయింట్ విక్టర్ రాసిన 'డైడాస్కాలియన్' (ది ఆర్ట్ ఆఫ్ రీడింగ్) ఆ గ్రంథ ప్రయోజనం మనిషిని వక్తృత్వ లక్షణాల లోతులు ఎరిగినవానిగా చెయ్యటం.

ఈ పద్ధతి సాధించేదేమిటంటే-ఒక క్రమపద్ధతికి లొంగిన భాషా వివేచనను అలవాటుచెయ్యడం. ఈ పద్ధతితో చదివిన విద్యార్థికి వ్యాకరణం-ఛందస్సు - అలంకారం - రసం - ఈ తత్త్వాలన్నీ కొట్టిన పిండిగా అబ్బేవి. ఉద్దండులైన పండితులు తయారయ్యేవారు. ఉదా హరణకు 12-17 శతాబ్దుల నడుమ తయారైన పండితులంతా శబ్దాల పొరల విషయంగా చక్కని అవగాహన ఉన్నవారే రసానుగుణంగా శబ్దం (వ్యాసం) ఎలా తీర్చబడుతుందో ఎరిగినవారే. ఈనాటి పండితులకు - మనకు - అంతటి అవగాహన, అనుభవం ఉన్నాయని చెప్పకోలేం. స్కొలాస్టిక్ రినైజాన్ వ్యాసకర్తలు, రచయితలు అందరూ కవి అంటే వాగ్విన్యాస వైఖరీ నిపుణుడనే గుర్తించారు.[18] పోర్టురాయల్ వైయాకరణులు (17 వ. శ.) కూడా ఈ సంప్ర దాయంలోంచి పుట్టినవారే. (ఈనాడు ఛాంస్కీ ప్రభృతులు పరివర్తన సిద్ధాంతరీత్యా ప్రతిపాదిస్తున్న విశ్వజనీన భాషాలక్షణ ప్రథమ సిద్ధాంతులు వీరే.)[19]

## 3. వి స్మృ తి

18 వ శతాబ్దంలో సాహిత్యభాషా - విషయం ఎందుకో విస్మృతినందింది. *** దీనికి కారణాలు కొంత చర్చించాలి. ఇది చాలామది పండితులు గుర్తించని అంశం. ఈ విస్మృతికి కారణాలు చాలా లోతుల్లో ఉన్నాయి. ఫలితాలు చాలా దూరం ప్రసరించాయి కూడా. మొత్తం 18 వ శతాబ్ది సాహిత్యాధ్యయనానికి ఆశించిన ఫలితం 'వ్యాఖ్యానం' నవ్య సంప్రదాయవాదానికి ప్రధానమైన భాషా లక్షణం 'స్పష్టత' 'నైతిక దృక్పథం' అనాటి సాహిత్యధర్మం. అంతర్జాతీయమైన ఒకానొక సఖ్యత, పౌరస్వభావ సాధన ఆనాటి పండితుడిధ్యేయం. అంచేత రచనను భాషాసృష్టిగా కాకుండా సత్య ధర్మ ప్రతిపాదకంగా పరిశీలించాలన్న దృక్పథం పొటమరించింది.

(షేక్స్పియర్ మీద శామ్యూల్ జాన్‌సన్ చేసిన విమర్శ ఈ నైతిక దృష్ట్యా చేసిందే. ఆధునిక ధోరణి ఇది కాదనటానికి లీవిస్ జాన్‌సన్ మీద చేసిన విమర్శ చూసుకోవచ్చు)

ఈ శతాబ్దంలోనే సర్ విలియం జోన్స్ (1786) సంస్కృత-గ్రీకు-లాటిన్ భాషల పరస్పర సగోత్రత మీద ఒక పరిశోధనవ్యాసం రాశాడు. దానితో చారిత్రక భాషా విజ్ఞానానికి బీజాలు పడ్డాయి. 1820 ప్రాంతానికే ఈనాడు భాషా విజ్ఞానంలో ప్రధానంగా గుర్తింపబడ్డ అంశాలన్నీ అంశమాత్రంగానైనా దర్శించబడ్డాయి. అగస్ట్ విల్‌హెల్మ్ వాన్ ష్లెగెల్ ఆనాటి చారిత్రక భాషా పరిశోధకుల్లో అగ్రగణ్యుడు. ఆయన సాహిత్య విమర్శకుడుగా కూడా అఖండుడే. ఆయనే మొదటిసారిగా రచనలో జీవాత్మకమైన అఖండావయవ సంబంధం-సన్నివేశం ఉంటాయన్న విషయాన్ని ప్రతిపాదించాడు. కాల్రిడ్జ్ కోద్యమం మీద ఈ అభిప్రాయ ప్రభావం అనంతంగా పడింది. ఆయన గొప్ప సంస్కృత భాషావేత్త కూడా.

## 4. కవి దర్శనం

19వ శతాబ్దంలోనే ఈనాటిదిగా చెప్పదగిన భాషావిజ్ఞాన ఆరంభదశ మొదలైంది. పరిశోధనలో సాంకేతికత నిర్దిష్టమైన భాషాతత్త్వ దృక్పథం, సాహిత్య పరిశీలన- ఇవి మూడూ ఒకదాన్ని ఒకటి వదలకుండా సాగుతూ వచ్చిన (వస్తున్న) భాషా విజ్ఞాన వికాస లక్షణాలు. అక్కడక్కడా పైమూడూ తాత్కాలికంగా ఒకదాన్ని మరోటి వదిలివేసినట్టు కనిపించినా- వాటి సన్నికర్ష మాత్రం అనివార్యంగా సాగుతూనే వస్తోంది. వీటి మూలాలు ఏనాటివో అయిన సాహిత్య వక్తృత్వ కావ్యశాస్త్రాలలో ఉండటమే ఈ సయోధ్యకు హేతువు.

కాలరిడ్జ్‌లోనే ఈ శతాబ్దంలోని భాషా సాహిత్య పరిశోధనలోకి చొచ్చుకురాదగ్గ ఆధునిక భావజాల సంపద కనిపిస్తోంది ఆయన రాసిన 'బయోగ్రాఫియా లిటరేరియా' (అధ్యాయాలు 15-22)లో ఆయనకున్న కావ్య భాషానుభవశీలత సూక్ష్మావగాహన - సూత్రీకరణ పాండిత్యం అసాధారణమైనవి. బహుశా ఈనాటికీ అలాంటి చైతన్యవంతమైన సూత్రరూప నిర్ణయాలు చేసిన వాళ్ళు లేరేమో !

కాలరిడ్జ్ ఇలా అన్నాడు.

"భాష మానవుడి మనసుకున్న ఆయుధాగారం. ఒకవైపు గత ఘన విజయాల్ని, మరోవైపు భవిష్యత్ మహా విజయాయుధాల్ని రెంటినీ దాచుకొనుంటుంది."

ఈ మాటల్లో ఆయన మీద కాంట్, షెల్లింగ్‌ల ప్రభావముద్ర చూడవచ్చు. వారిననుసరించి భాష కేవలం అద్దంలాగా ప్రతిబింబన ధర్మాన్ని మాత్రమే కాకుండా ఒక విలక్షణతను కల్గింది. భాష ఒక ప్రగాఢ కాంతికిరణం.[20] అనుభవానికి ఒక ఆకారాన్ని కల్పించి దానికి స్వరూపస్థితుల్ని చేకూరుస్తోంది. మనం ప్రపంచాన్నే శబ్దీకరిస్తున్నాం.[21] అందులోనూ కవి మరింత గాఢంగా దృఢంగా భావాన్ని కేంద్రీకరించి చెప్పగలడు.' ఈ దృక్పథంతోనే కాలరిడ్జ్, షేక్స్పియర్, వర్డ్స్‌వర్త్‌ల పైన విమర్శ చేశాడు. ఉదాహరణకు 'బయోగ్రాఫియా లిటరేరియా' (అధ్యాయం 18)లో ఛందస్సు పైన ఆయన చెప్పిన విమర్శ చూడవచ్చు:

"ఛందస్సు సామాన్యానుభవాల్ని, రసభావాన్ని స్పష్టంగా అనుగుణంగా పఠితలో వృద్ధి పొందించగలుగుతుంది. ఎలాగంటే- కావ్య పఠన సమయంలో గతి (ఛందం) కల్గించే అనుక్షణ 'ఆశ్చర్య' భావం ఒకటుంటుంది. ఆ ఆతురత విచికిత్సాముఖంగా పునః పునః అభివృద్ధమౌతూ వుంటుంది. అది ఎంత సూక్ష్మంగా, అసంలక్ష్య క్రమంగా[22] ఉంటుందంటే దాని ప్రభావం సాముదాయికంగా గుర్తించగలుగుతామే తప్ప దాని క్రమాన్ని గుర్తుంచుకోవడం అసంభవం. అసలది మనమీద ప్రభావాన్ని చూపుతోందన్న విషయం మన అవగాహనలో వుండదు. డెట్టాల్ వాసనతోటి వాతావరణంలాగా; ఉద్వేగంతో మాట్లాడుతున్నపుడు మరింత చురుకుదనాన్ని కల్గించే ద్రాక్షాసవంలాగా పనిచేస్తుంది.[23]

పై వాక్యాలు అర్థవంతమైనవి కాబట్టి పునరాలోచించాలి. ముఖ్యంగా 'విచికిత్స' (యాంటిసిపేషన్) అని ఆయన గుర్తించిన అంశాన్ని ఈనాడు సెమాంటిక్స్‌లోనూ, ఊనికను గురించి చేస్తున్న కాంట్రాస్టివ్ స్టడీలోనూ, మానసిక జీవ భాషా విజ్ఞాన రంగాల్లోనూ ఎంతగానో గుర్తిస్తున్నారు. వర్డ్స్‌వర్త్ ప్రకృతిని ఎలా వర్ణించారో చూస్తే- అది ప్రతిమా (ఇమేజ్) ముఖంగా చెప్పబడినా అందులో ఏమాత్రం శాస్త్రీయ లక్షణం తగ్గలేదు. కవితారూప కవిత్వ నిర్వచనం ఇది:

"ఒక స్వచ్ఛ జలమయ సరస్సులో చుట్టూఉన్న పచ్చని ప్రకృతి ఎలా ప్రతిబింబిస్తుందో అలాగే వాస్తవికత నుండి మార్దవం - కాంతి అనే గుణాలద్వారా 'ప్రతిమ' భిన్నంగా ఉంటోంది."[24]

కాలరిడ్జ్ ఈ విచికిత్సలోని గాఢత, శాశ్వతత్వం- వీటి నాధారంగా ఈ భావనాసంపదను 'సెక్యులేటివ్ ఇన్స్ట్రుమెంట్స్' అన్నాడు. సాహిత్య పరిభాష ఒక విధమైన స్థిరత్వాన్ని కల్గింది. కారణం వర్డ్స్‌వర్త్ చెప్పినట్లుగా అది మనఃస్ఫోటనంవల్ల పుట్టింది కావడం.[25] కేవలం అది, వెర్బల్ కాదు.

కాలరిడ్జ్ ఇన్ని విషయాల్ని తన కావ్యవాగ్ దర్శనంలో చెప్పినా దాని ఫలితం 19వ శ. లో వెనువెంటనే కనిపించలేదు-

ఎక్కడో బోదిలేర్ రాసిన ఒకటి రెండు విమర్శల్లో తప్ప, బోదిలేర్ కూడా సామూహికంగా కళకు సంబంధించి చెప్పిన అంశాలే తప్ప సాహిత్యానికి విలక్షణంగా చెప్పినవి కావు. అది యుగధర్మం. ఆ కళాకారుడి వైయక్తిక ప్రతిభా స్వభావం కూడా కొంత కారణమై వుండాలి. న్యూమన్ పుట్టేదాకా కాలరిడ్జ్‌కి వారసుడే రాలేదని చెప్పాలి. (19 వ శతాబ్దంలో సాహిత్యాధ్యయనాన్ని రెండు శక్తులు నియమించాయి: (1) నైతిక దృక్పథం (2) చారిత్రక దృష్టి. జాన్సన్‌నుండి మ్యాథ్యూఆర్నాల్డ్ - బీవిస్‌లదాకా నైతికదృష్టి, సెయింట్ బోవె నుండి - టైన్ - ఎడ్మండ్‌విల్సన్ దాకా చారిత్రకత, చారిత్రాత్మక భాషావిజ్ఞానం కూడా ఇండో-యూరోపియన్ భాషల జన్యజనకతల్ని నిర్మాణాన్ని గురించి చెప్పటంలో సాహిత్య పరిణామానికి సమాంతరంగానే ఎదిగింది.[26] కాని వాని మధ్య పరస్పర సంపర్కం తక్కువ. ఉన్నా చాలా స్థూలమైందే.

ఇన్ని పరిణామాల్లోనూ కాలరిడ్జ్ ఈ శతాబ్దిలోకి చొచ్చుకు రాగలిగాడు.

## 5. శాస్త్ర సంధి

ఈ శతాబ్దంలో వచ్చిన భాషావిప్లవం (లాంగ్వేజ్ రెవల్యూషన్) చాలా ఆకారాలనుంచి స్ఫూర్తిని పొందింది. అలాంటి వాటిలో ఆధునిక ప్రతీకాతర్కం ఒకటి. హిల్బర్ట్, ఫ్రీజ్, రసెల్ మొదలైన వారి రచనల్లో తొలిసారిగా గణితతర్క బీజాలు పడ్డాయి. ప్రతీకాతర్కం దానినుంచి పుట్టింది, ఆ తర్కం ఒక భాషలాంటిదనీ, దానికొక ప్రత్యేక భాషప్రకటన విధానం ఉందనీ, మానవభాషలో లాగానే ఆ భాషలోనూ సందిగ్ధతలు, శక్తులు ఉన్నాయని గుర్తించటం జరిగింది. కాసియర్ తన పరిశోధనలో మానవుడి అభివ్యక్తీకరణం అనివార్యంగా ప్రతీకాత్మకమేననీ (ఈ అంశం ఏనాడో వికో, కాలరిడ్జ్‌లు గుర్తించినదే.) గుర్తించడం అటు ప్రతీకాతర్కంలోనూ-ఇటు గణిత తర్కంలోనూ - ఎంతో గుర్తింపును సంపాదించింది. ప్రభావాన్ని చూపించి. మరోవైపు మనోవిశ్లేషణోద్యమం భాషోపయోగ పద్ధతుల్ని, అలవాట్లని - మానవుడి చైతన్యాన్ని గుర్తించే నివేదనలుగా సిద్ధాంతీకరించింది. మనో జీవితంలోని న్యూరో-ఫిజియాలజీని గురించి మనోవిశ్లేషణవాదులు చెప్పిన చాలా విషయాల్ని ఇంతవరకు రుజువపరచిన వారూ లేరు, ఖండించిన వారూ లేరు. పిల్లల్లో భాష ఎలా పరిణమిస్తోందన్న విషయకంగా (మానసిక భౌతిక ప్రేరణ దాన్ని అనుసరిస్తూ) శాస్త్రీయపద్ధతిలో పియాజె చేసిన పరిశోధన ఆ కోవకు చెందిందే.[7]

ఈ ఆలోచనా మార్గాలన్నీ తత్త్వ దర్శనాల్లోని దృక్పథాలకు సమాంతరంగానే పుట్టాయి. విట్‌జన్‌స్టీన్ తత్త్వశాస్త్రాన్ని వాక్ చికిత్స (స్పీచ్‌థెరపీ)గా భావించటానికి, తాత్త్వికుడి సహజమైన ప్రధాన ధ్యేయం మానవులు వాక్యాల్ని ఎలా వాడుతారో గుర్తించడమేనని 'ఇన్వెస్టిగేషన్స్' అనే గ్రంథంలో ఆయన అనటానికి వెనుక 'మ్యుటేషన్ ఆఫ్ యాటిట్యూడ్' అన్న సూత్రం దాగివుంది. అంతకు పూర్వమున్న హెగెల్ ప్రభృతుల ఆధ్యాత్మిక భావవాద భాషా దృక్పథం మీద 19 వ శతాబ్దంలో వచ్చిన విప్లవమే! ఈ భాషా వ్యాపార పరిశీలనదృష్టి - అర్థాన్ని పరిశీలించడం అంటే - భాషలో సందర్భానికి ఒదిగిన వ్యాకరణ నిర్మాణాన్ని పరిశీలించడమే. అంటే భాషకున్న సాధనత్వ విచారణ అన్నమాట. ఎలా భాషద్వారా మాట్లాడుతూ (వాదిస్తూ), భావానుభవాన్ని పొందుతున్నాడన్నదే భాషాతత్త్వ దర్శనంలో ప్రధానాంశంగా ఆనాడు భావించబడ్డది. 1914 తర్వాత ప్రజల్లో మానవతని గురించి, విలువల్ని గురించి పూర్తిగా గౌరవం, నమ్మకంపోయాయి. భాషలో మనిషికి పూర్తిగావిశ్వాసం పోయింది.[28] దాని ఫలితమే భాషాతత్త్వ దర్శనంలో ఇలా ప్రతిబింబించి వుండాలి. విట్‌జన్‌స్టీన్, కాఫ్కా, రిల్కే రచనలు దాదా ఉద్యమంలోని రచనలు- అన్నీ నిశ్శబ్దాన్వేషణ-భాషా పరిమితులు-మానవుని ఆలోచనకున్న అనంత్యం-వీటిని గురించే తపించాయి. అనుభవం వాగతీతమైన అగాధమని (వాయిడ్స్ ఆఫ్ సైలెన్స్)[29] వెబెర్న్, బెకెట్‌లలో కనిపించే అభిప్రాయం. ఈ విచారధారే, తార్కికులు, రచయితలు, కళాకారులు భాషని తమ తమ పృథక్ చైతన్యాలతో చూడటం మొదలుపెట్టారు.[30]

## 6. అభిజ్ఞానాంకురం

సరిగ్గా ఈ దశనుంచే మళ్ళీ భాషావిజ్ఞాన కావ్య శాస్త్రాలమధ్య సంపర్కం మొదలైంది.

ఎలా మొదలయిందోకూడా స్పష్టంగా తెలుస్తున్న విషయమే. 1915లో మాస్కోలో కొంతమంది విద్యార్థులు 'మాస్కో లింగ్విస్టిక్ సర్కిల్'అన్న సంస్థని ప్రారంభించారు. 1916లో కొంతమంది యువక భాషా పరిశోధకులు, సాహిత్య చరిత్రకారులు కలిసి 'పీటర్స్‌బర్గ్ సొసైటీ ఫర్ ది స్టడీ ఆఫ్ పొయెటిక్ లాంగ్వేజ్'ని ప్రారంభించారు. ఈ సంస్థలో దిగ్గంతులైన కవులు, సాంకేతిక భాషావిజ్ఞానులు, రష్యా భాషాసాహిత్య చరిత్రకారులు ఉండేవారు. రోమన్ యాకబ్‌సన్ 'ఖ్లెబ్‌నికోవ్‌స్ పొయెటిక్ లాంగ్వేజ్' అన్న వ్యాసాన్ని ఒక సభలో చదివినపుడు సుప్రసిద్ధకవి మయకోవ్‌స్కీకూడా ఉన్నాడు, ఈ వ్యాసంలోనే తర్వాతి సంవత్సరాల్లో వృద్ధిపొందిన (భాషావిజ్ఞాన

దృష్ట్యా కావ్యభాషను పరిశీలించే) సంప్రదాయాలన్నింటికీ మూల బీజాలు ఉన్నాయి. గుమిలేవ్, అఖ్మతోవా - మొదలైన సుప్రసిద్ధ కవులందరూ ఆ రోజుల్లో కావ్య 'వాక్యాన్ని' (సింటాక్స్) గురించి పీటర్స్‌బర్గ్‌లో విక్టర్ ష్క్లోవ్‌స్కీ, బోరిస్ ఐఖిన్‌బామ్ మొదలైన వారు చేసిన పరిశీలనలన్నింటితోనూ పరిచయమున్నవారే. 1916లో 'స్టడీస్ ఇన్ ది థీరీ ఆఫ్ పొయెటిక్ లాంగ్వేజ్' అన్న గ్రంథమే ప్రచురించబడింది. ఆ గ్రంథంలోని కొన్ని శీర్షికల్ని పరిశీలిస్తే నిత్య వ్యవహార-కావ్యభాషల్లోని ధ్వనుల్ని గురించి (ఎల్. జాకుబిన్స్కీ) అర్థ వ్యంజకత గురించి (ఐఖిన్‌బామ్)-వాళ్లు మొదలుపెట్టిన వివేచన ఈనాడే మళ్ళీ సంపూర్ణంగా గుర్తింపబడిందని ఒప్పుకోవాలి.

యాకబ్ సన్‌కి స్లేవనిక్ భాషాచరిత్ర తెలియటం-కావ్య శాస్త్రాలతో ఆయనకున్న సమగ్ర పరిచయం, కొత్తగా పుడుతున్న భాషా సిద్ధాంతాలు (ససూర్ మొదలిడినవి) తెలియడం-ఈకారణాల వల్ల 'ఫార్మలిస్ట్/లింగ్విస్టిక్ పొయెటిక్ అప్రోచ్' (నిర్మాణ కావ్యభాషా విజ్ఞానం)కి పునాదులు తీయగలిగాడు. ఆయన 1923లో ప్రచురించిన 'జెక్ పద్యం' మీద విమర్శచూస్తే మొదటిసారిగా ఆధునిక అర్థ/ సాంకేత విజ్ఞాన (సెమాంటిక్/సెమీసియొ లాజికల్) ప్రమాణాలను ఆధారంగా ఛందోరీతుల నిర్మాణాన్ని-ప్రభావాన్ని తులనాత్మకంగా పరిశీలించే పద్ధతి ఒకటి ఆవిష్కరించబడటం చూస్తాం. ఇలా ఆయన జెక్ భాషని విమర్శకు ఎన్నుకోవటం యాదృచ్ఛికంగా జరిగిందికాదు. మార్క్సిస్టులు క్రమంగా రూపనిర్మాణ (ఫార్మలిజం) వాదాన్ని విమర్శిస్తూ వచ్చారు.[31] రానురాను తిరస్కరించారుకూడా. యాకబ్ సన్ రష్యాను వదలి వెళ్ళిపోయాడు. దాంతో 'ప్రాగ్' కావ్యభాషా విజ్ఞానానికి కేంద్రమయింది. అక్కడ 'లింగ్విస్టిక్ స్కూల్ ఆఫ్ ప్రాగ్' ఎప్పుడేర్పడిందన్న విషయకంగా కొంత తగాదావుంది. కొంతమంది జెక్ పండితులు 1911 లోనే మొదలైందంటారు. ఆ సంస్థ మొదటి సమావేశం 1926 అక్టోబర్‌లో జరిగిన దనటంమాత్రం వాస్తవం. అప్పటినుంచీ ఈ సంస్థనుంచే కావ్యభాషా విజ్ఞాన వికాసం జరుగు తోంది. రోమన్ యాకబ్‌సన్, ఎన్. ఎస్ ట్రుబెట్‌స్కాయ్, జె. ముక రోవ్‌స్కీ (సెర్గిజ్ కార్సెవ్‌స్కీ)[32] మొదలైనవారు ఈ సంస్థలోని వారే. వీరి కృషి ఈనాడు విస్తరిస్తున్న నూత్న కావ్యవాక్ పరిశోధ నలో అమూల్యమైంది. వీరి పరిశోధనల్లోనే స్ట్రక్చరలిజం, సెమిసి యాలజీ మొదలైన ఆధునిక విభాగాలకు అంకురార్పణ జరిగింది. కాని ఆ రోజుల్లోని ఆ పరిశోధకులంతా కావ్యతత్త్వ నిష్ణాతులు. ప్రతిభావంతులు. భాషావిజ్ఞాన పరిధుల్ని చక్కగా ఎరిగినవారు. ఆ కృషిని అనుసరిస్తూ ఈనాడు ఫ్రాన్స్‌లో రాయబడుతున్న చాలా రచనల్లో ఆ విశిష్టత ఇంకా కొదువగానే కన్పిస్తోంది. ఆ యెత్తుని ఇంకా మనవాళ్ళు అందుకోలేక పోతున్నారు.

ఈ రోజుల్లో పూర్తిగా తిరస్కరింపబడ్డ భావాలు ఆ రోజు ల్లోనే ప్రాగ్ మ్యానిఫెస్టోలో ఎలా ప్రతిపాదించబడ్డాయో చూడాలి. మచ్చుకి రెండు:

"భాష అన్నది ఒక అంగాంగి సమన్వయ వ్యాపారరూప మైన వ్యవహార సామాగ్రి. అందులో సమగ్రత వుంది."

"కవిత్వంలో మాత్రమే వాగ్ వ్యవహార సమగ్రత దర్శన మిస్తుంది. ద్రవ్యజగత్తుతో సంబంధంలేని నిశ్చైతన్య పదార్థంగా కాకుండా- కవిత భాషను ఒక సృజనాత్మకశక్తిగా ప్రదర్శిస్తుంది. కళావస్తువులోని ప్రతి అంశమూ, దానికి వస్తు ప్రపంచంతోటి ఉన్న సంబంధమూ సంకేత-తదర్థముఖంగా నిరూపించవచ్చు. ఈ దృష్టితో సౌందర్య శాస్త్రాన్ని (ఈస్తటిక్స్) ఆధునిక సంకేత విజ్ఞానంలో భాగంగా గుర్తించవచ్చు."

దీన్నే మరో రకంగా చెబితే కావ్యభాషను పరిశీలించటమంటే సంకేతనిర్మాణంలో ఏ భావాంశాలు దాగున్నాయో, వేటిద్వారా 'భాష మన చైతన్యాన్ని స్పృశిస్తోందో' చెప్పటమేనన్నమాట.

## 7. అభినవ సిద్ధాంతం

1958లో ఇండియానా యూనివర్సిటీలో 'శైలి' మీద ఒక సదస్సు జరిగింది.[33] (అంతకు ముందు 1952లో అక్కడే భాషా విజ్ఞాన మానవీయ శాస్త్రాలపైన కూడా ఒక సదస్సు జరిగింది.) ఈ సదస్సులోనే రోమన్‌యాకబ్‌సన్ సాహిత్యాధ్యయనంలో భాషా విప్లవ ఫలితాలు ఎలా ఉండబోతాయో చర్చిస్తూ ఇలా అన్నాడు:

"భాషలోనే కవితాంశాలుగా చెప్పదగ్గ పద వాక్య నిర్మాణ రహస్యాలు, ఆకారాలు ఉన్నాయి. వాటిని గుర్తిస్తే 'కావ్యవ్యాకృతి' (గ్రామర్ ఆఫ్ పోయెట్రీ)ని కనుగొన్నట్లే. సాహిత్య విమర్శకుల్లోనే ఈ అంశాన్ని గుర్తించినవాళ్ళు తక్కువ. మరీ భాషా విజ్ఞానులు ఈ అంశాన్ని పూర్తిగా నిర్లక్ష్యం చేశారు. కాని కవులు, రచయితలు మాత్రం ఈ అక్షరాల్ని ఎలా 'ఎక్స్‌ప్లాయిట్' చేయాలో బ్రహ్మాండంగా తెలిసినవాళ్ళు."

ఇలా ఒక నిరసన ప్రదర్శిస్తూ భవిష్యత్ కార్యక్రమాన్ని కూడా ఆయనే అందించాడు.

"ఇక్కడ చేరిన మనమందరం ఒక విషయాన్ని గుర్తించ వచ్చు. కావ్య వాగ్ వ్యాపారాన్ని గురించి పట్టించుకోని భాషా విజ్ఞాని కాని, భాషా నిర్మాణ రహస్యాలు - సమస్యలు - ప్రయోగమార్గాలు తెలియని సాహితీ విమర్శకుడు కాని తమ కాలాల్లో తాము బ్రదికిన వాళ్ళు కారని అర్థం."

ఈ ఆశయాలు, అవగాహనలు ఎప్పుడో (30, 40 సంవత్స రాల క్రితమే) పీటర్స్‌బర్గ్, ప్రాగ్ - సదస్సులలో కోరుకోబడ్డవే; ఏర్పడ్డవే. అవి అసలు ఈనాటికైనా ఎందాకా నెరవేరాయని ?

దీనికి సమాధానం చెప్పాలంటే మరో గ్రంథం రాయాల్సి వస్తుంది. రిచర్డ్స్, ఎంప్సన్‌లు మొదలుపెట్టిన 'ప్రాయోగిక విమర్శ' తో ఆ కథను మొదలుపెట్టాలి. సూక్ష్మంగా చెబితే వాల్టర్ బెంజిమిన్, జోసఫిన్ మైల్, జాన్ క్రోవె రాన్‌సమ్, క్రిస్టయిన్‌బ్రూక్ యాకబ్‌సన్, లెవిన్, ఉల్‌మన్, సెబియాక్ మొదలైన రచయితల గ్రంథాల్ని 'సెమియాటిక్స్' పరిధిలో వచ్చిన చాలా రచనల్ని చూడండే 34 కావ్యభాషా వ్యాపార విషయంగా మనం ఎంత సాధిం చామో, ఇంకా ఎంత సాధించాలో తెలియదు.

కాని ఒక్క విషయం మాత్రం నిజం. ఇన్ని భాషా విజ్ఞాన మార్గాలు, తాత్త్వికావగాహనలు, ఆత్మ్యస్తభావన (గ్రెయిన్డ్ సెన్సిబి లిటీ)- ఇవన్నీ కలిసి కూడా ఈనాటికీ మనం కావ్యం ఎలా చదువు కోవాలో చెప్పడంలో మాత్రం విఫలమవుతున్నాయి. ఇది ఒక అపోహే కావచ్చు. కాని ఈ ఆరోపణలో సత్యాంశ మాత్రం ఉంది. ఎంత చూసినా- కొత్త కొత్త అర్థాంశాల్ని గుర్తించడం, గణాంక రీతిలో కావ్య వాక్యాన్నో, వాక్య సముదాయాన్నో చీల్చి చూచి అందు లోని వర్ణపదవాక్య సామాగ్రిని వ్యాకరించి పట్టికలు ప్రదర్శించడం- ఇదంతా ఒక అర్థంకాని నిగూఢమైన విద్యగా కనిపిస్తోంది. (విమ ర్శకు ఒదగిన లాభం ఏమిటని ?)

షేక్స్పియర్ రచనలో - నాటకంలో ప్రధానంగా ఎక్క డైనా ఆంగ్లోసాక్సన్ పదాలు లాటినేట్ పదాలతో ఒకదానితో ఒకటి స్పర్ధించేలా వాడబడివుంటే- అందులో నాటకీయత ప్రధానమని చెప్ప డానికికాని మలార్మేలో హ్రస్వ- 'ఇ' వర్గం ధావళ్య, శైత్య స్ఫురణ కోసం వాడబడిందని చెప్పడానికిగాని మనకు ఏ పసూరో, రోమన్ యాకబ్‌సనో అక్కరలేదు. ఇంతకీ ఇన్ని విభాగాలున్న భాషా విజ్ఞానం కాని, సంకేతవాదంకాని, మానవుడు భాషను ఎలా సృజిస్తున్నాడన్న విషయాన్ని గురించి ఏం చెబుతున్నాయని ? కొందరు మానవులు (కవులు కూడా మనుష్యులే కాబట్టి) ఎలా అతి నూత్న పదాల్ని ఏ పద్ధతిలో అన్వేషించి - సృజించి - అవి కొత్తవే అయినా పఠితలో అద్భుతంగా సద్యఃపరనిర్వృతంగా ప్రత్యభిజ్ఞాతమయ్యే (మిస్టరీ ఆఫ్ ఇమీడియట్ రికగ్నిషన్)35 లక్షణాన్ని ఎలా కలిగిస్తున్నా రని ?

ఈ విషయం చాలా క్లిష్టమని - ఆత్మాశ్రయమని - తప్పించు కోవటం ఒక సమాధానం కాదు. సమస్యకు పరిష్కారమూ కాదు. మామూలు రోజూ వాడే పదాలనే రూపాశ్రితంగా విశ్లేషించడం అసాధ్యమని, అందులో ఎన్నో సిద్ధాంత ప్రయోగ సమస్యలున్నా యని ఈనాడు తెలుస్తోందే ! ఉదాహరణకు కనిష్ఠమైన అర్థ బోధ కాంశం 'పదాంశం' అన్న నిర్వచనమే అందరిచేతా అంగీకృతం కావటం లేదు. ఇటీవల కొందరు వాగ్వ్యవహారంలో అణు (ఆటా మిక్) భాగాల్ని నిరూపిస్తున్నారు. అవి పదాంశాల కన్నా మరింత నియమిత వ్యాప్తిని కల్గినవనీ, వ్యాకరణ ప్రయోజన నిర్వహణలో చాలా కీలకమైనవనీ అంటున్నారు. (సెమీమ్- అని ఈ వాగంశను అంటున్నారు కూడా) పరివర్తన వ్యాకరణ పరిశోధనలు చూస్తే మూడు నాలుగు పదాలతో కూడిన వాక్యాలను, పదబంధాలను వివ రించడానికే ఎన్ని రకాల ప్రక్రియల్ని ప్రదర్శించాలో ఎన్ని గుప్త మనోదశల్ని, తత్త్వ నేపథ్యాలను గుర్తించాలో - అందులో ఎంత మానసిక తర్కం ఇమిడి ఉందో తెలుస్తోందిగా !

అందుకే లీవిస్ భాషా విజ్ఞానంద్వారా అసలు భాషా రహస్యాన్ని ఛేదించడం అసాధ్యమని ఒకచోట అంటున్నాడు. అంత తేల్చిపారెయ్యడం తప్పేకాని ఇప్పటికీ సమగ్రమైన భాషా విజ్ఞానం ఏర్పడిందా అనే విషయం మాత్రం మళ్ళీ ఆలోచించాల్సిందే !

ఈ సమస్యలన్నింటినీ 'కావ్యం' అనే బృహద్వాక్య సంఘ టనకు చేసే అర్థనిర్ణయంలోని సమస్యలుగా చిత్రించవచ్చు. సామాన్య భాషా వ్యవహారంలోని ప్రతి అంశమూ సాహిత్యంలో ప్రవేశించగానే ఒక అదనపు అభివ్యంజక శక్తి (ఎక్స్‌ప్రెసెన్షియల్ ఫోర్స్)ని పొందుతుంది. అదే భాషా సంకేత విజ్ఞానాలు ఎదుర్కొంటున్న సందర్భ (కన్‌టెక్స్ట్) సమస్య. అటు మనిషికాని ఇటు కంప్యూటర్ కాని ఈ సందర్భం అంటే ఏమిటో చెప్పలేకపోవచ్చు. చూడరానిదవదు. రచన- సృజనలోని ఈ అంగాంగిరూప స్వీయ ప్రతిఫలనధర్మం వల్లనే కావ్యవాక్యాను రూపాశ్రితంగా విశ్లేషించటం చాలా సంకుచి తంగా, అసమగ్రంగా కనిపిస్తుంది.

కావ్యభాష లాక్షణిక భాష (మెటఫారిక్ లాంగ్వేజ్) దానికి అనుభవ (ఎక్స్‌పీరియన్స్) ప్రమాణరూపమైన ఆంతరిక-అసందిగ్ధ తర్కం ఒకటుంది. ఆ తర్కం గణితతర్కం కాదు. అది ప్రతీకా తర్కం. అది దానికే సంబంధించింది.

## 8. సహృదయ ధర్మం

19వ శతాబ్దిలో పోల్చి చూసుకుంటే రోజురోజుకీ భాషాతత్త్వ వ్యాపార సంబంధమైన మన పరిజ్ఞానం శాస్త్రీయ ప్రాతిపదికలపైన వృద్ధి పొందుతూ వస్తూనేవుంది. ఏదో ఇది నా 'అనుభూతి' అన్న రీతిలో కాకుండా స్వప్రమాణంగా మానసిక భౌతిక నిరూపణలద్వారా ధ్వనులు మానవుడిపై కల్గించే ప్రభావాల్ని ఈనాడు గుర్తించగలుగు

కున్నాం. భాషావిజ్ఞాని వినమ్రతతో ఈ సమస్యల్ని విశ్లేషిస్తున్నాడు కాబట్టే-భాషావిజ్ఞానరంగం ఇంత సంక్లిష్టంగా తయారయింది. కింద చూపిన మూడు అంశాల్ని గురించి భాషా విజ్ఞానులు ఆలోచిస్తూ ఉండటమే కావ్యశాస్త్ర ప్రభావం భాషా విజ్ఞానానిపై పడిందనటానికి కార్కాణం.

1. రోజూ మాట్లాడే భాషతోపాటు – అతీంద్రియమైన భాషా ప్రపంచం ఒకటి వక్తకు తెలుసు. అది చాలా విలక్షణమైంది. వ్యాఖ్యకు అందదు.

2. కవి మామూలు లోకంకన్నా భిన్నమైన, వ్యతిరేకమైన భావనా ప్రపంచాన్ని సృజిస్తాడు. కవికి ఆ స్వాతంత్ర్య పరిమితి వుంది.

3. మాటలో-రాతలో సృజింపబడుతున్న 'పాత్రలు', కాలంతో పాటు త్వరితంగా మారకుండా, నిశ్చలంగా ఉండే ధర్మాన్ని పొందుతున్నాయి. భాషలో ఈ సృజనకి అవకాశం వుంది.

మనం భాషా విజ్ఞానులమైనా, విమర్శకులమైనా కవికి ఋణ పడి ఉన్నాం. అందుచేత కావ్య భాషా విషయాన్ని ఎంతో బాధ్యతతో గుర్తిస్తేతప్ప సమగ్ర వాగ్దర్శనం చేసినవాళ్ళం కాము.

రిచర్డ్స్ 1930 ప్రాంతంలో కావ్యభాషలోని అలంకారికత విశ్లేషణకు లొంగేదే అని భావించాడు.[36] కాని విమర్శ పరిణామాన్ని గుర్తిస్తే అది తప్పని తేలిపోయింది. ఇప్పుడు తెలుస్తున్నదేమంటే కావ్యవాక్కు వాస్తవికతనుంచి మానవుడిలోని ఒక అంతరిక జ్ఞాన సూత్రం ద్వారా తెంచబడి సృజింప బడుతోందని.[37] ఆ జ్ఞానసూత్రం పేరు కవిలోని సృజనాత్మకత. ప్రతిభ.[38]

మరో చిన్న విషయం. ఒక భాషలోంచి మరో భాషలోకి అనువాదం చెయ్యటం. సపీర్ ఉర్ఫ్‌ల నాధారంగా పదమే అనుభవాన్ని నియమిస్తోంది. కాబట్టి అనువాదం అసాధ్యం. ఛామ్‌స్కీ ప్రభృతులు అన్ని భాషలకి మూలమైన అంతర్నిర్మాణం ఒకటుందని అంటున్నారు. అంచేత అనువాదం సాధ్యం కావాలి. యంత్రాలద్వారా అనువాదం సాధ్యమని చాలామంది భావించారు. ప్రయత్నించారు. ఎప్పుడో డా. యెస్గేప్ చెప్పాడు : "యంత్రానువాదం అర్థ దృష్ట్యా అసంభవమని తేలిపోయింది. యంత్రం మొదట అర్థం చేసుకోగల గాలి. అలాంటి కంప్యూటర్ ఇందాకా రాలేదు. అంచేత అనువాదం అసాధ్యమనే తేలిపోయింది" అని. మానవుడు భాషా వ్యవహార సమర్థత ఉన్నవాడంటే అర్థం – ఆ అర్థగ్రహణ-శబ్ద సృజన'శక్తి' మానవుడికి మాత్రమే ఉందని.

ఇంకో విషయం. అన్ని భాషల్లోనూ సాహిత్యం నామ మాత్రంగానైనా ఉంటోంది. కాని కొన్ని భాషలు భిన్న దశాంతరాల్లో అర్థ దర్శన వైవిధ్యాన్ని ప్రతిబింబించడానికి యోగ్యంగా ఎందుకు ఉన్నాయి? హిబ్రూ, (సంస్కృత) గ్రీకు భాషల్లో ప్రతీకాత్మకంగా చెప్పినట్లుగా ఇతర భాషల్లో ఎందుకు చెప్పలేకపోతున్నాం. అసలు జంతువుల్లో మనిషి మాత్రమే అబద్ధాలాడుతాడు. అసంభవమైన భావాల్ని పలుకుతాడు. దీనికి సాహిత్య సృష్టికి సంబంధం లేదూ;

అంచేత మనపైన చాలా పెద్దబాధ్యతే ఉంది.

## సూచికలు

* 'లింగ్విస్టిక్స్ అండ్ పొయెటిక్స్' అనే శీర్షికతో జార్జ్ స్టెయినర్ (1972 : 126 - 154) రాసిన వ్యాసానికిది దాదాపు చాలా వరకు స్వేచ్ఛా భావానువాదం. కాని ఉప శీర్షికలన్నీ నేను కల్పించినవే. సూచికలూ నావే. మన పరిశోధకుల్లో, విద్యార్థుల్లో చాలామందికి సాహిత్య పరిశీలన ఆత్మాశ్రయమని, అశాస్త్రీయమని; భాషా విజ్ఞానం వస్త్వాశ్రయం మాత్రమేనని, అదొక్కటే శాస్త్రీయ మని ఒక అపోహ ఉంది. ఆ అపోహకు చారిత్రక నేపథ్యం ఈ వ్యాసంలో లభిస్తుంది. మొత్తం ప్రపంచంమీద పైరెండు విభాగాలూ ఎలా సమాంతరంగా వృద్ధి పొందుతూ ఒకదాన్ని వదలి మరొకటి ఉండటంలేదో, ఉండరాదో ఈ వ్యాసం నిరూపిస్తుంది. స్టెయినర్‌కి నా ధన్యవాదాలు.

** అలా ఒక సినిమా సంగీత దర్శకుడు రైల్లో ప్రయాణం చేస్తూ పట్టాలమీద పరుగిడుతున్న చక్రాలగతికి ముందుకీ వెనక్కీ ఊగుతూ ఒక పాటకి లయ కట్టాడు. కడకు పట్టాల గతికూడా 'నిర్భావకం'గా లేదని అర్థం.

*** స్టెయినర్ తన ఆంగ్ల వ్యాసం (పుట 144)లో ఇలియట్ మాట నొకదాన్ని ఉద్ధరించాడు. డాన్, టెన్నీసన్‌ల మధ్య కాలంలో 'ఇంగ్లండు మనసుకి ఏమిటో జరిగి వుండాలని' ఆ మాట భావం. వ్యక్తికి ఉన్నట్టే దేశానికీ మనస్సు ఉంటుందనటం చాలా తాత్త్వికపు లోతు కల్గిన దర్శనం. సత్యం.

1. 'శబ్దార్థౌ సహితౌ కావ్యమ్'

భామహాలంకారము (1-16)

2. 'న నితాంతాది' మాత్రేణ జాయతే 'చారుతాగిరామ్',

భామహాలంకారము (1-36)

ఎ) 'సమయాపేక్షా వాచ్యావగమన శక్తి రభిధా శక్తిః'

బి) 'తథన్యథానుపపత్తి సహాయార్థావ బోధన శక్తి స్తాత్పర్య శక్తిః'

సి) ముఖ్యార్థ బాధాది సహకార్యపేక్షార్థ ప్రతిభాసన శక్తి ర్లక్షణా శక్తిః

డి) తచ్ఛక్తి త్రయోఽర్థ జనితార్థావగమ మూలజాత-తత్ప్రతి భాస పవిత్రిత ప్రతిపత్తృ ప్రతిభా సహాయార్థ ద్యోతన శక్తిః ధ్వనిర్వ్యాపారమ్ (లోచనము, పు. 62 - 63, చూ. వ్యజన సూత్రము, అధ్యాయం 2, పు. 141-157)

తయేవ పదసంఘాతాః తాయేవార్థ విభూతయః
తథాఽపి కావ్యం నవ్యం భవతి గ్రథన కౌశలాత్
(ధ్వన్యాలోకం 4-6)

'సైషా సర్వత్ర వక్రోక్తి రసయార్థో విభావ్యతే'
(వక్రోక్తి జీవితం 2-85)

శబ్దో వివక్షి తార్థైక వాచకోఽన్యేషు సత్స్వపి
అర్థః సహృదయాహ్లాదకారి స్వస్పంద సుందరః
(వక్రోక్తి జీవితం 1-9)

చూ. బ్రహ్మానంద, 'సృజన', నల్గొండ జిల్లా రచయితల సంఘం ప్రత్యేక సంచిక 1983 : ఏప్రిల్)

చూ. పాటిబండ మాధవశర్మ 'భారతము : ఛందశ్శిల్పము' (1966) తుమ్మపూడి కోటేశ్వరరావు 'ఆముక్తమాల్యదా సౌందర్యము' (1971) ఇలాంటి విమర్శలే.

చూ. గుంటూరు శేషేంద్రశర్మ 'కవిసేన మేనిఫెస్టో'ను ఆధునిక 'కావ్యశాస్త్ర' మన్నారు (1977) కావ్యాలంకారం/ మీమాంస / ఆదర్శం / పరికాశం - ఇలా 'కావ్య' శబ్దంతో 'పొయెటిక్స్'ని పిలవటం పండిత ప్రసిద్ధవిషయం. అంచేత వాడుకున్నాను.

'అపారే కావ్యసంసారే కవిరేవ ప్రజాపతిః'
(ధ్వన్యాలోకం 4-8)

'శబ్దార్థౌ సహితౌ వక్ర కవి వ్యాపార శాలిని'
(వక్రోక్తి జీవితం 1-7)

1. చూ. కె. సి. పాండే 'కంపేరిటివ్ ఈస్తటిక్స్' (1972) మరియు చూ. బ్రహ్మానంద 'డివినిటీ ఆఫ్ వాక్', త్రివేణి (1983 : 68-74)

14. 'అవాచక స్యాపి గీత శబ్దాదే రసాది లక్షణార్థో అవగమ దర్శనాత్ అశబ్ద శ్యాపి చేష్టాదేః అర్థవిశేష ప్రకాశన ప్రసిద్ధేః' - ధ్వన్యాలోకం, పు. 417.

15, 16. చూ. వ్యంజనసూత్రం అధ్యాయం 1, పు. 38-55

17. భామహునితోనే కావ్యశాస్త్రమంటూ ఒకటి పుట్టింది. తత్పూర్వ పండిత మీమాంసకు చూ. టి. కోటేశ్వరరావు 'భామహుడు-వక్రతా సిద్ధాంతం' శ్రీ వే. వి. ప్రాచ్య పరిశోధన పత్రిక (1970).

18. సరిగా యీ విషయాన్ని అపార్థం చేసుకోవటంవల్లే మన విమర్శకుల్లో చాలామంది ఆలంకారిక విమర్శ కేవలం 'రూప' సంబంధి అని, వారికి 'వస్తు' విషయ అవగాహన లేదని భావించడం సంభవిస్తోంది. చూ. బ్రహ్మానంద వ్యంజన సూత్రఖండనం. (భారతి 1982, జనవరి).

19. ఆలంకారికుల్లో చాలామంది వ్యాకరణ శాస్త్ర మూలాన్ని గుర్తించారు. ఉదాహరణం 'ధ్వని' (ఆనందవర్ధనుడు) స్ఫోట సిద్ధాంతం (వ్యాకరణ సంబంధి. భర్తృహరి ప్రతిపాదకుడు) నుంచి ప్రేరణ పొందింది. "...తద్వైకా న్యైః స్తన్మతాను సారిభిః సూరిభిః కావ్య తత్వార్థ దర్శిభి ర్వాచ్య వాచక సమ్మిశ్రః శబ్దాత్మా కావ్యమితి వ్యపదేశ్యో వ్యంజ్యకత్వ సామ్యాత్ ధ్వనిరిత్యుక్తః" (ధ్వన్యాలోకం 1-13 క్రింద వ్యాఖ్యానం). భాషా పరిశోధకుల్లో చాలా మంది పూర్వాశ్రమంలో సాహిత్యాధ్యయనం చేసినవారే. వారి పరిశోధన మార్గాలకు సాహిత్యమూ ఎంతగానో ప్రేరణ యిచ్చింది. ససూర్, సపీర్, ఫర్త్‌హాకెట్‌ఛాంస్కీ, బార్తేస్‌లు నిదర్శనం. ఇక రోమన్ యాకబ్‌సన్‌లాంటి వాళ్ళ విషయం చెప్పాల్సిన అవసరం లేదు.

20. సంస్కృతంలో 'గో' శబ్దానికి ఆవు, శబ్దం, కిరణం మొదలైన అర్థాలున్నాయి. కిరణమన్న అర్థం వైదికం. చూ. విశ్వబంధు 'వేదిక్ టెక్స్టువల్ లింగ్విస్టిక్ అనాలిసిస్' (1975)

21. శబ్దస్య పరిణామోఽయం ఇత్యామ్నాయ విదో విదుః
ఛందోభ్య ఏవ ప్రథమమే తద్విశ్వం వ్యవర్తత
(వాక్యపదీయం 1-20)

న సోఽస్తి ప్రత్యయో లోకే యః శబ్దానుగమాదృతే
అనువిద్ధ మిదం జ్ఞానం సర్వం శబ్దేన భాసతే
(అందే, 1-123)

వాఙ్మయానీహ శాస్త్రాణి వాఙ్నిష్ఠాని తథైవచ
తస్మాద్వాచః పరం నాస్తి వాగ్ఘి సర్వస్య కారణమ్
(నాట్యవేదం, వాచికాభినయం 750)

వక్తి విశ్వమఖిలపతి ప్రత్యవమర్శేన ఇతివాక్
(భాస్కరీ 1-258)

22. దేనిక్రమం గుర్తించడం కష్టమో అది అసంలక్ష్య క్రమం. వ్యంగ్యంలో ఇదొక భేదం. మరొకటి క్రమం తెలిసేది వివరాలకు చూ. కుంజున్నిరాజా 'ఇండియన్ థీరీస్ ఆఫ్ మీనింగ్' (1963).

23. ఇది పాశ్చాత్య దేశీయమైన ఉపమాసామగ్రి. కావ్యానుభవం ఎలాంటిదో చెప్పడానికి భారతీయాలంకారికులు 'శుష్క కాష్ఠమివాగ్నినా' 'లావణ్య మివాంగనాసు' ఇలాంటి పోలికలు వాడారు. వీటికీ-వాటికీ సాంస్కృతికమైన భావా లున్నాయి.

24. ప్రతీక = సింబల్, ప్రతిమ = ఇమేజ్ / వెకన్. వివరాలకు చూ. బ్రహ్మానంద 'కళార్థ తత్త్వం' (1983. అము.)

25. స్ఫోటనం-అంటే బుద్ధి, హృదయం (ఆలోచన, స్ఫురణ) రెండూ ఏక కాలంలో పొందే అనుభవ రూపమైన అవ గాహనమని అర్థం. అందుకే ఆధునిక సాహిత్యాన్ని విమర్శించాలన్నా పాత ఆలంకారిక పరిభాషనే అర్థ భేదా లతో వాడుకోక తప్పటంలేదు.

26. కోరాడ రామకృష్ణయ్యగారి తరంలోని సాహిత్య విమర్శ వెనుక ద్రావిడ భాషావిజ్ఞాన ప్రభావం అమితంగావుంది. వివరాలకు చూ. బ్రహ్మానంద 'తెలుగు సాహిత్య విమర్శ: పాశ్చాత్య ప్రభావం' (1981 ముద్రణలో)

27. పియాజె పరిశోధనలు బ్రహ్మానంద 'భారతి'లో (1978, 79, 80. 82, 83) రాసిన వ్యాసాలద్వారా పరిచయ మైనాయి.

28. ఇక్కడ విశ్వాసం అనే మాటకు 'ఈస్తటిక్ సెన్సిబిలిటీ' అని అర్థం. అది పోగానే 'భావకత్వం' ఏ భాషాసాహి త్యంలోనైనా చచ్చిపోతుంది.

29. 'కేచిద్వాచాం స్థిత మవిషయే' (ధ్వన్యాలోకం 1-1) అని గుర్తించింది ఈవాదాన్నే. చూ. వ్యంజనసూత్రం. అధ్యా. 2.

30. 'చార్వాకైరివ ఆత్మ పృథగ్భావే' (లోచనం పు. 45)

31 వివరాలకు చూ. వై. బేసన్ 'ఎ సిమాంటిక్ ఫిలాసఫీ ఆఫ్ ఆర్ట్' (1979) బ్రహ్మానంద 'కళార్థ తత్త్వం' (అను. అము.)

32. బ్రహ్మానంద 'సెర్గిస్ కార్చెవ్‌స్కీ సంకేతదృష్టి' భారతి, 1983 : ఏప్రిల్.

33. 1969లో ఇటలీలో కూడా ఇలాంటి సదస్సు జరిగింది. భాషాశాస్త్ర సంప్రదాయాలలో ఏదీ 'శైలి'ని సమగ్రంగా వివరించలేక పోతున్నాయని గుర్తించడం జరిగింది, చూ. సెయ్‌మూర్ ఛట్‌మన్, 'లిటరరీస్టైల్ - ఎ సింపోసియమ్' (1971)

34. స్టెయినర్ ఆ వ్యాసాల్ని తన వ్యాసంలోనే ఇచ్చి ఉన్నాడు. చూ. పు. 139, వాటిలో కొన్ని 'వ్యంజన సూత్రం'లో పు. 357) ఉద్ధరింప బడ్డాయికూడా.

35. స్మరణానుభవా రూఢా సామాన్యాధి కరణ్యధీః
సంస్కారేంద్రియ జన్యాచ ప్రత్యభిజ్ఞా ప్రకీర్తితా
(ప్రత్యభిజ్ఞాహృదయం)

36 చూ. హెర్బర్ట్‌రీడ్ 'ది లిమిటేషన్స్ ఆఫ్ ఎ సైంటిఫిక్ ఫిలాసఫీ' (1960)

37. దీన్నే క్రోసె, కాలింగ్‌వుడ్, వైట్‌హెడ్, క్యాసియర్. మోరిస్, సుసానెలాంగర్ ప్రభృతులందరూ 'అల్ట్రారెగ్యులర్ యూసేజ్' అని గుర్తించారు. వివరాలకు చూ. బ్రహ్మానంద 'కళార్థ తత్త్వం' (1983)

38. 'సా ప్రతిభా నానుమీయమానా, అపితు తదావేశేన భాసమానే త్యర్థః' లోచనం. పుట. 92,

[చూ. జార్జ్‌స్టెయినర్ 'ఎక్స్ట్రా టెరిటోరియల్', ఫేబర్ అండ్ ఫేబర్ ప్రచురణ, లండన్, 1972, పుటలు 126-154]

# ముద్ద మందారం

శ్రీ కొడవంటి లీలామోహనరావు

ఆ రాత్రి
నిరాశాంధకారంపై
వెండి వెన్నెల
యుద్ధం ప్రకటించిన వేళ
నా గుండెల్లో
జడల సింహం జేవురించింది.
వంటరి కిటికీలోంచి చూస్తున్న
నన్ను అందుకోవాలని
మెత్తని నిశ్శబ్దపు సంగీతం.
ప్రాణం పెట్టే మూలుగు
అణచి పెట్టాలని పెనుగు లాడుతుంటే
తలుపుపై పిలుపు ఆశ పెట్టింది.
చివ్వున లేచి తలుపు తీస్తే
వెలవెల పోతూ వెన్నెల.
దొరికావు లెమ్మని చలిగాలి
కొరికి కొరికి వదిలింది.
పాదం కింద చల్లని మెత్తని స్పర్శ.
తీసి చూద్దును కదా
ముద్ద మందారం.
సందేహం లేదు
నీవే నీవే నీవే
నీవే వచ్చావు.
ఈ పేదవాని హృదయాన్ని పూరడిద్దామని
ఈ కళ్ళల్లో జ్యోతులు వెలిగిద్దామని
నీవే వచ్చావు.
నీ మంజీరాల సంగీతం
నన్ను పరవశింప జేస్తోంది.
నీ పద విన్యాసాలు
నా కంటికి విందు చేస్తున్నాయి.
తెల్లని నీ చిరునవ్వు
నా మనసంతా నిండి
జగమంతా నిండి
పరవళ్ళు తొక్కుతోంది.

# రాజహంస

## శ్రీ పజ్జల కాళిదాసు

సుర నారీ రచిత మనో
హర మృదు మల్లీగుళుచ్ఛ మనగా నొక సుం
దర రాజహంసి సరసిన్
దిరుగుచు కన్పించె ధవళ దీధితి మెరయన్ ॥

ఆ క్షణమందు నాదు హృదయమ్మున
నిర్ఝర సుందరీ త్రపా
వీక్షణ పంక్తులో, సురభి
వీథుల క్రమ్ము పరీమళమ్ములో,
అక్షయ పారిజాత కుసుమాసవ
మాధురులో, ప్రకాశమా
న క్షణికా ఘృణి ప్రభలో
నాట్య మొనర్చె నవేద్య వైఖరిన్!

ఒక సుకుమార సుందర
వయో రుచిరాంగి గతిన్ సరోవరో
ర్మికల విలాస మందగతి మీరఁ
విహారము చేయు రాజహం
సిక పథమంత వింత సరసీ
జలముల్ నవరాగ రంగ వ
ల్లికలను దిద్దుకొన్నవి
ఆలేఖ్య కళా విభవంబు నిండగన్!

అలలను తేలి యాడుచు
ఒయ్యారముగా ఒకమారు నిల్చుచున్
సలిల రుహమ్ములన్ మధు
రసమ్ముల నించుక యానుచున్ సయా
టల విచరించుచున్ ముకు
పుటమ్ముల నూర్కొనుచున్ బ్రియోక్తులన్
బల్కుచు కుల్కుచున్ నగుచు
పాడుచు హంసిక యుండె వేడుకన్!

ఆ మనోహరమైన దృశ్యమ్ము గాంచి
నంత నా హృదయము పులకాంకితమయి
ఏ పురానుభూతి స్మృతులో పరంప
రలుగ ముంచెత్తినట్లు లార్ద్రత వహించె!

ప్రాచి వెలుంగు వెల్లువలు
పైపయి నంతకునంత మెల్లనన్
లేచుచున్న యుత్తరి కనీనికలన్
చిరునవ్వు నిండగా
చూచెను హంసి నన్, ప్రణయ
శోభిత వీక్షణ రాగ మాలికా
వీచికలన్ మదీయ పదవీ
ప్రమదావని పల్లవింపగా!

ఆనన సీమ నవ్యదరహాస
విలాస వికాస కాంతి రే
ఖా నిచయమ్ము క్రమ్మ, నను
గాంచిన భంగిమ యందు నీరవా
హ్వాన పరంపరల్ పిలిచి నట్లయి
డెందము సందడించె, పూ
ర్వానుభవా లదృష్ట మృదు
హస్తములన్ నను కౌగిలింపగా!



## ద్రాక్షారామములోని అఖండ దీప దాన శాసనములు - ఒక పరిశీలన

గోదావరీనది ఉపనదియైన గౌతమీనది ఒడ్డునగల కోటిపల్లి గ్రామమునకు 9 కి. మీ. దూరములో ద్రాక్షారామమున్నది. మధ్యాంధ్ర దేశమున పంచారామములుగా ప్రసిద్ధి కెక్కిన శైవాలయములలో నొకటి ద్రాక్షారామమున కలదు. తక్కినవి అమరారామము, క్షీరారామము, కుమారా రామము మరియు భీమారామము. ద్రాక్షారామములోని శైవాలయమందున్న ముఖ్య దైవము శ్రీ భీమేశ్వరస్వామి. ఆలయ శాసనములలో నీప్రదేశము ద్రాక్షారామము, డాక్షారేమి మరియు పెద డాక్షారేమిగా చెప్పబడియున్నది.[1] ఆలయములోని అఖండ దీప దానశాసనములు క్షుణ్ణముగా పరిశీలించుట, వానిని తక్కిన నాల్గు ఆరామములలోని అఖండదీపదాన శాసనములతో సరిపోల్చి చూచుట ఈ వ్యాసములోని ముఖ్యోద్దేశము. ఈ భీమేశ్వరాలయములో నింతవరకు సుమారు మూడువందల డెబ్బయి అయిదు శాసనములున్నట్లుగా గుర్తించబడినవి. అందు రెండువందల ముప్పదియారు శాసనములు అఖండ దీపదానశాసనములే. ఈ శాసనములలోని కాలమును పరిశీలించినచో నివి సుమారు నాలుగు శతాబ్దముల వరకు విస్తరించినవి. అనగా పదకొండవ శతాబ్దము నుండి పదునాల్గవ శతాబ్దము వరకు ఈ శాసనము లొసంగబడినవి. అట్లే, ఈ కాలములో అధికారములో నున్న తూర్పుచాళుక్యులు, చాళుక్యచోళులు, కల్యాణిచాళుక్యులు, తూర్పుగాంగులు, కాకతీయులు, రెడ్డిరాజులు మున్నగు వివిధ రాజ వంశీకుల వలన నీ ఆలయము విశేషాదరము నొందినది.

ఆయాకాలములలో అధికారములోనున్న పెక్కుమందిరాజులు భీమేశ్వరాలయమును ఆదరించి పోషించినప్పటికిని, ఆలయ శాసనములు పరిశీలించినచో ఎక్కువసంఖ్యలో దీపదానశాసనములు పన్నెండవ శతాబ్ది మొదటిభాగమున [ క్రీ.శ. 1100 నుండి క్రీ.శ. 1150 వరకు ] ఈయబడినట్లుగా స్పష్టమగుచున్నది. ఈ శాసనముల వలన మధ్యాంధ్రదేశములో ఆలయములలో దీపములు పెట్టించుట ఎంత గానో ఆదరము పొందినట్లు మనకు తెలియుచున్నది. ఆలయములోని రెండువందల ముప్పదియారు దీపదానశాసనములలో సుమారు నూట ముప్పయి తొమ్మిది శాసనములు క్రీ.శ. 1100 నుండి క్రీ.శ. 1150 వరకుగల మధ్యకాలముననే ఇచ్చినట్లు కన్పట్టుచున్నది. క్రింద ఈయబడినపట్టికను పరిశీలించినచో వివిధ కాలములలో ఈయబడిన దీపదాన శాసనముల సంఖ్య, అవి ఎట్లు కాలక్రమముగా తగ్గినది స్ఫుటముగా తెలియును.

| | క్రీ. శ. 1000-1050 | క్రీ. శ. 1051-1100 | క్రీ. శ. 1101-1150 | క్రీ. శ. 1151-1200 | క్రీ. శ. 1201-1250 | క్రీ. శ. 1251-1300 | క్రీ. శ. 1301-1350 | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|
| దీప దానముల సంఖ్య | 1 | 10 | 139 | 53 | 18 | 14 | 1 | 236 |

ద్రాక్షారామములోని ఆలయశాసనములు పరిశీలించినచో ఒక భక్తుడు భీమేశ్వరస్వామికి ఒక అఖండదీపము పెట్టించవలెననిన ఏబది లేక ఏబది అయిదు ఆవులను, అర దీపము పెట్టించవలెననిన ఇరువది అయిదు ఆవులను దానము ఈయవలసినట్లు మనకు స్పష్టమగుచున్నది. శాసనముల చివరిభాగమును పరికించినచో కొన్ని ముఖ్యమైన అంశములు తెలియుచున్నవి. మచ్చునకు ఒక శాసనము చివరిభాగము ఈ దిగువనీయబడినది. [ సౌ.ఇం.ఇ. వాల్యూం IV నం: 1011 ]

శ్రీ భీమేశ్వర మహాదేవరకు బెట్టిన యఖణ్డవర్త్తి లోహపు ధూపార ఒవియ యెక్కట్టి దీని-

కినా చంద్రార్క్కముగ నెయి సరియిచ్చువారుగాను గిలర మున చామబోల వెంటియయు

ంగొమ్మబోలకాటియయు బాదబోల దొడ్డనయుం గొమ్మకవ తల్లియయు బెరసినబోలు

నల్వుర వసమునా బెట్టిన యెడ్లు ౫ం దివసపడి ఓయంగల త్రిభువనాంకుశ నేమాన ౧ లికితము మూరపాసారి [11]

పై శాసనము ప్రకారము దీపము వెలిగించు నిమిత్తము దానమీయబడిన ఏబది ఆవులను చామబోల వెంటయి, కొమ్మబోల కాటియ, బాదబోల దొడ్డన, గొమ్మకవ తల్లియ అను నల్గురు బోయిల వసమున నిల్పినట్లును, వారు నల్గురును ప్రతి దినము ఒక త్రిభువనాంకుశ మానెడు నేతిని ఆలయమునకు సమకూర్చవలసినట్లును కలదు. మరి కొన్ని శాసనములలో ఈ విషయము వేరు విధముగ ప్రస్తావించబడినది. వానిలో బోయిలలో ప్రధాన పురుషుడైన ఒ

బోయిని ఆధ్వర్యములో నల్గురు లేక అర్గురు బోయిలు ఆవులను సంరక్షించ వలసినదిగా పేర్కొనిరి. శాసనములలో "అడపున" అను మాట పేర్కొనబడినది. దీనికి అర్థము అధ్వర్యమని తీసికొన వచ్చును.

ముఖ్యముగా ఈ దీపదాన శాసనములు ఉత్తరాయణ సంక్రాంతి,[2] కర్కాటక సంక్రాంతి,[3] దక్షిణాయన సంక్రాంతి,[4] కన్యా సంక్రాంతి,[5] విషువు సంక్రాంతి[6] తులా సంక్రాంతి,[7] మాఘ పున్నమి, మహాద్వాదశి,[8] సూర్యగ్రహణము,[9] వ్యతీపాతము[10] మున్నగు పండుగలు, శుభదినములందు ఈయబడినవి. ఇట్టి సందర్భములందేగాక మాండలికులు, సైన్యాధిపతులు తాము జరిపిన దండయాత్రలలో విజయము సాధించి తిరిగి వచ్చిన పిమ్మట ఇచ్చిన దీప దానశాసనములు కలవు.[11] తమ తల్లిదండ్రులకు ధర్మార్థముగాను,[12] రాజునకుగాని,[13] స్నేహితులకుగాని,[14] భార్యకుగాని,[15] కుమారునికి గాని,[16] ధర్మార్థముగా దీపదానములిచ్చినట్లు తెలియుచున్నది. దీపముల నిమిత్తమై దానమిచ్చు జంతువులను శాసనములలో ఇనుప ఎడ్లు,[17] ఎనుప ఎడ్లు, ఎడ్లు,[18] ఎనుములు,[19] మొదవులు లేక మోదాలు,[20] మరియు సురభులు[21]గా వ్యవహరించిరి. కొన్ని శాసనములలో ఒక దీపము పెట్టుటకు ఇరువది అయిదు ఆవులను దానమిచ్చినచో ప్రతి దినము ఒక త్రిభువనాంకుశ మానెడు నెయ్యి సమకూరునట్లుగాను, అరదీపమునకు అరమానెడు నెయ్యి సమకూరునట్లుగాను పేర్కొనబడినది. ఆసక్తికరముగా నొక శాసనములో ఇరవయి దీపములు పెట్టించుటకును నాల్గు వందల ఇరువయి అయిదు ఆవులను తొమ్మిది వసములలో నిల్పి ఆలయమునకు సమర్పించినట్లు కలదు.[22] ఆవులనే గాక వాటిని సంరక్షించు బోయిలకు కొంత భూములను, ఇండ్ల స్థలములను కూడ దానమొసగినట్లు శాసనముల వలన తెలియుచున్నది.[23] చాల తక్కువగా ధనము కూడ దీపములు పెట్టుటకు ఈయబడినది. ఒక శాసనములో ఒక అఖండ దీపమును ఆ చంద్రార్కముగా నిలుపుటకు 10 కులోత్తుంగ మాడలను, మరియొక శాసనమందు 10 కులోత్తుంగ గద్యలిచ్చినట్లును కలదు.[24]

ద్రాక్షారామము లోని శిలాశాసనములు పరిశీలించినచో నాటి ప్రజలు తామొసగిన దీపదానములు సరిగా నడచుటకు ఎంతో శ్రద్ధ తీసికొనినట్లు తెలియు చున్నది. దానమొసగిన ఆవులను నల్గురు లేక అర్గురు బోయిలతో నేర్పడిన ఒక సంస్థకు అప్పగించెడివారు.[25] అంతేకాక, ఈసంస్థలు ముఖ్యుడైన ఒక బోయి అడపున వుండునట్లు శాసనములలో నిర్దేశించెడివారు. వారిలో ప్రముఖముగా తలరాశినాయక తలరాశి, మొదలి, మొదలి రాశి, కాటబోల పణ్ణ, ఎరియబోల బాదర ప్రోలియబోయ, కాటబోల నావియ, పెద్దబోల నావయ మున్న వారు ప్రస్తావించబడిరి.[26] వారి అధీనములో నుంచబడిన ఆవు బోయిల వశమున గాని, ఆలయము యొక్క పశువులశాలలో గా నుంచెడివారు. క్రిందనీయబడిన పట్టికను పరిశీలించినచో వివిధ కాలములలో దానమొసగబడిన ఆవుల సంఖ్య, శాసనములలో ప్రస్తావించబడిన వసముల సంఖ్య తెలియుచున్నది.

పట్టిక - 2

| | క్రీ.శ. 1051–1100 | క్రీ.శ. 1101–1150 | క్రీ.శ. 1151–1200 | క్రీ.శ. 1201–1250 | క్రీ.శ. 1251–1300 | క్రీ.శ. 1301–1350 | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|
| శాసనములో చెప్పబడిన ఆవుల సంఖ్య | 775 | 5,735 | ,605 | 620 | 250 | — | 873 |
| శాసనములో చెప్పబడిన వసన ముల సంఖ్య | 9 | 79 | 23 | 2 | 4 | 1 | 11 |

పై పట్టికను పరిశీలించినచో క్రీ. శ. 1101 నుండి క్రీ. శ 1150 వరకు గల మధ్యకాలములో అత్యధిక సంఖ్యలో, అనగ అయిదువేల ఏడువందల ముప్పది అయిదు ఆవులు దానమొసగ బడినవి. తరువాతి కాలములో ఈయబడిన ఆవుల సంఖ్య క్రమముగ తగ్గినట్లు కన్పట్టు చున్నది. అట్లే ఆవులనుంచు వసముల సంఖ్యకూడ నీకాలముననే ఎక్కువగా నున్నది. సుమారు డెబ్బది తొమ్మిది వసములు ఈకాలములో నున్నట్లు మనకు శాసనముల వలన తెలియు చున్నది. వీని సంఖ్య కూడ కాలక్రమమున ఆవుల సంఖ్యతోపాటు తగ్గిపోయినది.

మిక్కిలి ఆసక్తికరముగా ద్రాక్షారామములోని శాసనములం ఆలయమునందు దీపములు పెట్టు సందర్భమున రెణ్డపునడపు మూణ్డపునడపున, మరియు నాల్గవునడపున అని ప్రస్తావించబడిన బహుశ నివి దీపములు రెండుసార్లు, మూడుసార్లు, నాల్గుసార్లు వె గించవలెనని నిర్దేశించుట కాబోలు. ఈ పద్ధతి ఆంధ్రదేశములో మరి ఏ ఇతర ఆలయ శాసనములలోను ప్రస్తావించబడలేదు. క్రిం నీయబడిన పట్టికను చూచినచో వివిధ కాలములలో నీపద్ధతి ఎ పాటించబడినది మనకు విశదమగును.

పట్టిక - 3

| నములలో ప్రస్తావించ బడిన శములు | వివిధ కాలములలో శాసనముల సంఖ్య | | | | | | మొత్తము శాసనములు |
|---|---|---|---|---|---|---|---|
| | క్రీ.శ. 1051-1100 | క్రీ.శ. 1101-1150 | క్రీ.శ. 1151-1200 | క్రీ.శ. 1201-1250 | క్రీ.శ. 1251-1300 | క్రీ.శ. 1301-1350 | |
| నడపున | — | 15 | 11 | 5 | — | — | 31 |
| రెవునడపున | — | 13 | 11 | 3 | — | — | 27 |
| నడపున | — | 2 | 6 | 2 | — | — | 10 |

దీనినిబట్టి దీపములను వెలిగించు విషయమై ఇచ్చిన సూచ ముఖ్యముగా పన్నెండవ శతాబ్దకాలమున జరిగెనని తెలియుచు అంతేగాక ఆ కాలమునాటి దాతలు ఎక్కువగా ఆలయము రెండుసార్లు దీపములను వెలిగించుటకు మొగ్గుచూపినట్లు కూడా ుచున్నది. దానితర్వాత వారు మూడుసార్లు దీపములను వెలి టకు కూడ ఎక్కువ సుముఖులైనట్లు కన్పడుచున్నది.

పంచారామములుగా ప్రసిద్ధికెక్కిన తక్కిన నాల్గు శైవాల లోను వున్న దీపదాన శాసనములు, ద్రాక్షారామములోని దీప శాసనములతో సరిపోల్చి చూచినచో నవి చాల తక్కువ సంఖ్యలో వి. ఉదాహరణకు గునుపూడి భీమవరమందలి సోమారామ ఆల నందింతవరకు రెండు శాసనములు మాత్రమే గుర్తింపబడినవి.[27] ల్లనందలి క్షీరారామేశ్వర దేవాలయములోని మొత్తము ముల సంఖ్య నలుబదియారు కాగా, అందు దీపదానశాసనములు పియేడు మాత్రమే.[28] భీమవరమునందలి చాళుక్య భీమేశ్వర ఆలయమున వున్న అరువదినాల్గు శాసనములలో పదిహేడు ములు దీపదాన శాసనములు. అట్లే అమరావతిలో నున్న దీప శాసనముల సంఖ్య కూడ చాల తక్కువ. ద్రాక్షారామము శాసన నేతిని కొలుచుటకు త్రిభువనాంకుశమాన వాడుకలో నున్నట్లు ంచబడగా, భీమవరము శాసనములలో సానియంబాటిమానిక గానిక చెప్పబడినవి.[29] పాలకొల్లు శాసనములలో నందిమానిక ముగా ప్రస్తావింపబడినది.[30] ఒక నందిమానిక కొలమాన సరిపడు నేతిని ఆలయ సంరక్షణాధికారికిగాని లేక సాని నిర్వారు సంస్థకు గాని అప్పగించ వలసినట్లు శాసనములలో 31

కారణములు సరిగా తెలియకున్నను, ఇంతవరకు మనకు లభించిన శాసనాధారముల వలన ద్రాక్షారామము, అమరావతి మరియు భీమవరము అందలి ఆలయములలో అఖండదీపములు సమర్పించుట, పన్నెండవ శతాబ్ది మొదటిభాగమున ఎక్కువగానున్నట్లు తెలియు చున్నది. కాని పాలకొల్లునందలి క్షీరారామేశ్వరస్వామి ఆలయము నందుమాత్రము ఎక్కువసంఖ్యలో అఖండదీపములు పదమూడవ శతాబ్ది కాలమున దానమొసగినట్లు తెలియుచున్నది. దీపదానముల సంఖ్య తరువాత కాలములో బాగా తగ్గిపోయినట్లు కూడ శాసనముల వలన స్పష్టమగుచున్నది.[32]

ఈ విధముగా ద్రాక్షారామములోని దీపదానశాసనములను పరిశీలనాదృష్టితో పరికించినచో ఆనాటి ప్రజలు ఆలయమున దీప ములు పెట్టించుటలో ఎంతటి శ్రద్ధాసక్తులు చూపిరో, వివిధ కాలము లలో, ఆలయవైభవము, ప్రజల సాంఘిక ఆర్థిక జీవనము మనకు స్పష్టముగా తెలియుచున్నది. ఇట్టి పరిశీలనలు విస్తృతముగా తక్కిన ఆలయ శాసనములపై జరిపినచో మరిన్ని ఆసక్తికరమైన చారిత్రక అంశములు వెలుగులోనికి వచ్చును.

### అధోజ్ఞాపికలు

1. సౌ. ఇం. ఇ, వాల్యుం IV, నెం : 949, 1102, 1104, 1108, 1228
2. పైది. నెం : 1156, 1170, 1177, 1201
3. పైది,
4. పైది, నెం : 1233, 1094, 1113
5. పైది, నెం : 1013,
6. పైది, నెం : 1132, 1165, 1266, 1086 1109
7. పైది, నెం : 1300, 1305, 1365
8. పైది, నెం : 1032 - ఎ
9. పైది, నెం : 1112, 1171, 1025
10. పైది, నెం : 1167, 1191, 1194, 1195
11. పైది, నెం : 1083; 1117
12. పైది, నెం : 1117, 1279, 1100, 1068, 1371
13. పైది, నెం : 1152, 1342
14. పైది, నెం : 1228,
15. పైది, నెం : 1335
16. పైది, నెం : 1068

17. పైది, నెం : 1013, 1158
18. పైది, నెం : 1008, 1011, 1010, 1009
19. పైది, నెం : 1187
20. పైది, నెం : 1138; 1163, 1217, 1235
21. పైది, నెం : 1288, 1290
22. పైది, నెం : 1140
23. పైది, నెం : 1068, 1203, 1080, 1083
24. పైది, నెం : 1063; 1051
25. పైది, నెం : 1045, 1081, 1035, 1014
26. పైది, నెం : 1018, 1020, 1073 1208, 1049, 1135, 1143, 1144
27. యాన్యువల్ రిపోర్ట్ అన్ సౌత్ ఇండియన్ ఎపిగ్రఫి ఫర్ 1943-45 నెం : 4 మరియు 4; జర్నల్ ఆఫ్ ఆంధ్ర హిస్టారికల్ రీసెర్చి సొసైటి, వాల్యూం XXI, పే. 95 నుండి 99 వరకు.
28. జర్నల్ ఆఫ్ ఎపిగ్రాఫికల్ సొసైటి ఆఫ్ ఇండియా, 1981, పే. 105 నుండి 108 వరకు.
29. సౌ. ఇం, ఇ, వాల్యూం; V, నెం : 63, 67, 71, 72, 73, 74
30. పైది, నెం : 121, 122, 127
31. పైది, నెం : 160; 161, 162
32. జర్నల్ ఆఫ్ ఎపిగ్రాఫికల్ సొసైటి ఆఫ్ ఇండియా, 1981, పే. 105 - 108.

డా॥ మైనేని కృష్ణకుమారి

# శ్రీమద్రామాయణ కల్పవృక్షము - అరణ్యసౌందర్యము

శ్రీమద్రామాయణ కల్పవృక్షంలో అరణ్యకాండయందు కబంధుడు తన శాప నిష్కృతికై వెంపరలాడుచు శ్రీరామ ప్రతీక్షా బుద్ధియై విసివిసివి, నిరాశానిస్పృహలకు లోనై చివరకు రామలక్ష్మణులు దర్శనముకాగా "అంధువు పెనులోతు త్రవ్వినను నూల్కొను కొబ్బరి పాలవంటి నీరవిసినయట్టి పెద్దజలలై" కనిపింతిరని వారితో అనును.

ప్రతీక్షాగత భాగ్య దర్శనమునకు సాటిలేని యుదాహరణము! కనిపించిన ప్రతికావ్యమును చదువుచు పోవునట్టి రసలుబ్ధుడైన పఠిత యొక్క స్థితియు సత్కవిత్వ దర్శన అనుభూతులచే ఇట్లే యుండు ననిపించినది.

దశవర్ష పంచవటీ మారీచ జటాయుశ్శబరీ నామక పంచ ఖండ సమన్వితమైన కల్పవృక్ష అరణ్యకాండము - విరాధ సంహారం లక్ష్మణుని పర్ణశాల నిర్మాణ చాతుర్యము, మాయలేడి అతిలోకసౌంద ర్యము, సీతా వియోగజనిత రామచంద్ర దుఃఖము, రామచంద్ర ప్రతీ క్షాబుద్ధియైన కబంధుని అవస్థ, శబరీకృత రామచంద్రార్చనము, మొదలగు ఉత్కంఠా పాదక, హృదయతలస్పర్శియైన సంఘటన లతో ఒక ప్రక్కయు-

నిసర్గ సౌందర్య అరణ్యాంతర్భాగములైన తరులతా ప్రపం చముచేత, గిరికందర నిస్సరత్ జలపాత మనోహర నాదములచేత, పక్షుల కలకలారావములచేత, నిర్మల రేఖాభి సమీక్షతోజ్వల హరిణ రాట్ నిర్వ్యాజ సౌందర్యములచేత, ప్రశాంత సౌభాగ్యములైన మున్యా శ్రమములచేత, మధురతర ఋతువర్ణనా విలాసములచేత, మరియొక ప్రక్కయు-

విలసిల్లి విశ్వనాథ సహలోక వైభవ సనాథత్వమునకు నిద ర్శనముగా నిలిచియున్నది.

స్వయముగా విశ్వనాథవారే "అమృతోత్క్యం చితమున్, కథా కథన శిల్పానేక మార్గాభిరామము..." అని అరణ్యకాండ వైశిష్ట్య మును ఉగ్గడించిరి కాండాంతములో.

విరాధవధ ఘట్టమున రామలక్ష్మణులు విరాధుని చేతులు నరి కినారు. కంఠము నరకబడలేదు. చివరకు విరాధుడే తన కంఠమున శ్రీరాముని పాదముతో త్రొక్కుమని వేడుకొన్నాడు. రాముడట్లేచేసి,

"దారికి దారి జూపితివి తల్లిగ నెంచితి భూమిజాతనిన్
మారణ మాచరించెదను మామకమై చను క్షత్రియత్వమే
దారిది యోకటా! సహజతంగ నెదంచునుగాక నీగళాం
భోరుహమిట్లు త్రొక్కుటయు గల్గునె! నాకు దయాదిలోకముల్"

అని బాధనొందును. ఏమి శ్రీరాముని ఈ నవనీత సమ మనః ప్రవృత్తి చంపవలసిన రాక్షసులను చంపును. అట్లు చంపవలసి వచ్చినందుకు బాధపడుచుండును.

ఇక రాక్షసులుగూడ నట్లే! రామలక్ష్మణుల నెదిరింతురు ! వారిని రెచ్చగొట్టుదురు. వారిచే సంహరింపబడి ముక్తులగుదురు. ఆ 'ముక్తి'కై వారు క్షణకాలమేని యాలస్యమును యోర్చలేని తహతహ

పడుచుందురు. ఈ విధమైన రాక్షసుల పాత్ర చిత్రణమున విశ్వనాథ చూపించిన శిల్పము ప్రత్యేకముగా పరిశీలింపదగినది.

ఏదైత్యుని సంహరించినను స్వామి విషాదము నొందుచుం డును. విరాధ సంహారానంతరము శ్రీరాముడు విషణ్ణుడై లక్ష్మణునితో "ఊహకు నందదే బ్రతికియుండిన వానిని పూడ్చిపెట్టినామే, హరీ!" అని పల్కును.

సుతీక్ష్ణు ఆశ్రమప్రాంతమందు వసించిన సీతారాముల సంసార మాధుర్యమును విశ్వనాథ చిత్రించిన వైఖరి గమనింపుడు.

వంట చేయుచునుండి వైదేహి పతిగాంచి
యపు యెదోయంచి యిండనుచు నడిగెఁ
గోరగించిన కొండగోగు పూజ్జలోన
ముడిచి యెట్లున్న దంచడిగె స్వామి
పతి నిద్ర వోవుచోఁ బ్రభు చేతియుంగరం
బూడ్చి తాఁదన వ్రేలికుంచుకొనియె
తన శిరోమణి ప్రభూత్తము కొంగునందున్న
తెలియకుండగ నూడదీసుకొనియె

తనర సంస్కార జీవనాంతః ప్రపాతి
తాల్ప విషయంబులివి చూచి యత్రమునను
సాధు శృంగార లీలా ప్రసన్నకథలు
గాగ చెప్పికొందురు మునికాంతలెల్ల.

సాంసారిక కాల్పవిషయంబులు, నియమ జీవనలైన ముని కాంతలకు సాధుశృంగార లీలలుగా తోచుటలో అబ్బురము లేదుగాని, అల్ప విషయములకే అనల్పమైన ప్రతిభ జోడించి ప్రసన్నకథలుగా మలచిన విశ్వనాథ వారి శక్తి పాఠకులకు అబ్బురము కల్గించును.

వాతాపిల్వలులు భోజనము రమ్మని పిలిచి, వచ్చినవారిని మడి యించుట ఎట్లున్నది?

"ముదురు తొండ యొకడు ముంగాళ్ళపై నిక్కి-
నిశ్చలంబుగాగ నిలిచియుండి
కాళ్ళనడుమ నుండి కదలు చీమలబారు
చెదరు చీమలను గ్రసించునట్లు-" ఉన్నదట.

సీతారామలక్ష్మణులు, అగస్త్య సోదరుని నోట వింధ్యగర్వాపహర ణము వినినారు. అనంతరము అగస్త్యుని దర్శించారు. అగస్త్యాశ్రమం లోని పర్ణశాలాంగణములో, గృహాంతర్భాగములలో, అగ్నిస్థానము లందును- ఎక్కడ చూచినను లేళ్లే. అగస్త్యుడు శ్రీరామునకు అర్ఘ్య పాద్యములిచ్చి అతిథ్యమొసగి, విష్ణుధనుస్సు, తూణిరాన్ని కాన్క పెట్టాడు. ఆ రేయి సీతారాములు అక్కడే గడిపారు. ఉషోవేళ సీత రామునితో ఇట్లన్నది.

"నాకు నిజముగ నెపుడు స్వప్నములు రావు
రాత్రి యొక్కటే స్వప్నముల్ రామచంద్ర
కడు పసిడి మేను పొడలు మాఘవ తమణులు
కనులు పచ్చలు మిన్నెగ గలుగులేళ్లు!"

అనినన్ శ్రీ రఘుమూర్తి యిట్లనియె. కాంతా ! నాకు నట్లే యగ స్త్యుని యా పెంపుడు దుప్పి పెంటి విరహస్యూతాక్షి కోణాగ్ని యెం దున్న నేనుందునొ యల్లగా నుగిడి యందున్ వచ్చి తోచున్ ! సుధా నన ! యేమున్నది ! భావలగ్నములు స్వప్నంబుల్ విడంబించెడున్.

అగస్త్యాశ్రమంలో నిద్రించిన సీతకు బంగరు లేడి యొకటి కలలోనికి వచ్చినదట. శ్రీరామునకు అగస్త్యుని పెంపుడు దుప్పి, ప్రియావియోగ జనిత దుఃఖావస్థయందు చిక్కియున్నది, కలలోనికి వచ్చెను. భావిలో మాయామృగముచే సమ్మోహితయగు సీతయు, సీతా విరహ వేదనా దోదూయమానుడగు రామచంద్రుడు రేఖామాత్రముగా మనస్సున మెదులుచున్నారు గదా ! కథనశిల్పమనగా నిట్టిది.

ఇక పంచవటీఖండము రామాయణ కథను మలుపు త్రిప్పుట యందెంతటి ప్రధానపాత్ర వహించినదో- విశ్వనాథవారి ఊహా వైభ వమును వెలార్చుటయందు కూడా అంతియే ! విశ్వనాథ కవితా వైభ వము "వేయి కంబముల ముక్తామండపంబన్నయట్టులు" నిలిచినది.

పంచవటీ ప్రదేశమున లక్ష్మణుడు "సమోన్నత నృటము, సమీప వారియు, విశద్ధ సమాగత వాయువీచియుం" గలిగినచోట "పర్వ ముల్ తెలియనట్టివి సాధుసహస్రపర్ణ వృద్ధములు" వెదుళ్ళు కప్పన వేసి, చెల్లుకట్లను చూరుగా చేసి, నిర్మించినాడు పర్ణశాల ! అది ఎట్లున్నది ?

"బయటికి పూరిపాక మురిపంబుగ లోనికి పోయిచూడ వి
స్మయకరమైన సౌధ సుకుమార మనోహర రమ్యభూమి యా
లయములు వేఱవేఱ పదిలంబుగ నగ్నికి, స్వామి శ్రాంతికి
జియనికి కిన్ భుజిక్రియకు రెంటెపునే తగస్వామినిద్రకున్."

"మలుదెస మూయని చావడి
మలయాచల విలయమంద మందానిల సం
చలన పరిసేవనా విచి
కిల కాంతారాభిముఖ్య కృతి సాధువుగాన్" ఉన్నది.

మలుదెస మాయని పర్ణశాల చావడిలో నిలిచి ముగ్ధమోహన నిర్వ్యాజ సౌందర్యరాశులైన లేళ్లను చూచుచుండుట సీతకు ఒక అలవాటైనది. ఆ లేళ్లు పర్ణశాలాంగణమున,

"పచ్చిక మేయు చొక్కచెవిపట్టి యేదేనియుఁ బుట్టునవ్వడిన్
నిచ్చలు విన్కి, మేయుచు వనింజను మెత్తని మేని చాలనం
బచ్చుగ మూసలో బసిడి యాఱిన యట్లు గనున్కి, శాంభమౌ
నచ్చపు నున్కి, భూసుతదృగంచల చంచల మోహనాబ్ధులై"——

తిరుగుచున్నవట.

ఇట్టున విశ్వనాథవారు గావించిన హేమంతవర్ణనము మనోహరమై, పరమ స్వాభావికమై యొప్పుచున్నది. హిమపాతసమయ మందలి అరణ్యసౌందర్యము, తత్సమయ సకల జంతుస్థితియు, విశ్వనాథ సూక్ష్మేక్షికకు నిదర్శనము.

హిమపాత సమయమందలి హరిణశాబకము, వనమయూర ములస్థితి ఎట్లున్నదో చూడుడు:

"కన్నుల నీరు గ్రమ్మ హిమకాలమునన్ వెనుకాలి డెక్కతో
కన్నుల గ్రమ్మ నీరు జడిగాఁ బెడద్రోచెడు లేటికాన, కా
కన్నిలు పోపమిన్ నెమలి కన్నున కన్నున నీరు క్రమ్మగా
నెన్నని త్రోయగా నెఱిగ కిల్లె మనోహరమూర్తి యేగెడిన్."

శూర్పణఖ పర్ణశాలకువచ్చి శ్రీరామునితో ప్రయత్న పూర్వకముగా మృదుస్వరకల్పన చేయుచు నిట్లన్నది!

"జలజల నల్లని తలతల
వెలుగులు రాలెడిని నల్లవిసెపూచినదో!
తెల్లిసెను నీమైచిక్కని
జిలుగులు కనులంట బొడిచె చిమ్మనగ్రోవై!

భర్గశ్రీ గళకాంతిభావ పరిదీప్య ద్దైత్యరాజ్యేందిరా
దుర్గ ద్వార కవాట మోహన కళాదుర్వార మీవక్ష మా
నర్గళ్యంబు పగూహనక్రియకు సంధానించు నచ్చోట నం
తర్గోత్యోజ్వల పల్లవోదిత రసోద్యత్ బ్రహ్మకైవల్యమై!"

శూర్పణఖా సంభాషణ మందలి పై రెండు పద్యముల శైలీ భేదమును గమనించండి! అమె తెచ్చిపెట్టుకున్న మృదుభాషత్వము రెండవ పద్యమునందే అంతరించి ఆమె స్వస్వభావము బయటపడినది! పై రెండు పద్యముల యందలి చమత్కృతి యేమనగా శైలీభేదమాన విశ్వనాథ శూర్పణఖా వాక్కులందలి కృతక సహజత్వము, సహజ కాఠిన్యమును తెలియజేయునట్లు రచన సేయుటయే! ఇట్లే మృదువుగా భావించుటకు ఆమె చేయు ప్రయత్నము రెండు మూడు వాక్యముల వరకే నిలిచి, మరల పరుషముగా మాటలు వచ్చుచుండుటగాంచి ఆమె తనపై తానే విసుగుకొని నిల్చినది——

"గుణమొక్క శబ్దగతమా
గుణమర్థ గతంబుకూడ"—— అంటూ శ్రీరాముడు ఆమె మాటల యందలి అసహజతను పట్టివేసినాడు!

శూర్పణఖ లక్ష్మణునిచే ముక్కు చెవులు కోసివేయబడి కోపావ మానములు దహింప, మింటికెగురుచు రామలక్ష్మణులను నిందించుచు పల్కిన పల్కులను విశ్వనాథ చక్కని వృత్తౌచిత్యమునకు యుదాహరణములుగా తీర్చిదిద్దినాడు. విస్తరభీతిచే ఆ విషయములను స్పృశించుటలేదు.

ఖరదూషణులు మహాసైన్యముతో ఒక్కపెట్ట శ్రీరామచంద్రుని పైకి దండెత్తగా ధనుష్టంకారము సేసిన రామచంద్ర విక్రమము ఇట్లున్నది.

"రామ స్వర్గమునన్ శరత్రిపథగాప్రసావణంబయ్యె, స్రో
తోమార్గంబులనొండు పంజర శరద్రోణంబు పోషించు, నొం
డాముంబొందిన రాక్షస వ్రజము సంహారంబుగావించు, నొం
డేమోమింటను మింటనే రిపుశరద్వీపంబులన్ముంచెడున్"

శ్రీరాముడు స్వర్గము. ఆ స్వర్గమునుండి బాణసమూహము అనెడు త్రిపథగ ప్రవహించు చున్నది. త్రిపథగా అనగా గంగానది కదా!

శ్రీరామ నిర్ముక్త బాణగంగాప్రవాహమందలి ఒక ప్రవాహము కక్షగత తూణీరమును పోషించు చుండగా, మరియొకటి రాక్షస సంహారము సేయుచున్నది. వేఱొకటి ఆకసమునందు సృష్టింపబడు చున్న రాక్షస బాణద్వీపములను ముంచుచున్నది.

రామచంద్రుని నిర్ముక్త బాణసంఘమును గంగాప్రవాహము తోను, రాక్షస విముక్త శరజాలములను ద్వీపములతోను పోల్చుట యందలి విశ్వనాథ ప్రతిభ పఠితలను ఆశ్చర్యచకితులఁజేయు చున్నది గదా!

రావణుడు మారీచుని కడకేగి యతనిని బంగారు లేడిగా అవతరించుమని చెప్పగా, నతడు రామచంద్ర విక్రమము, లంకకు రాబోవుచేటునుగూర్చి యుపన్యసించును. ఆ సందర్భమున మారీచుడు తాను మంత్రినిగనుక యాథార్థ్యము వచించుచుంటినని పల్కెను.

రాజ్యపాలనమున మంత్రులస్థితి యెట్టిదో తెలియజేసెడు మారీచ వచనమును అవధరించండి!

"ప్రజలతో రాజు పుట్టును-రాజుతోడ
ప్రజలు పుట్టుదురు-మంత్రులు, ప్రజకుఁ బతికి
నడిమివారలు-ప్రజలయు పుడమిపతియు
నుభయతస్థితి మంత్రుల యుజ్జ్వలమతి!"

ఎంత చెప్పినను పెడచెవిని బెట్టిన రావణుని యాదేశాను సారము మారీచుడు బంగరు లేడిగా అవతరించాడు :

"నా నావర్ణమనోజ్ఞ పర్వక లతాంత శ్రేణికా గర్భర
ధ్యానిష్పావక సర్వభూమి జలతాంతశ్శక్తి మేల్కొన్నదో!
నానాసూర్య మయూఖ గర్భకుహరాంతర్వజ్రతహోద్యన్మణి
శ్రీ నిర్వ్యాఘ మనోజ్ఞతాసుషమలుత్సృష్టంబులై పొల్చెనో!"

అన్నట్లున్న మాయామృగ సౌందర్యము అనుకొనునట్లుగనే సీతను ఆకర్షించినది! మాయలేడి చేష్టలను, తత్సౌందర్యమును కావ్య మున చదివి యానందింపవలెనేగాని, ఆ పద్యములను. తత్తద్భావము లను వ్యాసమున పొందుపరుచుట భావ్యముకాదు.

సీత మాయలేడిని అగ్గించిన తీరు చూడండి!

"ఇంత అందమ్ముగానుండ కేమి కదలి
తన కడుపులో మణుల్ దాచుకేను పినాసి
పరగ నీ లేడిదైన రూపంబెవేలు
తనదునాత్మ వెలార్చు నౌదార్యమూర్తి!"

సీత కోరికపై శ్రీరాముడు మాయలేడిని పట్టుకుపోయెను. మారీచుడు చేసిన ఆర్తనాదమువిన తత్కంఠధ్వని శ్రీరామునిదిగా భావించి సీత లక్ష్మణునీ తొందరచేసి చూచిరమ్మని పంపును. లక్ష్మణుడు పర్ణశాల వీడిన వెనుక రావణుడువచ్చి సీతతో సంభాషిం చు ఘట్టమున నతని రాజసము, గాంభీర్యము, నివాసములు ప్రతి బింబించునట్లు విశ్వనాథ, రావణ మాటలను తీర్చి దిద్దెను.

సీతను గొనిపోయి అంతఃపుర పరిచారికాసహస్రముతో నిట్లని నాడు రావణుడు:

"రమణీయ రత్న నీరాజన ఛ్ఛవులైన
తమ్మి కన్నుల నెండ తవులరాదు
తరుణబాలేందు సుందరమైన నొసలిపై
మబ్బు రేకల నీడ మసలరాదు
విమల సంధ్యా సరోవీచి కాభమ్మైన
పెదవిపై చలిగాలి కదలరాదు
మణిభంగ వేది రమ్య కపోలముల మీద
పూదుమారమ్ములు పోవరాదు

గంధలేపాదులెల్ల సౌగంధ్యమంటి
మై తళుకు తీరువోవని. పూతవలయు
అఖిల భూషణ సంతతి యమరవలయు
పర్వసన్నతి సన్నుతి పర్వునట్లు"—

ఇంకను ఏమనుచున్నాడో చూడుడు.

"అనుచును చెప్పువారి కథికాదర మొప్పగ నిట్లు చెప్పె నీ
యనితర దృశ్యమాన జగదాభరణాకృతి, వెండికొండ యె
త్తిన సమయంబునం గినుక దేరిన యెఱ్ఱని కెంపుకన్నులం
దనరిన దేవి వచ్చె, సముదారత భక్తి భజింపఁగావలెన్."

సీతతో భాషించుచు నొకచోట రావణుడు

"అం, బుజ సదృశంబు నీ చరణ మోహన పీఠమునందు నాదు స
ర్వజని ఫలంబు నర్పణము పట్టితి, ముట్టితి శ్రీరహస్యమున్."

అనినాడు;

పై రావణుని పల్కులయందు ఏమి కానవచ్చుచున్నది ? సీత యందు మోహమా ? భక్తియా ? ఆమెను జగదంబగా, శక్తిస్వరూ పిణియైన చిత్‌శక్తిగా భావించుచున్నట్లున్నాడే? ఆమె "అనితరదృశ్య మాన జగదాభరణాకృతి" అట!! ఆమెను "భక్తి భజింపఁగావలెన్." ఇట్లే కావ్యమందు సీతతో రావణుడు సంభాషించెడు ప్రతి చోటను పౌలస్త్య హృదయము ఆంతరముగా సీతయెడ భక్తి ప్రపత్తులనే వహించుచున్నట్లు తోచును.

తన రచనలో విశ్వనాథ చేసిన అద్భుత నిర్వహణము ఇది!

ఇక "అమృతోక్త్యంచితమున్" అని ఈ కాండాంతమున విశ్వనాథవారు చెప్పిన మాటలకు సరియగు నుదాహరణము శబరీ ఖండము !

తట్టలో రకరములైన పూవులను పేర్చికొని తలపై పెట్టుకొ నిన శబరి "తుట్టతుదదాక నెండిన చెట్టుకొమ్మ, శేఖరమ్మునయందు పుష్పించి నట్లు—" న్నదట.

శబరి యొక విరహిణి. స్వామి విరహమును గుండెలలో భరించి, తపస్విజన సేవలో చిదికి చివికిన వృద్ధయోగిని యామె. మతంగ మహర్షి ఆదేశానుసారము శ్రీరాముని అర్చించుటకై ప్రాణ ములు కన్నులలో పెట్టుకుని బ్రతికిన దామె.

"శబరి కనులయందు స్వామి తాదన ప్రతి
బింబ మరసి దార విరహమూర్తి
విరహ బాధ యెల్ల విడిచెను, గంటి నీ
రార శబరి కనులు తెరుకొనియె."

సమ్మదాశ్రులు కనులు నిండగ, పండ్లు కాన్కగా చేసినది శబరి! ఏ ఫలములు మధురములో తెలియక నేనెట్లు తినగల్గుదునని రాము డనగా, ప్రప్రథమమున నేను రుచి చూచియే నీకు తెచ్చితినని శబరి పల్కినది. శ్రీరాముని ప్రాణనాథా యని పిలిచినది! వృద్ధాప్యమువలన వేగైన బ్రతుకుబరువును స్వామికి విన్నవించినది. శ్రీరాముడామెతో పరిహాసోక్తుల నాడుచుండ నామె తగువిధముగ బదులు పల్కినది. వారిద్దరి సంభాషణములో ఒక పద్యమిట్లు అవతరించినది!

"అవ్వ! నిప్పురి వెన్నెల యట్లు ముగ్గు
బుట్టవలెనయ్యో నీ శిరంబును నసంగ
ప్రభువ! ని యాత్మ వాకిట రంగవల్లి
నినుచుటకు నింతగాగ పండినదటంచు—"

శ్రీరాముడు శబరితో,

"మఱి నీ మాటలు నూహ చేసినను సామాన్యార్థముల్ కావు ని
ర్భర దివ్యార్థములై కనంబడెడి—" అనినాడు;

శ్రీరాముని అనుమతితో "అగ్నిలో మేను సేర్చి" దివ్యలోకములకు చన్నది శబరి!

శబరీ యాతిథ్యము స్వీకరించిన నాల్గుఘడియలు స్వామి, తాను సీతా వియోగ దుఃఖమును మరచితినని లక్ష్మణునితో పల్కెను.

"ఆ సమయంబునందున ధరాత్మజ సైతము విస్మృతింబడెన్" పుష్పద్రు శాఖాసమాహత వాయుతరంగమ్ములు గుమ్ములై తాకుచుండగా శ్రీరామలక్ష్మణులు ఋష్యమూకాద్రి వైపు కదలుటతో ఈ కాండము ముగియుచున్నది!

ఒక్క విషయంచెప్పి వ్యాసం ముగిస్తాను!

విశ్వనాథవారి కృతినిర్మాణ చాతుర్యము సర్వదా లక్ష్మణుని పర్ణశాలా నిర్మాణ చాతుర్యమును బోలియున్నది.

"బయటకు పూరిపాక మురిపంబుగ లోనికిపోయిచూడ వి
స్మయకరమైన సౌధ సుకుమార మనోహర రమ్యభూమి—"

రామాయణ కల్పవృక్షమనగానే పూర్వము తెలుగు కవులు బండ్ల కెత్తించిన రామాయణములవలె దీనినికూడ తలంపవచ్చును కొందఱు! కాని "లోనికిపోయిచూడ విస్మయకరమైన సౌధ సుకుమార మనోహర రమ్యభూమి" ఇది! అయితే కావ్యముయొక్క "లోనికిపోయి చూచుట" అన్నది భావుకునియొక్క హృదయ సౌకుమార్యము, కావ్యముపై భక్తి, శ్రద్ధ మొదలగు అనేక విషయములపై ఆధారపడి యున్నది గదా!

భక్తియని యెందుకు చెప్పుచుంటిననగా,

"మత్సరస్వతి భావ సామ్రాజ్యలక్ష్మి
భక్తి యున్నట్టిచో మెత్తబడెడు దేవి!"

అని విశ్వనాథవారు వారి సారస్వత తేజమును దర్శింపవలసిన తీఱును ఒకచో సెలవిచ్చిరి!

కనుక వారి కావ్యములను సేవింపవలసినవారు మొదట సంపాదింపవలసినది కావ్యగౌరవము! తరువాత కావ్యపఠనము! ఆపై యోగ్యతనుబట్టి రసానందము!!

### శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

# బ్రహ్మలింగ - ఏకాదశకము

ఈ పద్యములు మాకు ఒక తాళ్ప్రతిలో దొరికినవి. రచయిత ఎవరో తెలియదు. వీనియందు సాంఖ్యతత్వము వివరింపబడినది. సంబోధనను బట్టి జూడ కవి వీనిని రుద్రసంఖ్యగనే వ్రాసెనేమోయని యనుమానము. ముక్తకాదులలో అష్టకములు, నవకములు కనిపించును గాని ఏకాదశకములు కనిపించవు గావున ఇవి విషయమును మరియు సంఖ్యనుబట్టి విశిష్టముగా నున్నవి.

శ్రీ శైవ యోగీంద్ర చిత్తాబ్జ హంస స్వ
రూపమై యే మూర్తి రూఢి కెక్కు
బిందు నాద కళాది భేద మార్గోద్భవ
క్షేత్రమై యే మూర్తి కీర్తి గాంచు
భక్త జనాంబ కోత్పల సుధాసూతియై
యే మూర్తి భోగ మోక్షేచ్ఛ లొసగు
మండిత బ్రహ్మాండ మండల జ్యోతియై
యే మూర్తి ఈ యిల నెల్ల వెలుగు
నట్టి పరశివమూర్తి లోకైకవర్తి
నాత్మ చింతించి కడుభక్తి నంజలించి
ధాత్రి రచియింతు సీసపద్యములుగాగ
పండిత స్వాంతసంగ శ్రీ బ్రహ్మలింగ — 1

ఆది మధ్యాంత శూన్యంబైన లింగ దే
హంబునం దుదయించె నంబరంబు
నంబరంబున జన్యమయ్యె గంధవహంబు
గంధవహంబున గలిగె వహ్ని
వహ్నికి జనియించె వరుసతో భువనంబు
భువనంబునకు బుట్టె భూతలంబు
భూతలంబునకు సంభూతమై విలసిల్లె
సర్వభూత శరీర సంచయంబు

సర్వభూత శరీర శీర్ష స్థలాగ్ర
నేత్రముల పంచభూతముల్ నీలధూమ్ర
రక్తపాండుర పీతవర్ణముల వెల్గు —"పండి" - 2

పృథివి కాఠిన్యమై పీతవర్ణముబట్టి
బ్రహ్మ సుయుక్త స్వభావమయ్యె
నీరంబు ద్రవమై పటీర వర్ణముబట్టి
విష్ణు సంక్రీడా నివేశమయ్యె
రవివహ్నియుష్ణమై రక్తవర్ణముబట్టి
రుద్రసాంగత్య స్వరూపమయ్యె
వాతంబు చలనమై వరధూమ్ర వర్ణంబు
బట్టి యశ్వరయుత ప్రాణమయ్యె

రంధ్రమై మిన్ను నీలవర్ణమ్ము బట్టి
శ్రీ సదాశివమూర్తి సుశీలమయ్యె
గాన...నివి భూత లక్షణములుండు —"పండి" - 3

రాజితస్థితి గూడి రసరూప సంస్పర్శ
శబ్దంబు లైదు భూసంగతములు
వర రస రూప సుస్పర్శ శబ్దంబులు
నాల్గు పానీయలీన ప్రకృతులు
మృత్యుక్తపద్ధతి రూప సుస్పర్శ శ
బ్దంబులు మూడగ్ని భాసితములు
స్పర్శశబ్దయుగము పవనభాగంబులు
శబ్దమొక్కటి యాకసంబు గుణము

ధారణముభూమి పిండీకృతంబు జలము
పాచనమువహ్ని గమనంబు స్పర్శనంబు
నింగి యాశ్రయమిది భూతనిర్ణయంబు —"పండి" - 4

నుతగతి జ్ఞాన మనోబుద్ధి చిత్తాభి
మానంబులైదు వ్యోమమున గలిగె
బలిసమానమును వ్యానోదానములును పా
నప్రాణములు పవనమున దోచె

సతత శ్రవణచర్మ చక్షుజిహ్వా ఘ్రాణ
ములు వహ్నిలోనను భూతమయ్యె
పటుతరలీల శబ్దస్పర్శరూప ర
సామోదములు తోయమందు బొడమె

అతుల వాక్పాణి పదగుహ్య పాయువులును
ధరణి జనియించెగాన భూతత్వతతులు
పంచ వింశతుల నిశ్చితుల్ బల్కుచుండు —"పండి" - 5

జ్ఞానంబులైదు సమానంబునను శ్రోత్ర
శబ్దంబులంటి వాక్చయము వెడలు
మనసువానమున చర్మస్పర్శలు గ్రహించి
ప్రాణి క్రియా క్రియల్ బట్టిసేయు
బుద్ధియు దానంబుబొందిలోన నరూప
ములు గనుంగొని పాదమున చరించు
చిత్తంబపానంబు జెంది జిహ్వారసంబు
లనుభవింపుచును గుహ్యమున నిలుచు

క్షమనహంకృతి రతిప్రాణసరణిఘ్రాణ
గంధములు గ్రోలి పాయువుగతినటించు
నిట్టి పంచీకరణ సూత్ర మెరుగవలయు —"పండి" - 6

ధాత్రి భూతంబు సంతతము గంధగుణంబు
ధరియించి ఘ్రాణరూపంబుదాల్చె
రతిహాయ భూతంబు రసగుణంబు వహించి
పరమమై జిహ్వా రూపంబు దాల్చె
వహ్నిభూతంబు రూపగుణంబు సుఖించి
భాసిత నేత్రరూపంబుదాల్చె
పవమాన భూతంబు స్పర్శ గుణముబూని
ప్రతిభతో చర్మరూపంబు దాల్చె

నాకసపు భూతమూ శబ్దగుణముబట్టి
ప్రణుతికెక్కుచు శ్రోత్రరూపంబుదాల్చె
గాన భూతంబులే హృషీకంబులయ్యె— "పండి" - 7

ఈరీతి ఘ్రాణ జిహ్వాక్షణచర్మ క
ర్ణంబులు జ్ఞానేంద్రియంబులయ్యె
పాయుగుహ్య చరణ పాణవాగాదులు
కర్మేంద్రియంబులై ఖ్యాతికెక్కె
స్థిరతరాహంకార చిత్తబుద్ధిమనంబు
లంతఃకరణరాసులనగ నొప్పె
వసుధ గంధ రసరూప స్పర్శ శబ్దముల్
జ్ఞానేంద్రియముల విషయములయ్యె

వ నవి సర్గానుదగమన దానవ చక్రప
తతులు కర్మేంద్రియయుతములయ్యె
గతతాభిమాన విచార నిశ్చయమన
నంబులు కరణగుణంబులయ్యె
కలితలీలజ్ఞాన కర్మాఖ్యజాలముల్
బాహ్యేంద్రియంబులై పరిఢవిల్లె
నైశ్వర్య బద్ధలి నంతఃకరణ చతు
ష్టయగతులంత రింద్రియములయ్యె
మరియు జ్ఞానేంద్రియంబులు మనముబుద్ధి
చెలగి యూర్ధ్వంబులై మించె చిత్తమహము
రమణ కర్మేంద్రియంబు లధః ప్రకృతులయ్యె

—"పండి" - 8

లీలతో ఘ్రాణంబు భూలోకమైమించె
నలర భువర్లోకమయ్యె జిహ్వ
లోచనప్రభ సువర్లోకమై విలసిల్లె
త్వక్కు మహర్లోక వాసమయ్యె
శ్రోత్రంబు జనలోకమాత్రమై చెలువారె
మనము తపోలోక మార్గమయ్యె
ఘనబుద్ధి సత్యలోకంబయ్యెగాన మీ
సప్తకం బూర్ధ్వమై స్తవముగాంచె
పాయువు వెండియు పాతాళమై మెప్పె
లలి గుహ్యమయ్యె తలాతలంబు
నంఘ్రి మహాతలంబై కీర్తి దనరారె
పాణిరసాతల భావమయ్యె
సుఖతరస్థితివాక్కు సుతలమై శోభిల్లె
విశదాప్తి చిత్తంబు వితలమయ్యె
సతతమహంకార మతులమై పెంపొందె
గావున మీయేడు గణ్యులెన్న
ధృలిరథోలోక వాసులై తేజరిల్లె
స్థిరతనిట్టి చతుర్దశేంద్రియములైన
భువనముల సాక్షియై లింగమూర్తియుండు

—"పండి" - 9

ఘ్రాణంబునకు భూమి రసనకు వరుణుండు
ఘనత నేత్రములకు కర్మసాక్షి
చర్మంబునకు గాడ్పు శ్రవణంబునకు మిన్ను
శ్రాద్ధదేవుడు గురుస్థానమునకు
మహనీయగతి పితామహుడు గుహ్యమునకు
సంకేరుహాక్షుండు పాదములకు
పరగ దేవేంద్రుండు పాణిస్థలమునకు
వాక్చమూహమునకు వాయుసఖుడు
మనమునకు శశి, బుద్ధికి వనజభవుడు
శివుడహంకారమునకు జీవుడు చిత్తమునకు
కర్తలని యోగశాస్త్రముల్ గణుతిసేయు —"పండి" - 10

మహితాన్న మయమైన మాంసకాయమునకు
సాక్షిస్వరూపుడై శంభుడుండు
ధర్మప్రాణ మయమైన దశమారుతములకు
సాక్షి స్వరూపమై శంభుడుండు
విజ్ఞాన మయమైన విమల సద్బుద్ధికి
సాక్షి స్వరూపమై శంభుడుండు
నిత్యమానంద మయమైన, నిద్రకథిక
సరణి సాక్షిస్వరూపమై శంభుడుండు
గానకోశంబులై దెసగంగవలయు
పండిత స్వాంతసంగ శ్రీ బ్రహ్మలింగ!

**శ్రీ కె. కిశోరుబాబు, శ్రీ కె. అశోకుబాబు**

# లేఖలు

## క్రీ. శే. పాలెపు నరసింహం సాహితీ సంకలనం

సుప్రసిద్ధ సాహితీవేత్త, విమర్శకుడూ, తాత్త్వికుడూ అయిన పాలెపు నరసింహంగారి చతుర్థ వర్ధంతి సందర్భంగా ఆయన సాహిత్యంతో వో సమగ్ర సంకలనం ప్రచురింపబడుతోంది. ఆయనతో పరిచయమూ, స్నేహమూ వున్న వివిధ వ్యక్తులకు, వారివారి వద్ద వున్న ఆయన రాసిన వుత్తరాలూ, ఇతర విషయాలూ వొరిజినల్సు కానీ, వాటి కాపీలు కానీ, మాకు పంపి సహాయపడ వలసిందిగా అభ్యర్థిస్తున్నాం.

ఎడ్రస్ : సార్వభౌమ, కేరాఫ్ శ్రీ దినవహి సూరపరాజు
వెలంపాలెం, దాక్షారామ-533 262, తూర్పుగోదావరి జిల్లా.

## శ్రీశ్రీ - స్వర్గం - (విమర్శ)

శ్రీ పైడిపాటి సుబ్బరామ శాస్త్రిగారు (జూలై 83 భారతి) వ్రాసిన 'శ్రీశ్రీ-స్వర్గం' అన్న శీర్షిక క్రింద గల పంక్తులను చదివాను.

ఆకాశంలో విహంగాలను... మొదలుచేసి తరలించిన జగజెట్టీ! ... శ్రీశ్రీ ... అన్న కవితలో సారాంశ మేమిటో కవిగారు చెప్పితే వినాలని వున్నది.

> అనాచారం జీవికలో
> అనియమం భాషలో
> అరాజకం భావంలో
> పూరించెను నీ విప్లవ శంఖం!

అని మరొక విషయం చూచినాను. అనాచార మంటే ఏమిటి శాస్త్రి గారూ! మీ యభిప్రాయం. శ్రీ శ్రీ గారు మాంసం తిన్నారు లేదా బ్రాందీతాగారనా! భావంలో అరాజకం. ఆయనగారి భావంలో ఎక్కడ ఏ అరాజకం మీకు కనిపించిందో సోదాహరణంగా వివరిస్తే చదివి తెలుసుకుంటాము గదా! శ్రీ శ్రీ గారు బ్రాహ్మణులా కాదా! అయితే వారి గోత్ర మేమిటి? తాను పోషించిన ఆడపిల్ల పేరు, ?నినా, అన్నారు. మార్క్స్ సిద్ధాంతం ఆయనకు గిట్టింది. "తెగడి ?ారు మరికొందరు" అని వ్రాసినారు ఎవరు తెగడింది? ఏమని ?గడింది వ్రాయాలి మరి.

> "తిరిగి పుట్టవలసిన
> యీ దేశంలోనే పుట్టకు"

?ని రచయిత అన్నారు. విదేశీయులు భారతదేశాన్ని గౌరవిస్తూ ?ండగా, భారతీయ ప్రతిభని కాళిదాస మహాకవిలో వ్యాపింపజేసి, ?ద్దైన ఒక ప్రత్యేక బాణీ కవితలోకి జొప్పించిన శ్రీ శ్రీ దివంగ ?త్మకు-విదేశాలు చూపిస్తున్నారేమి! మళ్ళి పుట్టడానికి శ్రీ శ్రీ-కవిత ?ించి అతనిలో లోపాలను గురించి లేదా ఘనత గురించి ?్వాంసుల అభిప్రాయాలను 'భారతి' ముఖాన స్వాగతం పలుకు ?్నాను. శ్రీ సుబ్బరామశాస్త్రిగారి పరిచయం - వారి చిరునామా ?ు తెలియదు. వారు తెలిపితే తెలుస్తుంది. ఈ ధోరణితో నేను ?ని నొప్పింప దలచుకోలేదు. మెప్పింప దలచియే వ్రాసినాను. ?్యం కవీనాం- వచనమే వ్రాయండి, పరవాలేదు. నమస్కారం!

— దేశపతి గోపాలకృష్ణ

సి ద్ది పే ట.

## తెలుగు వార్తల తెలుగు

ఆకాశవాణిగా ప్రసారమయ్యే తెలుగు వార్తలకు ఉపయోగించ బడే భాష మొదలైనవాటినిగూర్చి కొన్ని అంశాలు గమనించవలసి ఉన్నవి. అనుద్దిష్టంగా పొరపాటునవచ్చే — స్లిప్ ఆఫ్ ది టంగ్ వంటివితప్ప — ఇంకేతప్పులూ ఆకాశవాణిలో రాగూడదు. ఎందుకు రావాలి, అసలు? వార్తలు చెప్పేవారు (అనౌన్సర్లు కూడా) డిగ్రీ గలవారుగా ఉండాలి అని విన్నాను. ఈ డిగ్రీ అనేది తెలుగు ప్రధానాంశంగా గలదే ఐయుండాలని మనం అనుకోవచ్చును. డిగ్రీ అర్హతగల అనేకులనుంచి మేలైన అభ్యర్థులనే యెంచుకుంటారుగదా, ఉద్యోగానికి! కనుక వారికి తగినంత విద్యాప్రమాణం ఉండకపోతే అది క్షంతవ్యం కాదు. అంతేకాక, ఆకాశవాణి కేంద్రాలలో పండితులు ('నిలయ విద్వాంసులు') ఉంటారు. వారు అదుపుచేయవచ్చును; చేయవలసి ఉంటుంది గూడా.

ముందు ఉచ్చారణ దోషాలనుగూర్చి చెప్పాలి. చ - జ - ల దంత్య తాలవ్యభేదం అనేకులకు తెలియనట్లు కనబడుతుంది. తెప్పిం చడం, పంచుకోడం మొదలైన మాటలలోని దంత్యచకారాన్ని, అట్లాగే కొన్ని దంత్య జకారాలను నిశ్శంకంగా తాలవ్యాలుగా పలుకు తున్నారు. మరి కొందరు ప్రజలు, లజ్జ మొదలైన చోట్లగల తాల వ్యాన్ని దంత్యంగా పలుకుతున్నారు.

కొందరు కొన్ని హ్రస్వాలను దీర్ఘాలుగా పలుకుతున్నారు. బాంగ్లాదేశ్ (బంగళాదేశ్) 'ఆకాలీదళ్' (అకాలీదల్), ఆస్సామ్ (అస్సామ్) మొదలైనవేకాక, అయస్కాంత, అభివృద్ధి మొదలైన అనేక సామాన్య పదాలనుగూడ (తప్పుగా) పలుకుతున్నారు. నూటా తొంభై, వరదా పరిస్థితి మొదలైనవికూడా వస్తున్నాయి. మరొక ప్రక్క, కశ్మీర్ (కాశ్మీర్), హైదరబాదు (హైదరాబాదు) మొదలైన చోట్ల హ్రస్వాలు తెచ్చిపెడుతున్నారు. పాకిస్తాన్ అనవలసి ఉండగా ఇంచుమించుగా అందరూ పాకీస్తాన్ అంటున్నారు. కొందరు పాకిస్థాన్ అంటున్నారు. ఇట్లా ఎందుకు అంటున్నారో వారికే తెలి యాలి. అసలుమాట పాక్ + ఇస్తాన్; పాకీవారిస్థానంకాదు.

'గ్రామ ప్రాంతాలలో' మొదలైనచోట్ల రేఫశ్లిష్టం పూర్వపు అక్షరాన్ని గురువుచేసేట్లు పలకాలి. అట్లా పలకడంలేదు, కొంతమంది 'వయోపరిమితి' మొదలైన పెద్ద తప్పులుకూడా నిరాఘాటంగా వచ్చేస్తున్నాయి.

అన్యభాషా పదాలను తప్పనిసరియైనప్పుడే వాడడం బాగుం టుంది. తెనిగించి చెబితే, చెప్పవలసినది సరిగ్గా వివరించడం కష్టం

అనిపించదగిన సందర్భాలలో వాడవచ్చును. ఎక్కడపడితే అక్కడ వాడగూడదు. జిల్లాపరిషత్తు అధ్యక్షుడు అనవలసినప్పుడు 'జడ్. పి. అధ్యక్షుడు' అని ఎందుకు అనాలి? దుప్పట్లు అనవచ్చునుగదా! బ్లాంకెట్లు అని ఎందుకు అనాలి? నోటికి ఈమాట వచ్చినది గనుక అనేశాం అన్నట్లుంటే, బాగుండదని నా మనవి.

'ఖర్చు' అనే మాటలోని 'ఖ' ఉర్దూ భాషలోని 'ఖై' అనే అక్షరం. ఆ ఉర్దూ అక్షరం తెలుగులోలేదు. కనుక దానిని 'తత్సమం' చేసుకొని మామూలు 'ఖ'గానే పలుకవలసి ఉంటుంది. అంతేగాని ఉర్దూలో పలికినట్లు పలుకగూడదు.

'వ్యవస్థీకరణం' అనే మాటను ఎందుకు తయారు చేశారో తెలియదు. దానికి ఉద్దిష్టమైన అర్థం 'వ్యవస్థ' అనే పదానికే వస్తుంది. 'వ్యవస్థీకరణం' అంటే, అర్థం కొంచెం వేఱు అవుతుంది. 'సమర్థ వంతంగా' అనగూడదు; సమర్థంగా' అనాలి. 'శోచనీయం' అనవల సినచోట 'శోచనీయకరం' అనేస్తున్నారు. 'వంత(ము)' 'కర(ము)' మొదలైనవి విశేష్యములకు చేరుతాయి; విశేషణములకు చేరవు. 'అసభ్యకరం' అనేదికూడా దుష్టరూపమే. అసభ్యం అనాలి. 'ఆర్థి కంగా' 'సాంకేతికంగా' అనవలసి ఉండగా, ఆర్థికపరంగా, సాంకేతిక పరంగా అనడం సరికాదు.

'చేయవలె' అనే దానికి వ్యావహారిక రూపం 'చేయాలి' అనేదిగదా! 'చేయాలె' అన్నప్పటికీ ఫరవాలేదు. 'చేయవాల' అనడం అసమంజసం. గ్రాంథికాన్ని వ్యావహారికం చేశాము. కొన్నిచోట్ల గ్రామ్యం చేశాము. అంతకంటె పతనమూ, మఱి? రెండు అనడానికి బదులు 'రొండు' అనికూడా అంటున్నారు. ఇటువంటివి గ్రామ్య వ్యవ హారిక చర్చలలోకి వచ్చేవికావు. వ్యక్తిగతపు 'ఇడియోసింక్రసీ'లు అవుతాయి.

మఱికొన్ని 'ఇడియోసింక్రసీ'లుకూడా ఉన్నాయి. వార్తలు చదివేవారిలో కనీసం ఒకరు "ఆకాశవాణి... వార్తలు... చదువు తోంది..." అన్న మాటలను చాలా వికృతంగా పలుకుతున్నారు. కొందఱు చదివేటప్పుడు ఊపిరి నిండుగా పూరించలేనట్లు, ఊపిరి ఖర్చుకాకుండా చూచుకోవాలన్నట్లో, చదువుతున్నారు. అది నిజంగా ఓపిక లేకపోవటం కాదని తోస్తుంది.

మన రాష్ట్రంలోనేగాక, ఇతర రాష్ట్రాలలోను, అన్య దేశాల లోనుగూడా ఉన్న పెక్కు కోట్లమంది ఆంధ్రులు వినవలసిన—వినదగిన—ఆకాశవాణి ఆంధ్రభాష, దాని ఉచ్చారణమూ నిర్దుష్టంగా, మార్గదర్శకంగా ఉండాలి. ఆకాశవాణిలో వచ్చినది గనుక, ఇది తప్పుయి యుండదు!' అనిపించేట్లు ఉండాలి.

చివుకుల వేంకట సుబ్బావధానులు,

నూ జి వీ డు.



# గ్రంథ విమర్శలు

## మహాభాగవతము (ప్రథమ భాగము)

[వచనానువాదము: అనువాదకులు, శ్రీ యామిజాల పద్మనాభ స్వామి. డెమ్మీ 14 + 526 పుటలు. వెల : రు. 30/-. ప్రకాశకులు- త్రివేణి పబ్లిషర్స్ (ప్రైవేట్) లిమిటెడ్, మచిలీపట్టణము-521 001]

భాగవతాన్ని వచనంగా రచించిన రచయితలు చాలామంది ఉన్నారు. కొందరు వ్యావహారిక భాషలోనూ, కొందరు సలక్షణ భాషలోనూ రచించారు. ఇన్ని రచనలు రావడానికి భాగవత ప్రాశస్త్యమూ, జనసామాన్యానికి దానిని చదవాలనే అభిలాషా ముఖ్య కారణాలు. సుప్రసిద్ధ రచయితలు యామిజాల పద్మనాభస్వామిగారు కొన్నేళ్ళక్రిందటనే భాగవత వచనరచనను వ్యావహారిక భాషలో సాగించి ఆంధ్రప్రభ దినపత్రికలో మూడు సంవత్సరాలు ప్రకటించి పూర్తిచేశారు. ఈయన పోతనామాత్యుని భాగవతాన్ని ముందుంచుకొని, అతని వలెనే రసవంతంగా రచించారు. ఏవిషయాన్నయినా సంగ్రహంగా కాక, అందరికీ సులభంగా బోధపడే రీతిని విపులంగా వ్రాయడంవల్ల గ్రంథం మిక్కిలి పెద్దదిగా తయారయింది. పత్రికలో పడిన దానిని పుస్తకంగా ప్రకటించే భారాన్ని మచిలీపట్నం త్రివేణి పబ్లిషర్సు వహించారు. ఈ ప్రథమభాగ సంపుటంలో నాలుగు స్కంధాలున్నవి. ఇంకా ఎనిమిది స్కంధాలు రావలసి ఉన్నవి. అవి త్వరలోనే వెలువడ గలవని ఆశిస్తున్నాను.

దీని "మున్నుడి" లో భాగవత ప్రాశస్త్యాన్ని గురించి అనువాదకులు చమత్కారంగా వివరించడమే కాకుండా పెక్కు విషయాలను ఉగ్గడించారు. ప్రతిభావంతులు, వివిధ విషయాలలో నిష్ణాతులు, భాగవతాన్ని గురించి గొప్ప పరిశీలనచేసి, పెక్కు సంపుటాలలో దాని వైశిష్ట్యాన్ని వివరించి ప్రకటించినవారూ, లోక హితైషులూ, నిస్వార్థపరులూ అయిన కులపతి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యగారు దీనికి 'ఆశంసనం' అందించడం గొప్ప విశేషం. అయన, మనకు అత్యంత ప్రధానాలయిన భారత, భాగవత, రామాయణాలను గురించి తెలుపుతూ- "ధర్మ స్వరూప నిరూపణము, కర్తవ్య నిర్వహణము, భవబంధ విమోచనము అను మూడంశములు మానవ ధర్మమునకు మూడు స్కంధములు. అందు మొదటి దానికి శ్రీమహాభారతము, రెండవ దానికి శ్రీమద్రామాయణము, మూడవ దానికి శ్రీమద్భాగవతము వర్ణనములుగా నరజాతికి ప్రసాదించబడినవి" అని చాలా చక్కగా, సూత్రప్రాయంగా నిర్వచించారు. ఆ అంశాలను మనస్సులో పెట్టుకొని ఆయా గ్రంథాలను చదివితే తగిన ప్రయోజనం ఉంటుంది. భాగవతం భక్తి ద్వారా మనస్సును నివృత్తి మార్గంలోకి మళ్ళిస్తుంది. దానికి తగిన రచన పోతనామాత్యునిది. పోతన మహాకవి ఆశయాన్ని సామాన్య మానవులకు అందించడానికి యామిజాలవారి యీ వచన రచన ఎంతగానో ఉపయోగిస్తుంది. ఇందులో సరళమైన వాడుక భాషలో రసవంతంగా విషయం వివరించబడింది.

ముద్రణ చాలా చక్కగానూ, నిర్దుష్టంగానూ జరిగింది. జాకెట్ మీది చిత్రం మనోహరంగా ఉన్నది. ఇట్టి మంచి గ్రంథాన్ని రచించిన పద్మనాభస్వామిగారూ, ప్రకటించిన త్రివేణీ పబ్లిషర్సువారూ తెలుగు వారికందరికీ అభినందనీయులు.

**శ్రీ బులుసు వేంకట రమణయ్య**

## అన్న విజ్ఞానము

[గ్రంథకర్త : శ్రీ ఎస్. టి. వి. రాజగోపాలాచార్యులు. ప్రతులకు : గ్రంథకర్త పేర, భీమవరం-2, ప॥ గో॥ జిల్లా. వెల : రూ. 6/-.]

నరలోకమే కాక, సురలోకం కూడా అన్నం అంటే ఆర్రు చాస్తుందని అందరూ అనే ఒకేమాట. నేలపై ప్రాకు చీమలు మొదలు రెక్కలతో ఎగిరే పక్షులుదాకా ఉన్న జంతుజాలం కూడా అన్నానికి మూగుతుంది. అన్నం అక్కరలేని ప్రాణి ఉండదు.

అలాగే అన్ని దానాలలో అన్నదానానికి ఉన్న ఘనత ఇక దేనికి లేదని 'నాన్నోదకసమం దానమ్మని సనాతనోక్తి'

'అన్నం పరబ్రహ్మ స్వరూప'మని వైదికోక్తి.

అలాటి అన్నం గురించి వివిధ రీతుల పరిశోధనతో ఆచార్యులుగారీ గ్రంథం సంతరించారు.

ఇందున్న ఇరవైరెండు శీర్షికలూ అన్నానికి సంబంధించిన తత్వబోధ చేస్తాయి. ఉపనిషత్తులను, భారతాది మహాగ్రంథాలనూ ఉదహరిస్తూ చేసిన యీ రచన తెలిసినవారికీ, తెలియనివారికీ కూడా నిత్యమూ చేతుల్లో ఉండవలసినదని నా అభిప్రాయం.

అన్నం ఎలా ఆరగించాలనేది కూడా తెలియని విధంగా నాగరకత ముదర పాకంలో ఉన్న యీ కాలములో ఈ గ్రంథం ఆత్మబోధ చేస్తుందని అనుకున్నాను.

మగపిల్లలకు, ఆడబిడ్డలకు అన్నప్రాశన ఎలా ఎప్పుడు చెయ్యాలనే ప్రాథమిక సూత్రం మొదలుగా వార్ధకావస్థ వరకూ భుజించే విషయానికి సంబంధించి తెలుసుకోవలసినది యిందున్నది.

అతిథికి అన్నం పెట్టిన ఒక గృహస్థుకి సంబంధించిన చిన్న కథ చాలామందికి తెలియదేమో. అది తప్పక చదివి తెలుసుకోవలసేది.

అన్నం వండడం ఎలాగ? ఏలాటి అన్నం తినకూడదు? ఈ ప్రశ్నలకి యీ గ్రంథం మంచి సమాధానమిస్తుంది.

తరించడానికి జ్ఞానం అవసరం. అజ్ఞానం అన్నంవల్ల కలుగుతుంది. అన్నం గొప్పదనం అలాటిది. అని కాశీక్షేత్రకథ మూలంగా సమర్థించి అన్నపూర్ణాదేవిని జ్ఞాన ప్రదాత్రిగా గ్రంథకర్త సమర్థించారు. ఇలాగే చాలవిషయాలు తెలిసి ఆచరించ వలసేవి యిందు గోచరిస్తాయి. ఉత్తమోత్తమమైన సజీవ గ్రంథం ఇది. సర్వులూ సమాదరంగా చదవ వలిసేది.

పీరు దివ్యపురుషులు కాక మరెవరవుతారు?

జపతపాలూ, ధ్యానాలూ, మౌనాలూ, దానాలూ ఇలా ఏవేవో సాధనాలున్నాయి తరించడానికి. అన్నిటినీ మించినది, సులభమైనది భక్తి. అదికుదిరితే అ దేవుడనిపించుకున్నవాడు ఆ భక్తుని దగ్గరకు దిగివస్తాడు. ఈ త్రోవను చూపిన మహనీయులు దివ్య పురుషులే అవుతారు.

ఆదిశంకరుడు మొదలు అందరూ చివరకు చెప్పినది అదే. దానికే మనసు కుదురు కాకపోతే అఘోరించడమే...

ఇందలి దివ్యపురుషుల జీవిత విషయాలు చదువరి కళ్లకు కట్టినట్లు శాస్త్రిగారు సరళమైన భాషలో చెప్పారు. అయనకి పలుకుల తల్లి అలాటి నేర్పు కలిగించి ధన్యుణ్ణి చేసింది. ప్రజ్ఞానం, విజ్ఞానం అని వాదోపవాదాల జోలికి వెళ్లనక్కరలేక సుగమమైన రీతిని శాస్త్రిగారు ఈ గ్రంథం రూపొందించారు. ఆస్తికులూ, నాస్తికులూ కూడా చదవదగిన గ్రంథం.

## దివ్యపురుషులు (సచిత్ర, సంక్షిప్త జీవితాలు)

[రచయిత : శ్రీ సోమంచి అనంతపద్మనాభశాస్త్రి. ప్రతులకు : రచయిత పేర, వివేకవాణి పబ్లికేషన్సు, సూర్యారావుపేట, కాకినాడ. వెల రూ. 15/-.]

ఆచార్య శ్రీ శంకరులు, రామానుజుడు, చైతన్యుడు, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, స్వామి రామతీర్థ, అరవిందుడు- ఈ గ్రంథమునందు కనిపించే దివ్యపురుషులు,

డా॥ శేషగిరిరావుగారు చెప్పినట్టు అంతరవలోకనములో ఇది అష్టదళ పద్మం. ప్రతి దళమూ విశిష్ట పరిమళ గుణభరితమే. శాస్త్రిగారి హృదయసరస్సు సురనర మాననీయమైన మానససరస్సని నేనంటాను. అలాటి సరసిలో పుట్టిన పద్మాలెలాటివి? అని ఏ పిచ్చివాడూ ప్రశ్నించడు.

మానవ రూపములో శంకరుణ్ణి చూపించిన మహనీయుడు ఆది శంకరుడు. మత ప్రచారానికి అవతరించాడా అని అనిపించుకున్నాడు రామానుజుడు. దైవికమైన చైతన్యజ్యోతిని వెలిగించినవాడు చైతన్యుడు. ముగురమ్మల మూలపుటమ్మను మనిషిగా మనీషిగా మానవులకు చూపిన దివ్యపురుషుడు రామకృష్ణపరమహంస. నరుని మానవావతారం వివేకానందుడు. దైవతత్వానికి తీర్థం రామతీర్థుడు. సావిత్రీస్వరూపాన్ని మానవ నేత్రాలతో చూసిన అదృష్టశాలి అరవిందుడు.

## బుద్ధపురాణము

[కృతికర్త : శ్రీ పెన్మెత్స రాజంరాజు. ప్రాప్తిస్థానము : కృతికర్తపేర, శ్రీవాడు దేవాశ్రమం, చోడవరం, (వయా) తాడేపల్లిగూడెం, ప॥ గో॥ జిల్లా. వెల : 10 రూ. తొమ్మిది పర్వాల బృహత్పద్య కృతి.]

సంఘమూ, ధర్మమూ స్వరూపంగా అవతార పురుషుడైన బుద్ధుని చరిత్ర దీనియందు వివిధ విషయాత్మకమై సర్వులకూ పఠనీయమైన పవిత్ర చ్ఛందోరూపాన గోచరమవుతుంది.

'సత్యాన్వేషి' గా ఒక గుప్తనామధేయుని 'పర్యాలోచనం'. బుద్ధుని దివ్యవ్యక్తిత్వాన్నేకాక కవి భవ్యవ్యక్తిత్వాన్నికూడా సువ్యక్తం చేస్తుంది. గ్రంథముపై అభిప్రాయం వ్రాయడం అంటే ఇల ఉండాలి. ఈ కాలములో చాలామంది పెద్దలు 'ధార ధారాళంగా ఉంది. అచ్చు ముచ్చటగా ఉంది. నిర్దుష్టమైన కవిత.'— అని ఏవేవో వ్రాస్తారు. ఆ గ్రంథాలు చూస్తే కావలసినన్ని దోషాలు కనిపిస్తాయి ఏమనుకోను ...

ఇందలి పర్యాలోచనం చదివితే గ్రంథం మరి చదవనక్కలేదనిపించి తప్పక చదవాలనిపిస్తుంది.

బుద్ధుడు అవతారపురుషుడు. జ్ఞాని. ఆత్మోపాసకుడు. అహింవాది- అని వేరే చెప్పనక్కరలేదు. కాని బుద్ధుడు కాకముందు ర

నందనుడుగా ఉన్నపుడు ఎలా ఉండేవాడు ? అనే జిజ్ఞాసని యిందు చక్కని సమాధానం లభిస్తుంది. రాజారాజుగారి యీ గ్రంథం చదివితే బుద్ధుని గురించి వేరే యే గ్రంథమూ చదవనక్కరలేదని నాకు తోచింది.

ఇక - కవితా పద్ధతి గురించి - తనకు అట్టే చదువులేదనీ లక్షణాలు తెలియవని రాజుగారన్నారు. బాగా చదువుకుని లక్షణాలు తెలుసు ననిపించుకున్నవారి కవితకి వీరి కవిత ఏ మాత్రమూ తీసిపోదని నా అభిప్రాయం.

రచన ఆమూలాగ్రం సలక్షణంగానే సాగింది. ఈ పురాణ గ్రంథమునందు చివరిభాగం బుద్ధగీత నిదానంగా చదివి అర్థంచేసుకోవలసిన రెండో భగవద్గీత.

ఈ బుద్ధపురాణం అధునికాంధ్ర వాఙ్మయ చరిత్రలో ఉత్తమ స్థానం పొందదగినది.

# భారతీయ ధర్మ ప్రసంగము మరియు భగవదాశ్రయుము, శ్రీకృష్ణసందేశము యోజనగంధి, కవిమహిమ

[రచయిత : శ్రీ చక్రపర్తుల పద్మనాభశాస్త్రి. ప్రతులకు : రచయిత, కాటవరం (పోష్టు), కోరుకొండ తాలూకా, తూ॥ గో॥ జిల్లా. వెల : రూ. 8/-.]

'భారతీయ ధర్మ ప్రసంగము'- గద్యరచన. మిగిలిన నాలుగూ పద్యభాగాలు.

భారతీయ ధర్మ ప్రసంగము నందు రామాయణ విషయముగా ముఖ్యపాత్రల స్వరూపస్వభావాలనూ వాటి ఆంతర్యమునూ యుక్తి సహంగా విమర్శించి వివరించారు శాస్త్రిగారు.

రావణుని దశశిరసత్వమును గూర్చి వివరించిన విషయం హేతు బద్ధంగా ఉన్నది. అలాగే సేతునిర్మాణమూ దాని ఆంతర్యమూ విజ్ఞానపరంగా బోధించారు.

రామాదుల జననం గురించి చెప్పినది శాస్త్రసహనమైన విషయం. ఇలాగే శ్రీకృష్ణ కథకు సంబంధించిన విషయం శాస్త్రిగారి లౌకికాధ్యాత్మిక విషయ వివేచనాదృష్టికి ప్రతిబింబమైఉన్నది. కాగా ఆయా కథలనుంచి లౌకికంగానూ, పారమార్థికంగానూ తెలుసుకోవలసే జీవితరహస్యాలను ఎదురులేని తీరున చెప్పడంలో శాస్త్రిగారి విద్యానేతృత్వం సహస్రశీర్షంగా కనిపిస్తుంది.

పద్యభాగాలలో చిన్నచిన్న కథలూ వాటినుంచి గ్రహించవలసే లౌకిక పారమార్థిక నీతి గోచరిస్తాయి. వాటిలో శ్రీకృష్ణ సందేశం సమర్థులైననటులు రంగస్థలంమీద మాటాడుతూన్నట్టుంటుంది.

వీటిలో ముఖ్యంగా చెప్పవలసేది

కవిమహిమ. ఒకపద్యం ఉదాహరిస్తాను చూడండి :

'మాయలు పన్ని కొంపలను
మాపెడి వారలెటుల పెద్ద లిం
కే యిల ధర్మమెట్లు పయికెక్కునో ?
యీ దురితంబు డింద దే
వా ! యిక నేని మేల్కొని
ప్రపంచపు తప్పుల దిద్దుమో ప్రభూ !
హాయి లభించు లోకమునకంతకు
నీపటు చేయు దేనియున్'-

చక్కని కవిత. చదవడానికి తీయగా హాయిగా ఉంటుంది. ఈ లాటి గ్రంథాలు ప్రచారంలోకి వస్తే కవి మహిమ కొంతకి కొంతైనా తగ్గుతుందని నా అభిప్రాయం.

# శివానందలహరి

[రచన, ప్రచురణ : శ్రీ కలువకొలను సదానంద, పాకాల - 517112, చిత్తూరుజిల్లా. వెల : రు. 12/-]

దీనిలో శివునకు సంబంధించిన కథకు చాలావరకు, ఒక విధంగా శైవతత్వాన్ని బోధించడానికి ప్రాచీన ఋషులు వేసుకున్న కథాప్రణాళికకు ఇది శుద్ధ చైతన్య రూపకళ-అని చెప్పవచ్చు. శివుడు లేనిదే శక్తి, శక్తిలేనిదే శివుడు లేరని అదిశంకరుడు స్పష్టంగా చెప్పకపోయినా ఆ మూర్తిద్వయాన్ని ఒక్కటిగా చెప్పడం ఆయన గ్రంథాలను నిశితదృష్టితో చదివితే తెలుస్తుంది.

సృష్టి-స్థితి-సంహారం-అనే యీ మూడూ ముగ్గురుమూర్తుల వల్ల వేర్వేరుగా జరుగుతూ ఉంటుందనేది సర్వసామాన్యమైన పురాణ వచనం. వారే వరుసగా బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులు.

ఈ ముగ్గురూ సామాన్యపరిధిలో ప్రవర్తించే ఉద్యోగులనీ, వీరిపై అధికారం చెలాయించే ఒక స్త్రీమూర్తి ఉందని ఆమె పరాశక్తి అనీ దేవీమహిమను ప్రపంచించే ఇతిహాసాలు చెప్తాయి.

# తెలుగు సంస్కృతికి వెలుగు తోరణం



తరతరాల తెలుగుజాతి సంస్కృతీ సంప్రదాయాలను పరిరక్షించి, సాంస్కృతిక ఔన్నత్య సాధనకు దృఢమైన దీక్షతో శ్రీ ఎన్. టి. రామారావుగారి నాయకత్వాన ఉన్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు జాతి ప్రాభవశ్రీలు నలుదిక్కులకు విస్తరించే నూతన పథకాలతో పలు కార్యక్రమాలను ప్రారంభించింది.

- ★ తెలుగు సాంస్కృతిక వైభవానికి దోహదంచేసే 'తెలుగు విశ్వవిద్యాలయం' స్థాపన
- ★ ప్రత్యేక కళా రూపాలను ప్రోత్సహించడానికి ఆధునిక ఆడిటోరియంతో కూడిన జిల్లా సాంస్కృతిక కేంద్రాల ఏర్పాటు.
- ★ జిల్లా, రాష్ట్ర స్థాయిల్లో నృత్య, నాటక, సంగీత పోటీల నిర్వహణ
- ★ వివిధ సాంస్కృతిక రంగాలలో యువ కళాకారులకు ఆర్థిక సహాయం.
- ★ ఉపకార వేతనాల ద్వారా యువ కళాకారులకు నిష్ణాతులైన గురువులవద్ద శిక్షణ.
- ★ రాష్ట్రస్థాయి గేయ, నాటక విభాగం ఏర్పాటుకు కార్యక్రమాలు.
- ★ ప్రాచీన అముద్రిత గ్రంథాలను గుర్తించి ప్రచురించడం.
- ★ 1975లో ప్రారంభించిన తరతరాల తెలుగుజాతి సంగ్రహాలయాన్ని సత్వరం పూర్తి చేయిడానికి ఏర్పాటు.
- ★ మంగళవాయిద్యమైన నాదస్వర వాయిద్యం అభివృద్ధికి సంగీత కళాశాలల్లో ప్రత్యేక విభాగాల ఏర్పాటు.
- ★ ప్రయివేటు సంగీత కళాశాలలకు గుర్తింపు ఆర్థిక సహాయం.
- ★ పేద, వృద్ధ కళాకారులకు ఆర్థిక సహాయం.
- ★ వివిధ అకాడమీల కార్యక్రమాల క్రమబద్ధీకరణ.
- ★ స్వచ్ఛంద సాంస్కృతిక సంస్థలకు ఆర్థిక సహాయం.
- ★ ప్రముఖ సంస్కృతీ మూర్తుల పేర ఉత్సవాల నిర్వహణ.
- ★ వివిధ రాష్ట్రాలమధ్య సాంస్కృతిక అవగాహన, సత్సంబంధాల పెంపుదలకు సాంస్కృతిక బృందాల పర్యటన నిర్వహణ.
- ★ హైదరాబాదులో బుద్ధపూర్ణిమ ప్రాజెక్టు వద్ద సిద్ధార్థుని, ఇరవై అయిదు ఇతర మహానుభావుల విగ్రహాల ప్రతిష్ఠాపన.

గతమెంతో ఘనకీర్తికల తెలుగుజాతి సాంస్కృతిక వైభవ పునరుద్ధరణకు అంకితమైంది -
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

సమాచార, పౌర సంబంధాలశాఖ, హైదరాబాదు.

DIPR No 08934/Advt/II C4/84,

ఇక శివుడు - సదాశివుడు - అనే మూర్తులలో సదాశివుడు పైవాడని ఒక నిర్వచనం ఉంది.

కేవలం అమరకోశాన్ని చదివి యీ పేర్లన్నీ ఒక్కరివే - అనే నిర్ణయానికి రావడం సముచితం కాదని నా అభిప్రాయం.

శ్రీ సదానంద సంతరించిన యీ గ్రంథములో ముందు బ్రహ్మ విష్ణువుల ప్రస్తావన చేసినవారికి శక్తిసంయుక్తుడైన పరమేశ్వరుడు ప్రత్యక్షమై సృష్టికార్యం నిర్వహించే ఉద్యోగం ఇచ్చినట్టు ఉంది. ఆ పరమేశ్వరుడే శివనామములో సర్వోపాస్యదైవం అయాడని భావం,

మహిషుని కథను విమర్శించిచూస్తే సృష్టిస్థితి లయకారులకు కూడా అందని శక్తిరూపిణి వేరే ఉందని విశ్వవిదితమైన విషయం. ఆశక్తిని ఇందు 'త్రికళ' — అనే పేరుగల దేవిగా తెలుసుకోవలసి ఉంది.

మూడు కళలు గలది. అ మూడు కళలు తెలుపు, ఎరుపు, నలుపు. సత్వరజస్తమోగుణాలను స్ఫురింపజేస్తాయి అవి.

ఈ విధంగా శైవ శైవీ సంబంధమైన తత్వాన్ని అందరూ తెలుసుకునే విధంగా వాటికి సంబంధించిన కథలను వివరిస్తూ శ్రీ సదానంద రూపొందించిన యీ కృతి సార్థక నామంగా ఉందని నా అభిప్రాయం. చాలా మందికి తెలియని కథలుకూడా కొన్ని ఉన్నాయి.

భీమాసురుడు, ఘుశ్న, దూషణాసురుడు (రామాయణంలో వచ్చే దూషణుడుకాదు) మొదలైనవి.

బాల సాహిత్య కర్తగా చల్లని చక్కని మాటలలో కథలు వ్రాసి ప్రసిద్ధుడైన శ్రీ సదానంద యీ 'శివానందలహరి'లో పౌరాణిక విశిష్ట విషయ వ్యాఖ్యాతగా నేటి వాఙ్మయ చరిత్రలో సముచితస్థానం సంపాదించుకున్నాడని నిస్సంకోచంగా చెప్తున్నాను.

ఈయన గ్రంథానికి ముద్రణార్థం ఆర్థికసహాయం అందించిన తిరుమల తిరుపతి దేవస్థానంవారూ విశిష్టభావగర్భితమైన ముఖప్రత చిత్రం సంతరించిన సుప్రసిద్ధ చిత్రకారుడు శ్రీ బాపు, ముద్దుగా ముచ్చటగా ముద్రించిన శ్రీ ధనికొండవారూ అభినందనీయులు.

# దాక్షిణాత్య భక్తులు

[రచన : శ్రీ రావినూతల శ్రీరాములు, ప్రతులకు శ్రీ తూముల కుంట భీమసేనరావు, 6/561, రాంనగరు, అనంతపురం-515004. మూల్యం : 5 రూ.]

ఒక్క కృతిలో వేంకటేశ్వరుని ముందున్న తెరను తీయించిన త్యాగరాజు, కృష్ణుణ్ణి తన గాత్ర తరంగాలలో ఊగించిన నారాయణ తీర్థులూ, రాముడికి ఇల్లు కట్టించి చెరసాలపాలైన రామదాసు, గోపాల కృష్ణునికోసం విరహోత్కంఠితయైన క్షేత్రయ్య విఠలదేవునిచేసాక్ష్యం ఇప్పించుకున్న పురందరదాసు, నీళ్లుమోసే బ్రాహ్మణుని నెత్తిన అక్షతలుచల్లి సుధాగంధ విషయాలు చెప్పించిన విజయదాసు, ఒక్క పాటతో మదగజంచే ప్రదక్షిణాలందుకున్న అప్పర్, తన దేవునిచే గుంటనక్కలను గుర్రాలుగా మార్పించిన మాణిక్యవాచకర్, తాను కూర్చున్న గోడను నడిపించిన జ్ఞాన్‌దేవ్-ఎదురు తిరిగిన మదగజాన్ని ఒక్క చూపుతో సాధువునుచేసిన స్వాతి తిరునాళ్-వంటి భక్తశితో మణుల జీవితాలు ముఖ్యంగా తెలుసుకోవలసే సంఘటనలతో లలిత మైన కథాసరణిలో వ్రాసి శ్రీరాములుగారు కృతకృత్యులయ్యారు. చదవవలసే రచన.

ఈ పవిత్రకృతికి సాహిత్యబంధు శ్రీ తూముకుంట భీమసేన రావుగారూ భర్తకావడం తిరుపతిదేవస్థానంవారు ముద్రణ వ్యయానికి చేయూత ఇవ్వడం బహుధా ప్రశంసనీయం.

# శ్రీ రమణస్మరణ లహరి

[రచన : శ్రీరామచంద్ర కౌండిన్య. ప్రతులకు : శ్రీ రావి నూతల శ్రీరాములు, 6/561-A, రామనగర్, అనంతపురం-4 వెల : రు. 2/-]

> 'ఎఱుక గలిగినట్టు లేర్పడు బలుకుచు
> ప్రతిభ నెఱప జూచువారి ప్రశ్న
> వారి మౌనమూని పరిహసించెడి స్వామి
> రమణలీల లెఱుగరావె ఘనస!'...

ఈ పద్యం 'రమణ స్మరణ'లోనిది. వేదాంతం వేదాంతం అం ఏవేవో పెద్ద మాటలాడుతూ మసిపూసి మారేడుకాయచేసే పండిత మానులకు పరోక్షంగానూ, ప్రత్యక్షంగానూ చెప్పే సూత్రాలీపద్యాలని నేననుకున్నాను.

> 'తండ్రి నడిపింప విషమసాధన పథాన
> అనుపమ దయాత్మ నిర్మలమైన జనని
> అసుభ సంస్కృతి వార్ధినుద్ధర్త గురువు
> పదజుషులకీవె యీ యాత్రిరూపములు రమణ!'

ఈ పద్యం 'రమణలహరి'లోనిది. మూలరచన నేపాలదేశవాసి శ్రీ ఉపాధ్యాయ నరేంద్రకేసరిశర్మ. దానిని శ్రీరామచంద్ర కౌండిన్య తెనుగు సేత

'స్కందుని మానవజన్మ శ్రీ రమణుడు.' అని గణపతికి నరవేషధరుడైన శ్రీవాసిష్ఠ గణపతిముని నిర్వచించినది చాలామందికి నిర్వివాదంగా అంగీకార్యమయింది.

దక్షిణామూర్తి అవతారమని ఒకప్పుడు నేనన్నాను. ఔను గాబోలన్నారు సభ్యులు. ఈ రామచంద్రుని యీ పద్యకృతి చదివితే నా మాట కాదనలేరని నా అభిప్రాయం.

పెద్దపెద్ద గ్రంథాలజోలికి వెళ్ళనక్కరలేక మానవుడు సుస్థిరమైన వస్తు తత్వమును ఈ కృతివల్ల తెలుసుకోగలడు. శ్రీ రమణ సత్సంగం (అనంతపురం) వారు దొడ్డపనిచేశారు. దీని ముద్రణకు తిరుపతి దేవస్థానంవారు చేయూత ఇవ్వడం సత్కార్యమేకదా!

## మిల్లి కవితా సెభాషితాలు

రచయిత : శ్రీ భాగవతుల ఉమామహేశ్వరశర్మ, ప్రతులకు శ్రీ వి. కాళిదాస్, విర్డినివాస్, ఎమ్; రోడ్, బిస్టుపూర్, జంషెడ్ పూర్-831001. మూల్యము : 5 రూపాయలు.]

దీనిలో 4 పద్యాలూ, 3 కాండలూ, 1 సూక్తం - చివర భరతవాక్యం ఉన్నాయి. ఆంధ్రపర్వమే ఆదిపర్వం. 'ఆంధ్రత్వమన్నా ఆంధ్రభాషన్నా పుణ్యంచేసుక పుట్టాలిరన్నా' - అని ప్రారంభించి 'వందే మాతరం యింకెంతమాత్రం బొంది ఒడ్డటంకాదే మాతరం' - అనే పాదముతో భరతవాక్యం పాడుతుంది.

రచయితకి మంచి భావుకత, పదప్రయోగ చాతుర్యం సమృద్ధిగా ఉన్నాయి. ఇందలి కవనం కదంబవనం లాంటిది లోకోక్తులు చక్కగావాడే నేర్పు ఉంది.

'పంచదారకన్న పాయసాన్నముకన్న
తేనె రుచులకన్న తెనుగు మిన్న' - అని వ్రాసిన రచయిత
'కొజ్జాలుకూడా ఎన్నికల్లో నిలబడతారట.
మహా యిప్పుడున్నవాళ్లు మగవాళ్ళయినట్టు' -
'తల్లివచ్చి కసిరి పిల్లం పంపేసి
తానె చూడలాగె శ్వానకేళీ' - వంటి పాదాలు వ్రాయడం తాను తన భాషను యోషను రచ్చకెక్కించినట్టుగా తోచింది నాకు. 'శ్రీపర్వం' శీర్షికతో వ్రాసిన వ్రాత మరీ రసాభాసుగా ఉంది.

ఉన్నది ఉన్నట్లు చెప్పడంకూడా అనడానికీ వినడానికీ ఇంపుగా ఉండాలి. 'నాయిష్టం'-అనే మూడో త్రోవరికి సంఘం సరళమైన సమాధాన మియ్యదు. 'సుందరకాండ' శీర్షికతో వ్రాసినది 'బలే! సెబాస్' అనిపించింది. చక్కని ఉపమానాలు, చక్కని పదబంధం — దానిని తప్పిస్తే 'సెభాషితాలే' — అన్నిన్నీ. సహృదయులు సుభాషితాలుగా గ్రహించరు.

శ్రీ యామింజాల పద్మనాభస్వామి

## హిస్టరీ ఆఫ్ ఆంధ్రా మువ్‌మెంట్

(రెండు సంపుటములు - 1982.)

[ప్రచురణకర్తలు : 'ది కమిటీ ఆఫ్ హిస్టరీ ఆఫ్ ఆంధ్రా మువ్‌మెంట్' హైదరాబాద్. (సాహిత్య ఆకాడెమీ.) మొదటి సంపుటము : 600 పుటలు. వెల : రూ. 15. రెండవ సంపుటము : 600 పుటలు. వెల : 15 రూ.

1967 లో మన ప్రభుత్వం డా. మారేమండ రామారావు, దేవులపల్లి రామానుజరావు, కాళోజీ నారాయణరావుగారలు సభ్యులుగా జి. వి. సుబ్బారావు సంపాదక కార్యదర్శిగా నియమించి, ఆంధ్రోద్యమ చరిత్రను ప్రచురించటానికి నిశ్చయించింది. 1968 లో శ్రీ పప్పూరి రామాచార్యులు, శ్రీమతి కడప రామసుబ్బమ్మ, యం. ఆర్. అప్పారావుగారలు కూడా సభ్యులయ్యారు. 1971 జనవరిలో శ్రీ సుబ్బారావుగారి మరణానంతరం దేవులపల్లివారు సంపాదక కార్యదర్శులయ్యారు.

ఈ కమిటీ బృహత్తరశ్రమ ఫలితంగా, 15 సంవత్సరాల తరువాత వెలువడినవీ రెండు సంపుటాలు.

అయినా ఇంకో లోపముంది. ఇందులో తెలంగాణాకు సంబంధించిన ఉద్యమచరిత్ర, ఉస్మానియా విశ్వవిద్యాలయపు చరిత్రశాఖాధిపతి డాక్టరు సరోజినీ రెగానీగారినుంచి ఇంకా అందలేదు. అదీ అంది మూడవ వాల్యూముగా వస్తేగాని ఇది పూర్తి ప్రచురణ కాలేదు.

1905 లో బెంగాల్ విభజన ప్రతిపాదన, 1906 డిశెంబరులో కలకత్తా కాంగ్రెసు సభలు, 1907 లో కోస్తా ఆంధ్రలో బిపిన్‌చంద్రపాల్ పర్యటనతో ఆంధ్రలో జాతీయోద్యమానికి అంకురార్పణ జరిగింది.

1911 డిసెంబరు ఢిల్లీ దర్బారులో బెంగాల్ విభజన రద్దయింది. బీహార్-ఛోటానాగపూర్-ఒరిస్సాలలకూ, అస్సాంకూ కమీషనరుల నియామకం జరిగింది. దీనితో ఆంధ్రులలో ఆశలురేకెత్తాయి. పన్. నారాయణరావు 1911 లోనే "ఫర్ అండ్ ఎగెయినెస్ట్ ది ఆంధ్రా ప్రావిన్స్" అనే వ్యాససంకలనాన్ని ప్రకటించారు. 1914లో మద్రాసుకు బొంబాయినుంచి దేశోద్ధారకులు "ఆంధ్రపత్రిక"ను తరలించి దినపత్రికను చేశారు.

మొట్టమొదటి రాష్ట్రమహాసభ 1907లో విశాఖపట్టణంలో జరిగితే, 1913 మేలో బాపట్లలో జరిగిన జిల్లా సమావేశంలో ఈ ఆందోళన ఊపిరిపోసుకుంది. తరువాత అనేక మహాసభలు జరిగాయి. ఫిబ్రవరిది 1951 సంక్రాంతి పుణ్యదినాలలో గుంటూరులో శ్రీ గాడిచర్లగారి అధ్యక్షతన జరిగింది.

1937 లో డిసెంబరు మాసంలో ఆంధ్ర విశ్వవిద్యాలయపు విద్యార్థులు ఆంధ్రాభ్యుదయోత్సవాలు ప్రారంభించారు.

రాయలసీమ సమస్యలను గురించి జనవరి 1939 లో నంద్యాలలో శ్రీ కడప కోటిరెడ్డిగారి అధ్యక్షతన ప్రథమ మహాసభ జరిగితే, 1950 లో మద్రాసులో శ్రీ సి. ఎల్. యన్. రెడ్డి అధ్యక్షతన ఆరవ మహాసభ జరిగింది.

1952 ఫిబ్రవరిలో మొదలైన నిరశన వ్రతాలు అన్నీ ముగిసి, అక్టోబరులో అమరజీవి పొట్టి శ్రీరాములుగారి ఆమరణ నిరశనవ్రతం ప్రారంభమయింది. ఆ మహానుభావుడు 58 రోజుల అనంతరం డిసెంబరు 1952 లో (15-12-52) మరణించారు,

ఈ చరిత్ర ఈనాటి యువతరానికి ఎంతమందికి తెలుసు?

ఈ వివరాలన్నిటినీ ఇచ్చిన గ్రంథమిది.

ఎందరో మహానుభావులు ఇందులో మనకు దర్శనమిస్తారు. ఆంధ్రరత్న, దేశభక్త, ఆంధ్రకేసరి, డాక్టరు పట్టాభిలాటి ప్రముఖులే కాకుండా, ఈ మహాసభలలో ప్రముఖపాత్ర వహించిన అనేకమంది మహానుభావులు మనకు కనబడతారు.

కొట్టవచ్చేటట్లు కనబడే లోపాలు రెండు.

1. చివర విషయసూచిక లేకపోవటంతో 'రిఫరెన్సు' గ్రంథంగా నిరుపయోగమయింది, కాదనుకుంటే శ్రమతోకూడినపనిఅది.

2. ఏ ఏ గ్రంథాలు, నివేదికలు ఆధారంగా అనేది ప్రత్యేక పట్టికగా ఇచ్చినట్లయితే ఇంకా ఉపయోగంగా ఉండేది.

## ముగింపుకు ముందు రెండు విశేషాలు

మొదటిది : పానగల్‌రాజా రామరాయణింగారి హయాంలో ఆంధ్ర విశ్వవిద్యాలయానికి అంకురార్పణ జరిగింది. దానికి ముందే 1925లో, బోధనాభాష ఏది ఉండాలి అనే విషయం చర్చకువచ్చి ఓటు అవసరమొచ్చింది. డాక్టరు సి. ఆర్. రెడ్డి కాస్టింగ్ వోటుతో ఆంగ్లం బోధనాభాష అయింది, దీనిని గురించి 'ఆంధ్రరత్న' చాలా వాపోయాడు. మరి సి. ఆర్. రెడ్డి ఆంధ్రభాషా ప్రేమికుడే!

అలాగే దాని స్థలనిర్దేశం విషయంలోకూడా! మొదట్లో అనంతపూరు, రాజమండ్రి, విశాఖపట్టణంలలో బోధనా కేంద్రాలు, విజయవాడలో కేంద్రమూ అనుకున్నారు. కాని బెంగుళూరు, కేంబ్రిడ్జ్ వాతావరణాలకు అలవాటుపడ్డ రెడ్డిగారికది నచ్చలా. విజయవాడను 'బ్లేజ్‌వాడా' అనీ, 'ఇంటలెక్చ్యువల్ సహారా' అనీ ఆయన అనేవాడు. అది చివరకు 'వాల్తేరు' కావడంతో, రాయలసీమ మద్రాసు విశ్వవిద్యాలయానికి అనుబంధమయింది.

ప్రాంతీయ విభేదాలకు శంఖుస్థాపన జరిగింది. ఈ తతంగం పుటలు 490-506 లలో తెలుస్తుంది. (మొదటి సంపుటం)

రెండవ విశేషం : సర్ కొంతి రామమూర్తి రామపాదసాగర్ ప్రాజెక్టుకోసం 1946 నుంచీ ఎలా తంటాలు పడిలదీ, లార్డ్ వేవెల్, వి. పి. మీనన్, నైజాం ప్రభుత్వ ప్రతినిధులు, పండిట్ నెహ్రూ, సర్దార్ పటేల్, ఆర్థికశాఖామాత్యులు జాన్‌మత్తయ్—ఇంతమందినీ కలిసింది, చివరకు గోపాలస్వామి అయ్యంగార్ మద్రాసు ప్రభుత్వం అడ్డు చెప్పిందన్న సాకుతో దానికి తొంటిచెయ్యి చూపిందీ చదవదగిన తమాషాలు (రెండవ సంపుటం పుటలు 482-485)

అలాగే 1951లో కృష్ణా-పెన్నార్ ప్రాజెక్టు. ప్రవహించేదంతా ఆంధ్రజిల్లాలలో, కాని సాగంతా తమిళప్రాంతంలో. చివరకు కేంద్ర ఇంజనీర్ ఖోస్లా నివేదికతో అది ఆగింది.

దాని స్థానంలో "నందికొండ"; దానినే "గోష్టి" సుబ్బారావు గారి సూచనతో "నాగార్జున ప్రాజెక్టు"గా మార్చుకున్నాం.

"తెలుగు గంగ" వివాదాలు గుర్తుకొస్తున్నాయి. తెలుగులో తప్పక రావలసిన గ్రంథమిది. (ఇప్పుడు అకాడమీలు మూతపడతాయి కాబోలు!)

శ్రీ కాకుమాను తారానాథ్.

*Printed & Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.*